# విషయసూచిక




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా!
జయజయ లలనారత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!

---

## ఆశీస్సు

గృహలక్ష్మి కాయువబ్బుత
గృహలక్ష్మికి నిర్మలమగు కీర్తి కలుగుతన్
గృహలక్ష్మికి జయమబ్బుత
గృహలక్ష్మికి సిరిసంపద ఎసఁగుంగాతన్.

—శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి, శతావధాని.

# దసరా

ఈ విశాల ప్రపంచమున సాధారణముగ నశాంతికి కారణము రాక్షసాంశులగు దుర్మార్గులు బలవంతులై సాధులను హింసించు చుండుటయేగదా! అట్టియుపద్రవమునుండి తిరిగి ప్రపంచము నుద్ధరించి సంరక్షించు మహాత్ములను అవతార పురుషులుగ పరిగణించుట సహజధర్మము.

'శ్లో. పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చదుష్కృతాం ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే' అని శ్రీకృష్ణ వాక్యానుసారము ఆదిశక్తి స్వరూపిణియే ఆ మహావీరులయందు ప్రవేశించి తనకర్తవ్యమును వారిద్వారమున జేయించి ధర్మమును నెలగొల్పుచుండును.

అట్టి జగజ్జననిని ఈ నవరాత్ర మహోత్సవ దినంబులలో వివిధ దేశములవారు వివిధ నామములతో ప్రతిష్ఠించి గొల్చుచుందురు.

ఈ పరదేవతను—

'చ. హరిహర పద్మగర్భులును నష్టదిగీశ్వరులెల్ల దేవతల్ పరమమునీంద్రు లందరును భక్తిఁ దలిర్పఁగనే పరాంబికా చరణములర్చించి విలసద్గతినొందుదు రమ్మహేశ్వరిన్ నరులుపూజించు టబ్బురమె' యని బ్రహ్మాదిదేవతలే గొల్చుచుండగా మానవులగు మనము గొల్చుటేపాటిది?

సీ. దేని జపించుటచే నంబుజభవుండు జగముల సృజియించు జాణయయ్యె
దేనిజపించుటచే సురేంద్రుడు రక్షకత్వమునందు ప్రకాశతగనె
దేనిజపించుటచే సుమాప్రియుఁడులయమ్ము సేయఁగ శక్తి నందిమించె
దేనిజపించుటచే నెల్ల దిక్పతుల్ రక్షింప శిక్షింప దక్షులైరి
దేని జపియించు వారికెందేని హాని పుట్టదో యట్టి....

లోకమాతను నిప్పుడు మనము యథావిధిగా దసరాలలో బూజించి నేటి క్లిష్ట పరిస్థితులను నెదుర్కొనజాలు నాత్మశక్తిని గాంచుట ముఖ్యావసరము.

ఇది విప్లవయుగము. ఈ సమయమున ప్రపంచ మెటుచూచినను ప్రశాంతములేని వాతావరణములో మునిగి వేరుమార్గంబు గానక శ్లేష్మములో బడిన ఈగవలె గొట్టుకొనుచు బరితపించుచున్నది. నలుదిక్కుల రజస్తమస్సు లావరించె. సత్యమెటుదాగెనో మచ్చునకైన గనబడుటలేదు. ప్రజానీక మీ ప్రచండ భీభత్సముద్రములో దెన్నుగానక మారణయంత్రముల కాహుతియగుచున్నది.

ఇట్టి పరివేదనార్భటియందు తమోగుణ ప్రధానులగు బలవంతులు కృపారహితులై బలహీనులను జిందర వందరగా చిత్రవధజేయుచు తమ దౌష్ట్యమును విజృంభింప జేయుచున్నారు. సత్యాసత్య వివక్షతసున్న. తెలివి తేటలు విపరీతము. స్వార్థాభిమానము వృద్ధి జెందినది. నీతినియమము లధోగతిపాలైనవి.

ఆసేతు శీతనగపర్యంతముండు మనభారతదేశ మిప్పుడు శృంఖలాబద్ధయై తల్లి దాస్యమునుబోగొట్టిన గరుత్మంతునివంటి పుత్రపుత్రికలకై నిరీక్షించుచు నహోరాత్రంబులు బరితపించుటచే మనకు రణరంగమున దురకవలసిన సమయ మాసన్నమయినది. ఆర్థిక రాజకీయ సాంఘికోద్యమములో జయపతాక మెత్తి ధైర్యముగ నిలువవలసిన భారము మన భుజాస్కంధములపై నిలచియున్నది. నేడు మనము పతితులమై యుంటిమి. కావున మన ప్రాచీన విజ్ఞానమును పీసమునైనను గుర్తింపలేకున్నారము. మన సాంప్రదాయములు మనకు మృగ్యములు. గీర్వాణభాషా సముద్రములోనున్న నీతిరత్నములు దృష్టిదోషమున మనబుద్ధికి బొడగట్టకున్నవి. మన మాతృదేవతకు దూరమై, మనభాషకు దూరమై, మన రుచులకు దూరమై యన్యపదార్థ సంపర్కమున జెడిపోవుచు రెంటికిని చెడ్డరేవడివలెనున్న మనప్రస్తుత జీవితదశను దలచుకొన్న గుండె నీరగుచున్నది. భారతదేశమునకు స్వాతంత్ర్యము రాలేదన్న లోపమేగాక మనకన్నిటలోపమే యని గుర్తింపజాలకున్నాము. సర్వవిధములనైకమత్యములేక వెనుకబడినవారము మనమే. భక్తిశూన్యులము మనమే. నానాటికి మన బుద్ధియునల్లే ఈడ్చుకొనిపోవుచున్నది. రత్నాకరమువంటి ప్రాచీన విజ్ఞానమును జక్కగా నవగాహన మొనరించుకొలేక చేయదగుకర్తవ్యము, చేయదగుకార్యము ప్రాణావసాన పర్యంతము నా భారతాంబను, నా మహాశక్తిని గొల్చు ఘనవ్రతనిష్ఠాపరత్వ మెఱుంగలేక యజ్ఞానులవలె మ్రొక్కుబడుల చెల్లించినట్లు చేయు మూఢవ్రతముల ఫలము నిష్ప్రయోజనము. ఇప్పట్టునచేయదగు వ్రతమెట్టిదో చూపుటకు ఉన్నతాశయములతో నాదర్శికముగ జీవితమును గడుపు 'మహాత్ముడు' మనకిప్పుడు చుక్కానియై మనపాలిటి భగవంతుడై యున్నాడు.

అతని యడుగుదమ్ముల ననుసరించి భక్తివీడక, సంశయముజెందక, విశ్వాసమును వీడక నడచితిమేని త్వరలో నొకదరికి జేరగలము.

మనకాధార భూతుండును, ఏకాకారుండును, లీలామానుష విగ్రహుండును నగు మహాత్మునకు జాలినంత ధైర్య స్థైర్యములను, దీర్ఘాయుర్దాయమును, నోపికయు, శక్తియు గలుగుటకుగాను నీ దసరా పుణ్యదినములలో సర్వకారణక్రియాశక్తి స్వరూపిణియగు ముగురమ్మల మూలపుటమ్మయగు జగజ్జననిని శ్రద్ధాభక్తులతో పూజించవలసిన ధర్మమై యున్నది.



# చెల్లీ! గృహలక్ష్మీ!

నేడు దేశమంతా అల్లకల్లోలంగావుంది. భవిష్యత్తు తెలియని ప్రాణికోటికి 'రేపు' ఎలా మారుతుందో నిర్ణయించడానికి వీలులేకుండావుంది. ప్రపంచమంతా ఆవరించిన భయంకరయుద్ధ మేఘాలచాటున పవిత్రోద్యమాలు మరుగుపడిపోతున్నవి. ప్రతిష్ఠకోసం, పదవులకోసం ప్రాణాలు బలియిస్తూవున్న పాశ్చాత్యజాతి అహింసలోగల ఔన్నత్యాన్ని గుర్తించడములేదు. నవపల్లవ కోమలమగు నారీజాతి సహితం హిట్లర్ రాక్షసుడి మారణాస్త్రాలధాటికి తలఒగ్గింది. దయా-ధర్మాలు తమతమ నెలవులుతప్పి చావడానికి సంసిద్ధంగావున్న సత్య శాంతులలో సమ్మేళనం కాబోతున్నవి. వెలుగురేఖలు మాయమై, విషాదచ్ఛాయలు మానవసంఘం మీద ప్రసరించడం మొదలెట్టినవి.

ఇలాంటి విషమ విషణ్ణసమయంలో నీవు ఆటంకాలన్నీ అధిగమించి 'దసరా'కోసం 'ముస్తాబుకాబోతున్నా'వంటే, నీలో ఏదో మంచి మహత్తువుందనీ, నీ జీవితానికి గొప్ప భవిష్యత్తువుందనీ తేటపడక మానదు.



సోదరీ!

శ్రీ మంతుడైన వీరకేసరి చిన్నిబిడ్డవు. అందగాడైన ఆంధ్రుడు నీభర్త. సాహిత్యమూర్తులు-చక్కని గద్య పద్యాలు నీ సంతానము. పరవళ్లు ద్రొక్కిన తెనుగు పౌరుషసీమలు నీ విహారభూములు. జీరలు వారినప్పటి కిని శిథిలముకాని తెనుగు చిత్రకళలు నీ అభిమాన విద్యలు. నాయకురాలి పౌరుషం, సావిత్రిసతీత్వం, పన్నా ప్రభుభక్తి, మొల్లకవితాస్ఫూర్తి నరనరాల్లో గూడా వ్యాపించిన నారీశిరోమణివి. ఇట్టి నిన్నేమని ఆశీర్వదిం చాలో నాకు తోచడంలేదు. అయినా ఇలా ఆశీర్వ దిస్తాను—

అపశ్రుతి దారులబట్టిన ఆంధ్రుల ఆదర్శాన్ని చక్కని రాజమార్గంలో నడిపించడానికి సవరింపబడ్డ నీ సాహిత్యవిపంచిక సాయపడుగాక! స్వరాష్ట్రి సంకుచిత మైన ఆంధ్రదేశం నీ అమరసందేశాన్ని ఆలకించి వికసించు గాక! సతులు సంతానమునేగాదు, స్థానిక సంస్థలనేగాదు, శాసనసభలనేగాదు సర్వజగత్తును గూడా సం[illegible]ప గల సమర్థులని చాటెదవుగాక! పాశ్చాత్యవిద్యతో బ[illegible] షారుచున్నను ఆంధ్రమహిళామండలి తన ప్రాచీనాంధ్ర సాంప్రదాయాన్ని విస్మరింపదని ముక్తకంఠంతో ఘోషింతువుగాక! నీ మధురమనోహర భావోజ్జ్వల గీతికలు నిద్రాణమయిన ఆంధ్రజాతిని మేల్కొల్పుగాక! నీకు శుభమగుగాక!!

శ్రీమతి కె. రామసుబ్బమ్మ
కడప జిల్లాబోర్డు అధ్యక్షురాలు

# భార్యాభర్తలు

బ్రహ్మశ్రీ
చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు
శతావధాని

★

యీ రెండు శబ్దాలకూ వున్న అర్థాన్ని మన ఆర్యులు బాగా తెలుసుకొని వర్తించినట్లగుపడుతుంది. భృఞ్ భరణే అనే ధాతువునుండి యీ రెండు శబ్దాలున్నూ పుట్టినాయి. భరించతగ్గది. అనఁగా? పోషించతగ్గది భార్య. యెవరిచేత? అని ఆకాంక్ష కలుగుతుంది. ఆకాంక్ష అంటే? శంక. ఆ శంకకు సమాధానం భర్తచేత అనియ్యేవే. స్కూలుమాస్టరీ వగైరా ఉద్యోగాలుచేసి తన పోషణం తానే చేసికొన్న స్త్రీలు మన ఆర్యులలో వున్నట్లు లేదు. వంటలక్కలుగా వుండిన్నీ నీళ్లబిందెలు మోసుకొనిన్నీ జీవించేవాళ్లు అచ్చటచ్చట లేకపోలేదు గాని వున్నప్పటికీ వాళ్లందఱూ భర్త జీవితానంతరం గత్యంతరంలేక ఆలాగు పొట్ట పోషించుకోవలసివచ్చిన దురదృష్టవంతురాండ్రు. 'ఆపత్కాలేనాఽస్తి మర్యాదా' కనక అది స్త్రీ లోకానికి ఆదర్శంకాదు. యీమధ్య పోలండులో కాఁబోలును గత్యంతరంలేక కుక్కమాంసంతిని ప్రాణధారణం చేసికోవలసివచ్చిందని పత్రికలలో చదివినట్లు జ్ఞాపకం. అంతమాత్రంచేత అది ఆ దేశవాసులకందఱికీ మార్గదర్శకంగా వుంటుందా? యేదో ద్వాదశవర్షక్షామంలో విశ్వామిత్రుఁడంతవాఁడుకూడా చండాలుని యింట్లో వండుకున్న కుక్కమాంసాన్ని తినడానికి సిద్ధపడ్డట్టు పురాణాలలో వుంది. అవన్నీ ఆపత్కాల సంప్రాప్తాలే. మనకి ప్రస్తుతం కావలసింది ఆఁడదాని పోషణకోసం ఆఁడది విద్యాభ్యాసం చేయవలసివుంటుందా? అంటే? అందుకోసం విద్యాభ్యాసం చేయవలసివుండదనిన్నీ, జ్ఞానసంపాదనార్థం చేయవలసివుంటుందనిన్నీ నేను అభిప్రాయపడతాను. భార్యా శబ్దానికి వ్యుత్పత్తి తెలుసుకున్నాం గనక యిఁక భర్తృశబ్దానికి తెలుసుకుందాం. భరణకర్త అనఁగా భరించేవాఁడు (పోషించేవాఁడన్నమాట) కనక భర్త అనిపించుకుంటాఁడు. యీ రెండు శబ్దాలున్నూ యిట్టి అర్థంతో పుట్టివున్నాయి. నిమ్నజాతులు, కుటుంబం జరుగుఁబాటు తక్కువగా వుండడంచేత భార్యాభర్తలు యిద్దఱూకూడా పనిపాటలు చేసుకోవడమయితే వుందిగాని వున్నప్పటికీ అంతో యింతో యీ అర్థాన్ని (వాళ్లెఱుఁగనప్పటికీ) పాటిస్తూనేవుంటారు. జ్ఞానార్థంగా స్త్రీ విద్యాభ్యాసం చేయవచ్చునని వ్రాసేవున్నాను. అట్టి విద్యకు డిగ్రీలతో ఆవశ్యకంలేదు. డిగ్రీలవల్ల వచ్చే పుట్టిములకేమిటంటే, కావలసినంత వుంది. డిగ్రీ చదువుకోసం పాఠశాలా ప్రవేశం ఆవశ్యకంగదా? ఉన్నతవిద్య నభ్యసించవలసివస్తే ఆఁడవాళ్లకి ప్రత్యేకించిన పాఠశాలలు విరివిగా లేవుగదా? అందుచేత మొగవాళ్ల పాఠశాలలలోకే వెళ్లాలి. అవెళ్లేనాఁటికి అమ్మాయికి పదహారేళ్లు దాటుతాయి. ఆ సమయంలో మొగవాళ్లతో కలిసి చదవడానికి మన ఆర్యులు సమ్మతించారుకారు. వారిని కొందఱు దుర్మార్గులని అంటే అంటారు గాక! నేను ఆలా అనఁజాలను. మహానుభావులనే అంటాను.

# ఆడదాని పోషణకోసం ఆడది విద్యాభ్యాసం చేయ వలసి వుంటుందా?

"వటునకెంతిపొత్తు వలదు వలదు"

అనే భాగవతాన్ని నేను శిరసావహిస్తాను. 'నమాత్రానస్వస్రానదుహిత్రా' అంటూ ధర్మశాస్త్ర కర్తలు నిషేధించివున్నారు. యిదేకాదు, వున్నతవిద్య నభ్యసించిన వధువుకు వున్నతవిద్య నభ్యసించిన వరుఁడు స్వజాతిలోనే కుదరాలంటే కష్టసాధ్యంగదా? అందుచేత వివాహానికి స్త్రీత్వ పురుషత్వాలున్నూ డిగ్రీలున్నూ మాత్రమే ప్రయోజకాలుగాని బ్రాహ్మణత్వాదికం కాకపోవలసివస్తుంది. దానితో వర్ణ సాంకర్యం ప్రసక్తిస్తుంది. కాలాన్నిబట్టి జాత్యంతర వివాహాన్నికూడా ఆమోదించమంటే నేను అందుకూ సిద్ధమే. (నలుగురితోపాటు నారాయణా, కులంతోపాటు గోవిందా) కాని పూర్తిగా జాతిభేదం అంతరింప చేశాకగాని స్త్రీలకు సాంకర్యకారకమైన వున్నతవిద్యాభ్యాసం పనికిరాదంటాను. ఇప్పుడంటారా? కొడుకుల దుర్నీతివల్లనైతేయేమి కూఁతుళ్ల అవినీతివల్ల అయితేయేమి యెందఱో తల్లిదండ్రులు మంచాలుపట్టి మఱుఁగుతూ వున్నారు. ఆ యీ విషయాన్నిగూర్చి కొన్నాళ్ళక్రిందట 'శివశంకరవిజ్ఞప్తి' అనే పేరుతో కొన్ని వందల చరణాలు, కొంత చేదస్తంగానే అనండి నాకుతోఁచి వ్రాశాను. అందులోన్నుంచి కొంచెం వుదాహరిస్తాను—

కూఁతులఁ గాంచినవారికి పూర్వము కొండంత పుణ్యమనిగద? శంభో!

ఇప్పుడు కూఁతులఁ గాంచినవారికి ఎట్టినరకమో? తెలియదు శంభో!

అల్లుఁడు హరిజనుఁడో? హరజనుఁడో? అన్యుఁడో? తెలియదక్కట! శంభో?

చాలును, యీలాటి వ్రాఁతలువ్రాస్తే యిప్పటి సోదరీమణులలో యెంతోమంది నన్ను యేవగించుకుంటారనిన్నీ యెఱుఁగుదును. అయితే యేంచేసేది. ఆత్మను వంచించి వ్రాయడంమాత్రం యుక్తంగా వుంటుందా? ప్రపంచకమంతా మార్పుచెందుతూ వుంది. యెందుకోసమో? అంటే? స్వరాజ్యంకోసమని పత్రికలవల్ల స్పష్టపడేది. నిన్న మొన్నటినుంచి కాఁబోలును ఆ మాటకూడా అంతగా వినపడడంలేదు. వృథాగా చెడిపోతూవున్నాంగదా! అనుకున్నాను. కొన్నాళ్లు మొగాళ్లు చెడిపోయినా ఆఁడవాళ్ళద్వారా మన సనాతన మర్యాదలు నిలుస్తాయనుకొనేవాణ్ణి. యిప్పుడో? ఆ ఆధారంకూడా అడుగంటిపోతూవుంది. అగ్రహారాలలో వుండే బ్రాహ్మణ బాలికలుకూడా సిగరెట్లపీల్పు ఫేషన్‌క్రింద జమకట్టి అవలంబిస్తూ వున్నారంటే—యిఁక చెప్పేదేమిటి? యీ కాలంలో అభిమానంకలవాఁడెవఁడుగాని తలెత్తి తిరగడానికి

అవకాశం వున్నట్టు కనపడదని నాకు తోఁస్తూవుంది. యిది నా చేదస్తమైనా కావచ్చును. అంతటి దురభిమాని యెవఁడేనావుంటే వాఁడు పెళ్లిచేసుకోకుండా యావజ్జీవమూ గడుపుకోఁగలిగితే వాఁడికంతగా తలవంపులతో పనివుండదు—

మ॥ కొడుకుల్ గల్గినఁ గూఁతులుద్భవిలినన్ గోడండ్రు నల్లుండ్రు నే।
కడజాతుల్ ఘటియింతురో? అనెడి దుఃఖంబక్కటా? ఆర్యులీ।
చెడుకాలమ్మునఁ బుట్టుటేటికొ? గదా, సీ! సీ! దురంతమ్మౌతె।
వ్వాఁడు సైఁచున్ భరతావనీ భవుల కీపాట్లోక్కొ? కామేశ్వరీ॥

మ॥ సడికిం బూర్వులు జంకువారలిపుడో? జంకన్నదేలేదు మున్।
బిడియం బంగనకుండె నిప్పుడదియుంటే పెద్ద దోషంబహో!।
విడియాకుల్ మఱియున్ 'విడో' స్వరిణయా విర్భావముల్ తల్లి యీ।
చెడుకాలాన మనస్వి యేవిధముగా జీవించుఁ గామేశ్వరీ॥

ఆ యీ పద్యాలు లోకానికి నచ్చకపోయినా నా మనఃపరితాపం యీలాటిదని తెలుసుకోవడానికి వుపకరిస్తాయని వుదాహరించాను. విడో స్వరిణయాలుగాని, స్త్రీ విద్యగాని నేను బొత్తిగా వొప్పుకోని ఛాందసుణ్ణిగాను. నా వొప్పుదలనిగూర్చి వోపికవుంటే మఱొకప్పుడు వ్రాస్తాను. పత్రికాధిపతి తొందరగా వుత్తరంమీఁద వుత్తరంగా రెండు వుత్తరాలు వ్రాస్తే యీ రెండు మాటలున్నూ వ్రాసి పంపివున్నాను. ఆంధ్రవారపత్రికలో నా వ్యాసాలు పడుతూవుండడంవల్ల నేను మంచి ఆరోగ్యంలోనే వున్నానని పలువు రభిప్రాయపడుతూవుంటారు. కాని ఆ వ్యాసాలు సంవత్సరానికి పూర్వం పంపిన బాపతు నిల్వలోనివిగాని నిన్నా నేఁడూ పంపినవి కావు. తీరికకొలదిని వారప్పుడప్పుడు ప్రచురించుకుంటూ వుంటారు. అందులో కొన్ని చూచినప్పుడు యిది నేను పంపిందేనా? అని సంశయంకూఁడా నాకు కలుగుతూవుంటుంది. యిది విషయాంతరం. ప్రకృతమనుసరామః. మన సంఘగౌరవం నిల్పవలసిన భారం స్త్రీలమీఁదనే వుంది. యిరవైనాలుగు వేల రామాయణ గ్రంథం యావత్తూ స్త్రీ గౌరవాన్ని నిల్పడానికే పుట్టింది. సీత యే నూర్జహాను వంటిదో అయితే రాముఁడు అంత పరిశ్రమ చేయవలసి వుండనే వుండదుకదా? మొదటినుంచీ మన ఆర్యుల గౌరవాన్ని స్త్రీలే నిల్పుతూవున్నారు. యీ సంగతి బాగా జ్ఞప్తిలో వుంచుకొని స్త్రీలు విద్యాభ్యాసం చేయడానికి అభ్యంతరంలేదు. దీన్ని మఱచిపోయి చేసే విద్యాభ్యాసం మన ఆర్యుల సంఘాన్ని కళంకితంగా చేస్తుందని విన్నవిస్తూ ముగిస్తున్నాను.







పతిత భారత పావనాత్మకు
భావి భారత భాగ్యరాసికి
ప్రాపంచిక శాంతిదూతకు
ధీరభారత తేజశ్శాలికి

దీన హరిజనోద్ధారకునకు
సత్యాహింసల సాధుమూర్తికి
సూత్రయజ్ఞ ఆధ్వర్యునకును
మూడు మూర్తుల యుగప్రవర్తకు

డెబ్బది రెండవ పుట్టిన
దినపు శుభ సమయమునందున
జయ జయా భవ! దిగ్విజయ భవ!
జయ జయా భవ! దిగ్విజయ భవ!!



బాణసంధానవేళ

# అంజలి

సర్వమంగళగాన "సర్వదేశంబుల
మంగళ" మొప్పార మనుపుమమ్మ
కలితవీణాపుస్తక కరాంబుజవుగాన
"మాతృభాషాప్రేమ" మాకు నిమ్మ;
వహ్నిశుద్ధాంశుకభాసితాంగివిగాన
"ఖాది"పై లక్ష్యంబు గలుగ నిమ్మ;
భవరోగసంహార ప్రౌఢవీవేగాన
"ఆరోగ్యబోధ" సంవ్యాప్తి నిమ్మ
చెడుగురక్కసిమూక జిదుము దిట్టరిగాన
"అస్పృశ్యతా" ధాటి నవియ నిమ్మ;
సకలలోకాధారజనని నీవే గాన
"స్త్రీజనోద్ధరణ"కై దీక్ష నిమ్మ

గీ॥ అంబ! జగదంబ! గాంధీమహాత్మ "సూక్తు"
లెలమి వర్ధిల్ల సూత్రధారిణివి నీవె
శక్తియుక్తుల మాకిచ్చి సాదరముగ
నీ ప్రణాళిక సాధింపనిమ్మ జనని!

కవికలహంసి,
చేబ్రోలు సరస్వతీదేవి

స్థానిక సంస్థల పరిపాలనలో వుండే ప్రాథమిక విద్య, పారిశుద్ధ్యం, శిశుసంరక్షణ – ఈ పనులు ఆమెచల్లని చేతికి చక్కగా నప్పుతాయి. అందులోను ఇంటిరాణి కిదెంత ?

# స్థానిక సంస్థలు

● శ్రీమతి దుర్గాబాయమ్మ ●

స్త్రీ విధులు కేవలం గృహానికి, పురుషునివిధులు కేవలం ప్రపంచానికి చెందిన వనుకోవడం పొరపాటు. బయట తానుచూస్తూన్న పోషణ, రక్షణ, అభివృద్ధి—పురుషుడు యింటాచూడాలి. ఇంట తాను కనుక్కుంటూన్న అందం, చందం, హాయి—స్త్రీ బయటా కనుక్కోవాలి.

స్థానికసంస్థల పరిపాలన కూడా సరిగా గృహపరిపాలన లాంటిదే. కాని దీనికి పదిరెట్లు యెక్కువ ఓర్పు, చురుకుతనం, చాకచక్యం కావాలి. ఇంటిని దిద్దడంలోను, బిడ్డల్ని ఆదరించడంలోను, విద్యావిషయం కనిపెట్టడంలోను, ఆరోగ్యం చూడ్డంలోను స్త్రీ ఆరితేరింది. గృహంలో నిత్యకృత్యంగా నెరవేరుస్తున్నవే స్థానికసంస్థల సంగతులుకూడా. అటువంటప్పుడు ఆ సంస్థలపాలన కేవలం స్త్రీ కెందుకు విడిచిపెట్టకూడదంటాను ? దానివల్ల ఆమె కార్యరంగం విస్తృతి కనడమేకాక, ఆమెకొక విశేషత్వంకూడా చేకూరుతుంది. అప్పుడామె యింటినే అంటిపెట్టుకుని అలావుండిపోడం తటస్థించదు. ఆమెశక్తి, వివేకం అతిశయిస్తాయి. ఆవిధంగా ఆమెఆదరణ కిందనుండే సంసారం పెద్దదవుతుంది.

ఈ పెద్దసంసారం ఆమె యెలా చక్కబెట్టగలదో అన్న చింత అక్కర్లేదు. ఇంటిరాణి కిదెంత ? పారిశుద్ధ్యం, ప్రాథకమికవిద్య, శిశురక్షణ – ఈ పనులు ఆమె చల్లనిచేతికి చక్కగా నప్పుతాయి.

ఈ పనికి పురుషులు తగరనిగాని, తక్కువవారనిగాని నా అభిప్రాయముగాదు. దీన్ని ప్రత్యేకంగా స్త్రీలకి యెందుకు విడవమంటానంటే, బుద్ధి వికసించివున్న పురుషులను యింతకంటె కష్టతరమైన కార్యాలకి వుపయోగించుకోడం యుక్తమని.

మునిసిపాలిటీ శాసనకర్తలకి శిక్షణభూమి అన్నారు. ప్రభుత్వం చెయ్యగల నేర్పరులు మనకి యెక్కువగా కావలసివున్నారు. స్త్రీ పురుషుల కిరువురకీ సమానావకాశాలే వున్నాయి. స్త్రీలు వుపేక్షించకూడదు. ప్రారంభశిక్షణమైన నగరపాలనానుభవంతో దీనికి వీరు తగినవారవుతారు.

అనుభవంలేదనిగాని, విషయపరిజ్ఞానం పూజ్యమనిగాని స్త్రీలని త్రోసిపుచ్చడంలో న్యాయం కనిపించదు. అసమర్థులు కానంతవరకు యే అడ్డూ వుండకూడదు. అవసరమైన జ్ఞానానుభవాలు కలుగ

# స్త్రీలకే ఉండాలి

పురుషుడు చేయర్‌మన్ అయితే - స్త్రీ కమీషనరు,
స్త్రీ చేయర్‌మన్ అయితే పురుషుడు కమీషనరు
యీ విధమైన ఏర్పాటు నా ఆశయాన్ని నెరవేరుస్తుంది.

చెయ్యాలి. అవకాశాలు కల్పించాలి. సహజశక్తితో శోభించే స్త్రీకి శిక్షణమివ్వాలిగాని, నిషేధిస్తే యెలాగ? అది ఆమె నెలావుద్ధరిస్తుంది?

పురుషులుమాత్రం పుట్టుకతోనే తయారయి చక్కావచ్చారా? వారికి అవకాశం లభించి, అనుభవం సిద్ధించింది. ఈ ఆనుకూల్యం స్త్రీలకీ సందర్భపడితే, వాళ్లుమాత్రం తీసిపోతారా?

ఒక్కొక్క స్త్రీకి ఒక్కొక్క విభాగం అప్పచెప్పాలి. ఆవిభాగానికి చెందిన యావత్తు బాధ్యత తానే వహిస్తుంది. సహనశక్తి, సమర్థత వున్నవాళ్లనే యేరండి నగరపాలకులుగా. పురుషులకన్న స్త్రీ లుండడం వుపాధ్యాయినులకు, మంత్రసానులకు, యితర శ్రమజీవులకు చాలా సౌకర్యంగా వుంటుంది. అప్పుడాయా విభాగాలు శ్రద్ధగా, వుత్సాహంగా నడుస్తాయి.

'ఈ స్థానికసంస్థలని స్త్రీలకి వదలివెయ్యమనడం పురుషుల్ని పూర్తిగా తప్పించివెయ్యడం కాదా? అదిమాత్రం న్యాయమా?' అని యెవరైనా అడగొచ్చు. కాదంటాను. ఈవిషయాల్లో తమకున్న అనుభవంతో పురుషులు స్త్రీలని నడిపించాలి. మాకు వారిసహాయం, సహకారం కావాలి. వారుసానుభూతి చూపించాలి. మాకు బాధ్యతలివ్వాలి, భారాలు కల్పించాలి. అప్పుడుచూడాలి. పురుషుడు చెయిర్‌మన్ అయితే స్త్రీ కమీషనరు; స్త్రీ చెయర్‌మన్ అయితే పురుషుడు కమీషనరు—యీవిధమైన యేర్పాటు నా ఆశయం నెరవేరుస్తుంది.

ఈ కష్టమైన వుద్యోగానికి స్త్రీలు సంసిద్ధులుకావాలి. సంగతి, సమాచారం గ్రహించాలి. క్లిష్ట సమస్యల కీలకం గుర్తించాలి. న్యాయదృష్టి, వివేచనాబుద్ధి పెంపొందించాలి. నేర్పు, ఓర్పు ప్రదర్శించాలి. నిర్దోషంగా, నిర్విఘ్నంగా తమబాధ్యతలు నిర్వహించాలి.

ప్రస్తుతం ప్రబలుతూన్న వుత్సాహం ధర్మమా అంటూ అప్పుడే యీ పద్ధతి అక్కడక్కడ ఆచరణలోకి రావడం ఎంతో ఉదారంగావుంది. ఈ పరివర్తన ఆశాజనకంగా, ఆనందంగా వుంది. స్త్రీలు యీ అవకాశం వినియోగించుకుని, పైకిరావాలి.'

ఈశాఖ పూర్తిగా స్త్రీలహస్తగతమయే రోజుకోసం ఆత్రంగా యెదురుచూస్తూంటాను. ఇది భవ్యతరమైన దేశాభ్యుదయానికి దారితీస్తుందని నా గట్టినమ్మకం.



# ఆశీస్సు

హిందూగృహానికి తుల్యమయింది యింకోటి లేదు. ఇచ్చటే గాదు ఖండ ఖండాంతరాలలో గూడాను. హిందూవనితకు సాటియైన స్త్రీ ఏ దేశమందు చూడము. ఒక్క విషయాన్ని గురించే గాదు. ధార్మిక, ఆధ్యాత్మికాదర్శాలలో ఆమె ఆదర్శచరిత.

స్వామి వివేకానందుని అమెరికాలో ఒక పురుషుడడిగాడు, 'మీరు మీ స్త్రీలను ఏవిధంగా గౌరవిస్తా'రని. 'మిసెస్సని మీవలె వారలపిలువక తల్లియని మాతృస్వరూపిణిగా ఆరాధించుతామ'ని స్వాములవారన్నారు. అందుకనే మన కవులు 'కలకంఠి కంట కన్నీరొలికిన సిరియింటనుండ నొల్లద'ని గౌరవించారు. 'ఏ దేశాన స్త్రీలు గౌరవానందాలతో నోలలాడుతారో ఆ దేశాన లక్ష్మి తాండవమాడుచుండున'ని మనువు వుపదేశించాడు. ఈ ధర్మాలను సార్థకంచేయడానికి 'గృహలక్ష్మి' స్త్రీ జనాభివృద్ధికి కల్పవృక్షములా స్త్రీ ధర్మాన్ని బాహాటంగా చాటుతోంది. పుష్కరంపైనుంచి ఆంధ్రవనితల హృదయాల్లో రాజ్యంచేస్తోంది. 'గృహలక్ష్మి' లేకపోతే ఆంధ్రగృహములు చీకట్లుకమ్ముతాయని అనిపించుకొంది. ఆంధ్రులలో శహబాస్ అని ప్రసిద్ధిచెందింది.

కేసరిగారు సంకల్పసిద్ధులు. వారుపట్టింది బంగారమవుతుంది. వారి కోర్కెలు అమోఘంగా ఫలించుతాయి. కేసరిగారు ఆంధ్రులకు చిరస్మరణీయులు. వారిది వజ్రసంకల్పము. స్త్రీ జనాభివృద్ధికి పాటుపడే శ్రీ కేసరి మహాశయులనూ, వారి పత్రికారత్నాన్ని భగవానుడు చిరస్థాయిగా దీవించుగాక! ఆంధ్రవనితలందరు గృహలక్ష్మిని ఆదరిస్తారని నమ్ముతాను.


— శ్రీమతి —
చుండూరు
రత్నమ్మ

★

ఏలూరు
పురపాలక
సంఘాధ్యక్షిణి

# బిచ్చగాడు

శ్రీమతి

లోకనిండి

సత్యవతీబాయి

★

మనుష్యులుమాత్రమే కాకుం
డా జంతువులుకూడా అస
హ్యించుకుంటాయి బిచ్చ
గాడిని చూస్తే—

అయితే యీ 'అసహ్యం'
అతడి 'ఆకారం'లోనా?
అతడి 'ఆయవారం'లోనా?

రోతగా జీవితాన్ని మోసు
కుంటూ చావలేక బ్రతికే
రోగులు—

కష్టంలేకుండా బ్రతకడానికి
ముష్టికి బయలుదేరే నికృ
ష్టులు—

—అందుకే అసహ్యం.

అయితే, వారిలోనూ మృదు
వైన మానవాత్మ వుంది.
పరుల కష్టాల్నిచూచి ద్రవిం
చిపోతుంది—

కాని, వారినీ నీచయాచన
నుండి ఉద్ధరించడానికి సంఘం
తలపెడితేగదూ?

★

చీకట్లు నలుదెసలా అలముకొంటున్నాయి. దూరాన్ని పల్లె వొక్కటి నల్లని మచ్చలా అగపడుతోంది. ఆ బిచ్చగాడు రోడ్డు ప్రక్కన పచ్చికమీద తన చింకిగొంగళి పరచుకొని మేనువాల్చాడు. ఆకలితో వాని కడుపు చుమ్మలుచుట్టుకొని పోతోంది. పట్టెడన్న మానాడు వాడికి దొరికిందికాదు.

జీవితంలో సుఖమెట్టిదో వాడెరుగడు. వణుకుతూ గడిపిన శీతాకాలపురాత్రుల్లూ, ఎండలో మాడుతూ నడచిన వేసాకాలపు పగల్లూ, తడిసిముద్దయి పంచల్లో చూర్లక్రింద గడిపిన గడియలూ, యివే వాడెరిగినవి. మనుష్యులుకూడ వాడిసెంతో నిరసనభావంతో చూశారు. పట్టెడన్న మడిగి తానుతిన్న చీవాట్లు, ఆకలిబాధకోర్వ లేక యింకను ప్రాధేయపడి తానుతిన్న దెబ్బలుకూడా జ్ఞాపకాని కొచ్చినయి. అన్నిటికంటే తనయెడల ప్రజలుచూపే నిరసనభావం తనకు చాలాకష్టమనిపించింది. తన్నుచూస్తే అందరికీ ఎందుకింత అనుమానమూ, కోపమూ, చీకాకున్నూ? గుమ్మములోకి పోగానే పెద్దవాళ్లు త్రోలిగిపోతారు. ఆడవాళ్లు కసురుతారు, పిల్లలువెక్కిరిస్తారు, చివరకు కుక్కలుకూడా మొఱుగుతవి. అయినా అతనికెవ్వరిపైనా క్రోధము కాని, అసూయకాని లేదు. తానుపడ్డ కష్టాలన్నీ అతనిహృదయంలో సహనాన్ని, జాలినిమాత్రము నిలిపిపోయినవి. అబ్బ, నిద్రన్నా పట్టితే యీ ఆకలిబాధ, పిచ్చి తలపులు మరవొచ్చునని కండ్లు గట్టిగా మూసుకున్నాడు.

అతని కప్పుడే మాగన్నుగా నిద్రపట్టుతోంది. ఏదో అలికిడివిని తలయెత్తిచూశాడు. ఒక గడ్డిబండి వస్తోంది. గడ్డిమోపా బండినిమించి రోడ్డునంతటినీ ఆక్రమించుకొంటోంది. మళ్లీపడుకున్నాడు. బండిసమీపించింది. దాటిపోయింది. చక్రాలచప్పుడూ, ఎద్దుమెడలోని మువ్వలమోతా సన్నగిలిపోయినవి. బండివాని రాగము మాత్రము వినబడుతోంది. అదికూడా చప్పననిల్చిపోయి బండివాడు ఎద్దునదర్చుట వినబడింది. కొరడాచప్పుడు

తో ఎద్దును తిట్టుతూ కొట్టడము చెవినిబడ్డది. బిచ్చగాడు లేచి కండ్లు నులుముకుంటూ కూర్చున్నాడు. ఎద్దు శక్తి కొలదిలాగినా బండికదలడములేదు. బండివాడతడ్ని చూసి, 'ఇదుగో తాతా, కొంచముచెయ్యిపట్టు. ఈ రొంగుడులో బండి పోవడములేదు' అన్నాడు. బిచ్చగాడు లేచి బండిదగ్గఱకువచ్చి ఒక చక్రముపట్టాడు; బండివాడింకోటి పట్టాడు. ఇద్దరూశక్తికొద్దీ తోస్తూ ఎద్దును హెచ్చరించారు. ఎద్దు మోరచాచి, వెనకటి కాళ్లను నిగడదన్ని తొడలు కంపించగా తనబలాన్నంతటినీ వినియోగించి బండిని లాగింది. కాని, లాభంలేకపోయింది. ఒక్క అడుగన్నా అంతఎత్తుగావున్న ఆ రోడ్డుమీద ముందుకు వేయలేకపోయింది. పక్క లెగురవేస్తూ, ముక్కుపుటాలు కంపించగా రొజుతూ నిలిచిపోయింది. బిచ్చగాడిది చూచి జాలితో 'అబ్బాయి కొంచము గొడ్డును సేదదీరనీ దానిశక్తికిమించినబరువుంది బండిలో—' అన్నాడు బండివాడు 'కానే కాదు పట్టి తిండిపోతుది, ఆ రాయి తెచ్చి చక్రముకిందపెట్టు. సరే, ఈ కొరడా తిప్పికట్టైతో దాన్ని బాదు. నేనీచక్రాన్ని ముందుకి తోస్తాను. బండి ఎట్లాకదల్దో చూస్తాను—'

రివ్వురివ్వున పడ్తూన్న దెబ్బల కోర్చుకోలేక ఎద్దుమళ్లీ బండిని లాగింది. కాస్త చక్రముకదిల్తే రాతిని ముందుకుతోస్తూ, చక్రాన్ని బలంతో నెట్టితే బండి అదంతట అదే కదిలిపోతుందని బండివాని వూహ. "ఊఁ. కానీ - యింకా యింకా—" అని ప్రోత్సహిస్తున్నాడు. ఎద్దు ఒక్క అడుగు వేసింది రెండో కాలెత్తిందికూడ. కాని లాభంలేకపోయింది. బరువుకి వెంటనే వెనక్కుతూలింది. ఆ కుదుపుకి బండిబండే వెనక్కువాలింది. బండివాడు పళముతప్పి, జారి ఒక్క కేకతో వెల్లకిలాపడిపోయాడు. పాపము, వెంటనే బండి రొమ్ముమీద తటాలున పోతుందని దబ్బున తనచేతులు చక్రానికిపోటిపెట్టి ప్రాణభయంతో, "ముందుకుతోలు - ముందుకుతోలు" అని గావు కేకపెట్టాడు. జరిగినమోసం గ్రహించి బిచ్చగాడు గొడ్డును శక్తికొద్దీ మోదసాగాడు. ఎద్దుముందుకు సాగయత్నించి బలముచాలక మోకాళ్లపై ముందుకుకూలపడి లేవనుంకించి, పక్కకొరిగి పడిపోయింది. బిచ్చగాడు గాభరాతో వెనక్కు చక్రముదగ్గరున్న బండివానిదగ్గరకు పరుగెత్తాడు. పాపము, బండివాడు తనబలాన్నంతా వినియోగించి, రాతిమీదకి దొల్లినచక్రాన్ని తన వక్షానికి నాలుగైదు అంగుళాల ఎడాన్ని పట్టి నిలిపివుంచాడు. వాడుకాస్త జరిగినా, కించిత్తు వానిబలము సడలినా, ఆ చక్రముబండి బరువుతో వాడిని నలిపివేస్తుంది. బండివాడది గ్రహించి వంగి తనను లేవనెత్తచూస్తున్న బిచ్చగానితో, "నన్ను తాకకు, ఆ వరిచేలవతల పల్లె వున్నదే, ఎగువైన గుమ్మడిపాడు పాకివున్న గుడిసెకుపోయి మావాళ్లను తీసుకురా - దబ్బున పో. కాస్సేపెట్లాగో అట్లా యీ బరువునిపట్టి నిలిపివుంచుతా" అన్నాడు—

మారుపలక్కుండా బిచ్చగాడు పొలానికడ్డంగా రాళ్లురప్పలూ ముళ్లకంచెలూ లక్ష్యపెట్టకుండా పరుగెత్తాడు. గుమ్మడిపాడున్న గుడిసెచేరి ఒగర్పుతో రొజుతూ చప్పున అరవలేక తలుపు దబాదబా కొట్టాడు, "రంగా - నీవా -" అని లోపలనుంచి వినబడ్డది. మళ్లీతట్టాడు, లోపలనుండి 'రంగా'. బైటినుండి బిచ్చగాడు 'కాదు. కాని, ఆ రోడ్డుమీద—' ఇంతలో ఒక ముసిలాయన తలుపుతీసి చీకట్లో బిచ్చగాడ్ని తేరిపార చూసి, 'ఎవడవురా? ఈరాత్రి. పో! బిచ్చపువెధవా! మా అబ్బాయి అనుకున్నాను—' అని బిచ్చగాడి నోట్లోంచి మాట రాకమునుపే తటాలున తలుపుమూసేశాడు. బిచ్చగాడు చకితుడైపోయాడు.

'ఏమిటి! నేనేంచేశాను - ఓ! నిద్రచెడిపాను కాదూ! ఐనా పాపమతనికొడుకు సంగతి తెలవదుగా' అని మళ్లీతలుపు కొట్టాడు. ఇప్పటికి బిచ్చగానికి ఒగర్పు తగ్గి గొంతునుండి మాట బైటికివచ్చింది. 'తలుపు తీయండి బాబూ' అని కేకపెట్టాడు. అతని స్వరములోని ఆదుర్దాను గమనించి మళ్లీకోపముతో

# బిచ్చగాడు

'పోతావా? లేదా? వెధవా' అని లోపలనుంచి గర్జించాడు బండివాని తండ్రి. 'లేదుబాబూ, నా మాట వినండి' అని దీనంగా పలికాడు బిచ్చగాడు. లోపలనుండి ఆడమనిషి కంఠస్వరము 'కసరడమెందుకండీ? ఏం చెబుతాడో వినకూడదూ?' 'వినాలిగా - పళ్లురాలగొట్టక. రాత్రిలేదు, పగలులేదు బిచ్చానికి. ఏదీ వాడింకోసారి రాత్రుళ్లు నిద్రచెడపకుండా బుద్ధిచెబుతానుండు' అని దభాలున తలుపు తీసి చేతిలో కట్టెతో ప్రత్యక్షమయ్యాడు ఇంటియజమాని.

దెబ్బకొడతాడేమోనని త్రుళ్లిపడి వెనక్కు తగ్గి, బిచ్చగాడు రంగడిసంగతి చెప్పనోరుతెరిచాడు. ఇంతలో - 'పొమ్మన్నే గాడిదకొడకా. వినపడలా? అర్ధరాత్రి నిద్రచెరిపి మరీ, బేజారుచేస్తున్నావు - పో -' అని తెల్లబోయి నిలబడిపోయిచూస్తూన్న బిచ్చగాడి నొకదెబ్బకొట్టాడు. పాపము! ఎముకలపోగులావున్న బిచ్చగాడికా దెబ్బఎంతోబాధపెట్టింది. భయముతో వెనక్కుతిరిగి పరుగెత్తాడు. కొంచెందూరము పోయి నిలబడిపోయాడు. ఇంతనీచంగా, హీనంగా తన్నెందుకు చూస్తారు ప్రజలు? తానుబిచ్చగాడనేనా? ఐతేమాత్రము? పిడికెడన్నముకోసరము వస్తేమట్టుకు దానికింత నిరాదరణా, క్రౌర్యమూనా?

బిచ్చగానికింతలో అవతలరోడ్డుమీద దిక్కులేకుండా, భారంక్రింద కుంగిపోతున్న బండివాని నిస్సహాయస్థితి చటుక్కున జ్ఞాపకానికివచ్చింది. 'అయ్యో, ఏంచెయ్యను? మళ్లీమళ్లీ తలుపుకొడితే ముసలాడు చావకొట్టుతాడు. ఇంకెవరినన్నా లేపుదుని తీసుకుపోదామంటే వాళ్లూ యిట్లాగే వర్తిస్తారు. ఇంకేమిచెయ్యాలి?' అని ఆందోళనతో జాలితో తల్లడిల్లిపోయాడు. కాస్త సంకోచించి రంగడున్నవేపు రోడ్డుమీది కొక్కపరుగు తీశాడు. తనశక్తంతాధారపోసి, తననరాలు బండిబరువుకి తెగినాసరే, బండినిజరిపి రంగడిప్రాణాలు నిలుపుదామని పిచ్చియూహతో—రంగడున్నస్థలం చేరీచేరకముందే 'అబ్బాయి, అబ్బాయి' అని కేకపెట్టాడు జవాబులేదు. సమీపించి మళ్లీపిలిచాడు. మళ్లీప్రత్యుత్తరము రాలేదు - ఆదుర్దాతో వంగిచూసేసరికింకేముంది? బండిచక్రము రంగడి వక్షముమీదపడి అతణ్ణి నలిపివేసింది. కండ్లు మూతపడివున్నవి. నోట్లోంచి రక్తముకారుతోంది. అట్లాగే నిశ్చేష్టుడయి బిచ్చగాడు నిల్చిపోయాడు. తర్వాత మెల్లగా కూలబడ్డాడు. అతనికి తెలియకుండానే రెండశ్రువులా క్రుంగిన కండ్లలోంచి శవముమీద పడ్డవి.

అతడక్కడే ఎంతోసేపు కొయ్యబారిపోయాడు. అంతమూర్ఖముతో, నిర్దయతో, తనను తరిమివేసి, రంగడిని చావువాతవేసిన ఆ ముసలాడు జ్ఞాపకానికొచ్చాడు. అప్పుడతనికి జీవితంలో ఎన్నడూరాని, ఎక్కడలేని కోపమూ ముంచుకొచ్చింది. మెల్లగాలేచి నిదానంగా తనజోలినీ, గొంగడినీ సవిరించుకొని రంగడింటివేపు మళ్లీదారి బట్టాడు. చేరాక వెనకటి గాభరాలేకుండా ఈసారి తలుపును నెమ్మదిగా కొట్టాడు. అప్పుడంటే రంగని ప్రాణాలు కాపాడే తొందర; మరి ఇప్పుడో............

లోపలినుండి 'రంగా - నీవా? వస్తున్నానుండు' అని రంగనితండ్రి 'ఎంతపొద్దుపోయింది నాయనా?' అని తల్లి. రంగనితండ్రి లేచివచ్చి తలుపుతీశాడు. బిచ్చగాడు 'నేను రంగడినికాను - ఒక్కగడియ కింద రాలే? నీకొడుకు బండికిందపడి చావసిద్ధముగా వున్నాడని చెప్పడానికి, ఆ బిచ్చపువెధవను-' రంగని తండ్రి గాభరాతో 'ఆ! ఏమీరా? లోపలికిరా. ఏంజరిగింది? చెప్పూ-' అని తలుపు బారుగాతెరిచాడు. వీండ్ల మాటలు వింటూ తలుపవతలవున్న రంగనితల్లి బోరునఏడుస్తూ కూలబడి పోయింది. ముసలివాడు చేతికర్రను తీసుకొని చెప్పులంతొడుక్కొని 'ఒరే అబ్బీ, పద ఎక్కడ?' అని దబదబ బైటికివచ్చాడు. బిచ్చగానినికానక 'ఒరే అబ్బీ, ఒరేయి అబ్బీ' అని ఆందోళనతో అరిచాడు. కాని అతనికి జవాబిచ్చేవారెవరూ లేకపోయారు. ఆ బిచ్చగాడా చీకట్లో అప్పుడేఎక్కడికో వెళ్లిపోయాడు.

దూరాన్ని ఒక కుక్కమాత్రము మొరిగింది. అప్పుడేవచ్చిన గుడ్డివెన్నెలకు తెల్లవారిందనుకొని పక్కనొక కోడికూసింది—అంతే............



1940. అక్టోబరు.

# పతాకసందేశము

జాతికిచిహ్నమ్ము జండాయెనుమ్ము
నీతినిఁదెల్పుచు నిలుచున్న దిచట.

భారతీయులశక్తి భారతీయుల యుక్తి
భారతీయుల ప్రతిభ భద్రపరచినది.

జాతీయతాసక్తి శాశ్వతమ్ముగఁ జేయ
జాతీయకేతువే సాధనమ్మరయ.

మూడురంగులతోడ ముచ్చటైయుండి
వేడుకను గలిగించు విజ్ఞాన మొసఁగు.

మూడుగుణంబులు ముడివడినట్లు
మూడుమతములకు మూలమ్ము జండా.

హిందూముసల్మానులందుఁ గ్రైస్తవుల
సందేహమందకే సమకూర్పఁ గలదు.

ఎవ్వారు చెప్పిన నెట్లు చెప్పినను
భావైక్యమందిన ఫలమందవచ్చు.

పలుజాతి జనములు కలిసినట్లైన
వెలలేని ఫలమబ్బు నిలలోన నిజము

ఐకమత్యంబె మనకాదర్శ ధర్మ
మికనైన భారతా! వేగిరంపడుమ!

ఎన్నివర్ణాలైన నిటులేకమైన
నెన్నికల్ జయముతో సన్నుతికెక్కు.

త్యాగంబహింస సాహసమును మూఁటి
యోగంబుఁ జూపుచున్నదీ జండా.

త్యాగమ్మునకు గుర్తు జేగూరురంగు
భోగమ్ములను వీడి పొందనుచుండె.

సహనమహింసయే జయమిచ్చుననుచు
రహివహించెను తెల్లరంగు నందముగ.

నిరపాయమును దెల్పు తరచైన పచ్చ
వరసాహసాంకమై వరలుచునుండు.

పైని రాట్నఁపుబొమ్మ బంగారుదిమ్మ
మనపరిశ్రమయిదే మరువకుఁడనుచు.

చాటిచెప్పెడు భంగినూటిగా నమరె
నేఁటికాలమునకు నిదియె ధర్మమ్ము.

యంత్రములనుగూడ నణపంగఁజాలు
మంత్రమాధ్వనియందు మారుమ్రోగెడిఁ

కాదనకీవృత్తిఁ గడకతోఁ బెనుప
బీదల పాలిఁటి పెన్నిధియగును.

పోయిన స్వాతంత్ర్యమును గోరునెడల
వేయుఁడు ముందంజ వీరత్వమునను.

గాంధీమహాత్ముని ఘనమైనకోర్కె
సందేశరూపాన నిందిమిడి యుండె.

● శ్రీమతి వేదవల్లి తాయారమ్మ ●

# లక్ష్మి

శ్రీమతి
దేశిరాజు
భారతీదేవి



కోటమ్మకిద్దరుపిల్లలు. పెద్దదైన కొమార్తెకుమాత్రము పెండ్లి చేసింది. ఆమెభర్త చనిపోయినాడు. యెనిమిదేండ్ల యీడుగల కొడుకు మాత్రము తండ్రిపోయినతర్వాత అదుపాజ్ఞలులేక దుస్సాంగత్యముచేత తల్లిమాటవినక ఒకనాటిరాత్రి చెప్పకుండా యెక్కడికో పారిపోయినాడు. భర్తపోయిన దుఃఖానికి తోడుకొడుకు దుష్ప్రవర్తన యీమెను కృంగదీసింది. యెంతవెదకినా యెచ్చటా దొరకలేదు. ఇక నిరాశజెంది కొమార్తెనే అన్నిటికిని దిక్కునినమ్మి ఆమెవద్దనే వున్నది కోటమ్మ. కాని తగిలినవేలుకే తగులుతుందను సామ్యమట్లు కోటమ్మకష్టాలు గట్టెక్కలేదు. ప్రసవమై పదిరోజుల పసికూనను తల్లికివప్పగించి కోటమ్మకూతురు చనిపోయినది. దుర్భర గర్భశోకమునకుతోడు పసిబిడ్డ పెంపక మామెకత్యంత బాధాకరమైనది. వెంటనే ఆ పసికూననుతీసికొని చేరువనేయున్న ఒక బస్తీచేరి ఆ బాలికను పోషించుకొంటూ తన పొట్టబోసుకుంటున్నది. తర్వాత సంవత్సరానికి కోటమ్మ అల్లుడుగూడ పాముకఱచిపోయినట్లు విని తన దురదృష్టానికి మిక్కిలి వగచింది కోటమ్మ. ఇక లక్ష్మికి దిక్కులేదు 'తాను చనిపోతే ఆ బాలికగతియేమిటి?' అనే దిగులుతో నానాటికి కృంగి కుళ్లిపోతున్నది కోటమ్మ. కాని యేమిచెయ్యగలదు?

* * *

కాలచక్రం గిఱ్ఱున తిరిగిపోతూన్నది. లక్ష్మి వ్యక్తురాలైనది. కోటమ్మ యీరాటము యెక్కువైనది. తాను పాచిపనిజేసేయింట్లో లక్ష్మిని ప్రవేశపెట్టి తాను మనమరాలి పెండ్లివిషయమై వరుణ్ణి వెదకసాగింది. తనశక్తివంచనలేకుండా ప్రయత్నంజేసింది. తుదకొక రెండవపెళ్లి వరుణ్ణి కుదుర్చింది కోటమ్మ. వాడివిషయం విచారించిచూచిన లక్ష్మికి ప్రాణంపైనే యెగిరిపోయింది. వానివిషయమై కోటమ్మకు తెలిసినదంతయు వట్టికల్ల. కాని అమాయకురాలగు కోటమ్మ వాని మాయమాటలు నమ్మింది. వెంటనే పెండ్లిజేసి తనబరువు తీర్చుకుందామని వూహించింది. లక్ష్మికి తెలియజేసింది. ఆమె యిష్టపడలేదు. కొన్నాళ్లు గడిచాయి.

ఒకనాటిప్రొద్దుట పాచిపనిజేసి యింటికొచ్చేప్పటికి అవ్వపిలిచి తనుపండుకున్న మంచంమీద కూర్చోమనిచెప్పి మనుమరాలితో యిట్లా చెప్పింది. 'లచ్చీ, నేనింక ఎక్కువరోజులు బతికేట్టుగాలేను. నాకున్నదల్లా నీ పెండ్లివిషయమే దిగులు. నీవొకయింటిదానివైతే చూచిపోతాను. నాదిగులు తీరుతుంది. ఆనక నీవేమి తిప్పలుపడుతావో. దిక్కులేనిదానివై యీ గుడిసెలో వక్కదానివేవుంటే నిన్నెవరేమంటారో. అమ్మా, నామాటవినుకోతల్లీ. వాణ్ణి జేసుకో'మంటూ హితబోధజేసింది. అసహాయురాలగు ఆబాలిక యేమి చెయ్యగలదు? అమాయకురాలైన అవ్వ లోకులమాటలువిని తనసుఖము చూచటములేదు. పెండ్లిచెయ్యడమే ప్రధానమనుకొంటున్నది గాని వేరేయాలోచనయేమీ చేయటములేదు. 'అవ్వా, ఆలోచించి మాపిటాళ చెపుతాలేయే, నన్నెందుకు గోలబెడతావు' అన్నది ధైర్యంతో.

ప్రతిరోజూ వెళ్లేవేళతప్పి పనిలోకి వెళ్లడము, మామూలుగా వుండే వుత్సాహమేమీ లేకుండా బిక్కమొగముతో దుఃఖాన్ని దిగమ్రింగుకుంటూవచ్చిన లక్ష్మినిచూచి యజమానురాలు సత్యవతమ్మగారు 'ఏమే లక్ష్మీ, చాలా ఆలస్యముగావచ్చావు? అట్లావున్నావేమే' అన్నది. ఆ మాటకు భయపడి 'ఏమీ లేదమ్మా. నిద్రబోయిలేచి యిప్పుడేవచ్చాను. దబ్బున మెలకువ రాలేదమ్మా' అంటూ మొగంతిప్పుకుని తెల్లి అంట్లుతోముతూ కూర్చున్నది లక్ష్మి. కాని వచ్చిందిమొదలు దానివాలకమంతా కనిబెట్టివున్న సత్యవతమ్మగారు యెట్లాగైనా దానిసంగతి పూర్తిగా తెలుసుకోవాలని అనుకుంది.

సర్కిల్ యినస్పెక్టర్ వెంకయ్యనాయుడుగారికి క్రొత్తగా యీవూరు బదిలీయైనది. వారువచ్చి నాలుగుమాసాలేగాని, డాక్టరు నారాయణరావు పంతులుగారికి నాయుడుగారికి మంచిస్నేహము కుదిరింది. నారాయణరావుగారు వస్తుతః ఉదారస్వభావులు. యితరుల కష్టములుచూచి సహించలేరు. ఎవరికే యాపద వచ్చినా తనకేవచ్చినట్లు భావించి వారికివచ్చినకష్టము తీరేవరకు వూరుకోక తన శక్తికొద్దీ సహాయముచేసేవాడు. బీదలకు వుచితముగా మందులివ్వడము, నిరుద్యోగులకేదైన పనిగల్పించి సహాయముచెయ్యడము, ఆయన ముఖ్యనియమాలు. నాలుగుమాసాల స్నేహంలోనే వెంకయ్యనాయుడి కుటుంబపరిస్థితులన్నీ విచారించాడు. వెంకయ్యనాయుడు తనబాల్యములోనే యెవ్వరికీచెప్పకుండా బొంబాయివెళ్లడము, అచ్చట ఒక మహాశయుని సహాయమువల్ల చదువుకోవటము, అక్కడే పెండ్లాడి ఉద్యోగియై స్వదేశానికి తిరిగి రావడము, తల్లిని విచారించడము, ఆమెసంగతేమీ తెలియక నిరాశజెందటము, ఆరుమాసములక్రిందట భార్యచనిపోవడము, తానావూళ్లోవుండలేక యీవూరు బదిలీ చేయించుకోవడము మొదలైన సంగతులన్నీ తెలుసుకున్నాడు; తన భార్యకూడా తెలియజేశాడు. తల్లిలేనిపిల్లలని నాయుడుగారి పిల్లలిద్దరిని తనపిల్లలతో సమంగా ఆదరించే వారాదంపతులు. మళ్లీ నాయుడుగారికి పెండ్లిజేయాలని సత్యవతమ్మ నారాయణరావుగార్లు ప్రయత్నం జేస్తున్నారు.

* * *

లక్ష్మి మామూలుపనులన్నీ దీర్చి 'అమ్మా శలవిప్పిస్తారా! పనులన్నీ అయినాయి' అన్నది సత్యవతమ్మగారితో. ఆమెనవ్వుతూ 'వెళ్లుదువుగాని, రా పనియున్నది' అంటూ మేడమీదకు తీసికొనివెళ్లి తానొకకుర్చీలో కూర్చుని లక్ష్మిని దగ్గరగా కూర్చోమంది.

సత్యవతమ్మ:-లక్ష్మి నీవివ్వాళ ఏమో దిగులుగావున్నావు. చాలా యేడ్చినట్లుగా నీ మొగమంతా కందిపోయింది. మీఅవ్వ కులాసాగా యున్నదా?

లక్ష్మి:-ఏమి కులాసా తల్లీ, ఏమి బాగాలేదు దానిసంగతి అయ్యగారిచ్చిన మందు పోస్తున్నాను. దానికేమి? నయమైనా కాకపోయినా మారాజే, వున్నవాళ్లకేగదమ్మా తిప్పలు?

అంటూ కళ్లనీళ్లుబెట్టుకున్నది. ఆమాటవిని సత్యవతమ్మగారు కేవలము అవ్వజబ్బువల్లనే యీపిల్ల దిగులుపడుతున్నట్లు లేదు. వేరే యేదో కారణమున్నట్లు గ్రహించి చాలా ఆదరముగా, 'లక్ష్మి నీకు వేరే దిక్కెవ్వరూలేరుగదా? నేను నీతల్లివంటిదాన్ని. నీమనస్సులోసంగతి దాచకుండా నాకుచెప్పు నాచేత నయినంత సహాయముచేస్తాను. కేవలము నీకు అవ్వనుగూర్చిన దిగులేగాకుండా యేదోయితరమైన దిగులుతో బాధపడుతున్నావు. నాతోచెప్పనిది నిన్ను యివ్వాళ యింటికి వెళ్లనీయను' అన్నది. ఆమాట కాబాలిక హృదయం పులకరించిపోయింది. తనవిషయమంత శ్రద్ధగా కనుగొనవలెనను కుతూహలము జూపినవారుగాని, తనయందంతాదరము కనబఱచినవారుగాని యిదివరకెవ్వరూ కనబడలేదు. సత్యవతమ్మగారే తనకా సమయములో తల్లివలె తోచిందామెకు. తనఅవ్వచనిపోతే యికదిక్కు యీతల్లేగదా! యీమేపోషకురాలు కావున యీమెకుచెప్పక యింకెవ్వరికి చెప్పేదనుకొన్నది. పూసగ్రుచ్చినట్లు తనసంగతంతాచెప్పి ఆమె కాళ్లురెండూపట్టుకొని భోరున విలపించినది లక్ష్మి. దిక్కులేనితనానికి బిడ్డలతల్లియగు ఆ మాతృహృదయం ద్రవించిపోగా కన్నులార్ద్రములైనవి. 'లక్ష్మి, నీవు దుఃఖపడవద్దు. నీవు నా బిడ్డవంటిదానవు. నీకు పెండ్లిజేసే భారమునాది. నీవు మీఅవ్వమాటలు వినవద్దు. ఆ త్రాగుబోతువాణ్ణి చేసికోవద్దు' అంటూ ఖండితముగా జెప్పి, భయపడవద్దని అభయహస్త మిచ్చిందామె.

మనుమరాలు తనమాటను త్రోసివేస్తుందని కల్లోకూడా తలపోయలేదు కోటమ్మ, కాని యేమి చేస్తుంది? ఆరోజుకారోజు కామెవ్యాధి తీవ్రరూపము దాల్చుతోంది. లక్ష్మి పూర్తిగా నిరాశజెందింది. అయ్యగారి దగ్గఱకెళ్లి మొఱబెట్టుకొన్నది. కాసేపుండి వచ్చిచూచి మందిస్తానని నారాయణరావుగారు చెప్పి పంపినారు.

వెంకయ్యనాయుడిగారితో కలిసి షికారు వెళ్లుతూ త్రోవలో కోటమ్మ గుడిసెలో కాలు పెట్టినాడు నారాయణరావుగారు. లోపల కోటమ్మ లక్ష్మికి కుదిర్చిన వరుడు చాల గడబిడ జేస్తున్నాడు. వ్యాధిచేత బాధపడుతూన్న కోటమ్మను త్రాగివచ్చిన మత్తులో అనరానిమాటలని యింకా యెక్కువ బాధబెడుతున్నాడు. డాక్టరుగారిని చూడగానే లక్ష్మి సంతోషముతో 'రండయ్యగారు' అంటూ లేచింది. ఆయనవెళ్లి 'కోటీ, కులాసాగా వున్నావా?' అంటూ ఆమె చెయ్యిచూచి, గుండె పరీక్షజేసి 'సరే మందు పంపుతాను. కాని వీడెవ్వడు' అన్నాడు అందుకా త్రాగుబోతు 'చూడండయ్యా, పెద్దమనుసులు. యీ ముసిల్ది నాకు పిల్లనిస్తానని జెప్పి యిప్పుడొల్లకాదంటది' అంటూ తీవ్రంగా అరవడము మొదలుబెట్టినాడు. ఈ కేకల కిరుగుపొరుగులంతా మూగినారు. రోడ్డుమీద నిలబడివున్న వెంకయ్యనాయుడు లోపలకొచ్చి చూచి, మనిషిని గుర్తుబట్టి యీ త్రాగుబోతు వాడిదివరలో చోరీ నేరం క్రింద అరెస్టయి, జామీనుమీద విడదల్తై యున్నట్టు చెప్పినాడు కోటమ్మ సంగతంతా చెప్పి యీ ముదుసలిని వీడు పిల్లనివ్వలేదని పీడిస్తున్నట్లు డాక్టరుగారు నాయుడుగారికి చెప్పగా తొందరగా కోటమ్మదగ్గఱకెళ్లి నిదానించి చూచి, నిశ్చేష్టుడై కొంతసేపటికి తెప్పరిల్లి 'అమ్మా' అంటూ ఆమెమీద వ్రాలిపోయినాడు వెంకయ్యనాయుడు. 'అమ్మా' అన్నమాట చెవిబడగానే పంచప్రాణాలు లేచివచ్చినట్లు కాగా ఆనందాతిరేకమున 'నాయనా, వెంకూ యెక్కడకెళ్లావు? యెక్కడున్నావు? యెప్పుడొచ్చావు?' మొదలైన ప్రశ్నలవర్షం కురిపించింది కోటమ్మ. తాను మంచి హోదాగల ఉద్యోగియైయుండి ఆవూళ్లోనే తనతల్లి దిక్కులేక దీనతగావున్న సంగతి వెంకయ్యనాయడి కడుపులో చెయ్యిబెట్టి కలచినట్లయింది. కోటమ్మ మాటలకేమీ సమాధానం చెప్పలేకపోయినాడు. కొంచెముచేపెవ్వరు మాట్లాడలేదు. 'అయ్యా మీ అక్క చనిపోతూ పదిరోజులబిడ్డను నాకునప్పగించి పోయింది. మీ బావకూడా పోయినాడు. దిక్కులేని యీ బిడ్డను పెంచాను. దేవుడిదయవల్ల నువ్వు మళ్లీ కనబడ్డావు. నాయనా, నాదిగులు తీరింది. దీనికి నువ్వేదిక్కు. లచ్చీ! రా తల్లి. మీమామ యిడుగో. దేముడుదయవల్ల మళ్లీ మా నాయనకళ్లకు కనబడ్డాడు. నీకుకూడా వీడే దిక్కు తల్లి' అంటూ ఆనందాతిరేకముచేత కన్నీళ్లుగార్చింది. సంతోషము సగముసత్తువ అన్నట్లు చాలాకాలమునుండి లేవలేక నీరసముగావున్న కోటమ్మ లేచి కూర్చున్నది విషయమంతా నిమిషములో గ్రహించిన నారాయణరావుగారు వెంటనే బండినొకటిపిలిపించి లక్ష్మిని, కోటమ్మను ప్రయాణము చేయసాగినాడు. లక్ష్మిని డాక్టరుగారింట్లో పనిజేసేసమయములో చూచివున్న నాయుడు మళ్లీ యిప్పుడుచూచి చాల కటకటపడ్డాడు వెంటనే డాక్టరుగారి ప్రోత్సాహముచేత వెంటనే తల్లిని, కోడల్ని తనయింటికి తీసుకునివెళ్లినాడు నాయుడు.

శుభముహుర్తమున లక్ష్మిని వెంకయ్యనాయుడికిచ్చి పెండ్లిజేయించినాడు నారాయణరావుపంతులు. మనుమరాలిని తనకొడుకు వివాహమాడుట కళ్లారచూచి ఆనందించింది కోటమ్మ. కాని కొద్దిరోజులలోనే తానీలోకాన్ని విడచిపోయింది. కాని లక్ష్మిమాత్రం మామెను మరచిపోలేకపోయింది చాలాకాలము. డాక్టరు దంపతుల ఆశ్చర్యానికి మేరలేదు. ఎప్పుడైనా వెళ్లితే సంతోషంగా 'లక్ష్మి, నీ పెండ్లిజేసేభారం నాదే' నంటూవుంటుంది నవ్వుతూ, సత్యవతమ్మగారు.




ఇప్పుడు నీ యొక్క సొగసైన వస్తువులనన్నిటిని నీకిష్టము వచ్చినపుడెల్ల పలుమారు లక్సుతో జాగ్రతగ నుంచుకొన వచ్చును. ఎందుకనిన నీ పైకమునకు ఈ పెద్ద సైజు లక్సు ఎక్కువ సోపును ఇచ్చుచున్నది. గట్టి రంగుగల పట్టు వస్త్రములను, కంబళము మొదలైన ఉన్ని వస్త్రములను చాల జాగ్రత్తగ లక్సు ఉతుకును. చల్లని నీటిలో లక్సు నురుగును ధారాళముగ నిచ్చును. నీ మలినమైనట్టి సూక్ష్మమైన వస్త్రముల లక్సు నురుగులో జాగ్రత్తగ పులిమిన, మలినమును చెమటయు పూర్తిగ తొలగిపోవును. ఎట్టి చెరుపును కలుగనీయక బాగుగ శుభ్రపరచును. చన్నీటిలో చెరుపులేక దేనిని నీవు తడపవచ్చునో వాని నన్నిటిని లక్సులో ఎట్టి హానిలేక ఉతక వచ్చును !

# క్రొత్త పెద్ద సైజు లక్సు
## కొనుటచేత నీ పైకమునకు ఎక్కువ సోపును పొందెదవు

చిన్న సైజు, సాధారణ సైజు లక్సు ప్యాకెట్లు కూడను నీ పైకమునకు గొప్ప ఆదాయము నిచ్చును.




LEVER BROTHERS (INDIA) LIMITED LX. 7-173 Te.

# ★ విద్యాస్వరూపము

## ఆదర్శమునకు నైతిక విచ్ఛిత్తి ★

● శ్రీమతి బూరుగుల రుక్మిణీబాయి ●

విద్యార్థియొక్క మెదడు అనంతములగు శక్తులకు కేంద్రము. అందుంచి జీవితాచారాదర్శము లుత్పన్నములగుచున్నవి అట్టి యాదర్శములకు నైక్యత చెడినది. గ్రామజీవితమంతయు పట్టణవాసములకు బలియైపోయినది. వృత్తివిద్యలన్నియు యంత్రధాటి కాహుతియైపోయినవి. స్త్రీ పురుష ధర్మమంతయు సాంప్రదాయ విచ్ఛిత్తి నందియున్నది. ప్రాచ్య - పాశ్చాత్య సంఘటనమువలన దాస్యస్వాతంత్ర్యపోరాట మేర్పడినది. ఈవిధముగా విచారింప విద్యార్థిజీవితమంతయు నొక విషాదపూరిత దృశ్యకావ్యమైపోయినది.

వేదకాలమును పరికింపగా విద్యాసముపార్జనమొనర్చు స్త్రీ పురుషు లెనిమిదివత్సరములకే ఉపనయనాది సంస్కారమునొంది గురుకులములం దొదలబడెడివారు. అచ్చటి గురువులు విజ్ఞానజిజ్ఞాసాపీడితులే కాని ధనజిజ్ఞాసాపీడితులు కారు. వారెల్లెడలను 'విద్య - విద్యకొఱకే' అను నాదర్శమునే యనుష్ఠించుచుండిరి. అట్టియెడ విద్యాసముపార్జనాశీలురగు స్త్రీ పురుషులు, గురుదత్తములగు వేదశాస్త్రకళాప్రావీణ్యముచే పటిష్ఠులై, 'క్షణశఃకణశశ్చైవ విద్యామర్థంచసాధయేత్' అను నియమమునకు గురియై, గురుకులములనుండి విడువబడియు, తమ విజ్ఞానబీజములను విశ్వశ్రేయఃసాధనమునకై వినియోగించి బ్రహ్మచర్య ధర్మమున సంపూర్ణమగు ఫలసిద్ధినంది గార్హస్థ్యమును స్వీకరించి విజ్ఞానజిజ్ఞాసా ప్రపూర్ణులై, ఇహపరములందు జీవిత సాఫల్యమును గాంచెడివారు.

ఇక ఆధునికస్వరూపమున, మనము రాజ్యభ్రష్ఠులము, బానిసలము. కావుననే పాశ్చాత్య వ్యామోహపాశములచే ముందు మానసిక బానిసత్వమును, ఆపై దైహిక బానిసత్వమును, ఆపై పారలౌకిక బానిసత్వములు మనకు సిద్ధించినవి. ఇట్టియెడ నేటి పాలక రాజ్యతంత్రజ్ఞులకు లోనై, అత్యల్ప వేతనములకు మన మనోదేహజీవముల నమ్ముడుపెట్టితిమి. మన బాల్య యౌవన కౌమారాద్యవస్థలన్నియు, అనుక్షణమును పాశ్చాత్య సభ్యత్వమునకే గురియగుచున్నవి. అట్టి సభ్యత్వముచే యువతీయువకుల బ్రహ్మచర్యధర్మము భ్రష్ఠమైనది. బ్రహ్మచర్యముచే సాధింపతగిన రాజకీయ, ఆర్థిక, నైతికశక్తి కుంటుపడి సంపూర్ణస్వాతంత్ర్య సంగ్రామమున పరాజయము నందుచున్నాము. బ్రహ్మచర్యేతరములగు గార్హస్థ్యాద్యాశ్రమములందుకూడ సర్వాంగసుందరమగు ధర్మానుష్ఠానమును చేయజాలకుంటిమి. కావుననే మహాత్మాగాంధి బ్రహ్మచర్యాద్యా

శ్రమధర్మముల నన్నిటిని తన జీవితమున ఆదర్శభూతములొనర్చుచూ నేటి పాశ్చాత్య విద్యాసభ్యత్వమును రూపుమాపి భారతీయ యువతీయువకులను అజ్ఞానతిమిర సుషుప్త్యవస్థలనుండి జాగ్రతమొనర్చి విద్యావిధానమును మార్పునొందించుచున్నాడు.

## నేటి విద్యార్థి లక్షణము - దౌర్బల్యము

ఇప్పుడు ఎన్నియో సభలు ప్రచలితములగుచునే యున్నవి. కాని ఆయా సమావేశకాలములకు విద్యావంతులు చేరుచున్నారే కాని వారు చేయు తీర్మానములన్నియు విద్యాసంస్కరణోన్ముఖములు కాక శక్తిక్షైణ్యమునకు, నిరుద్యోగసమస్యకు స్థానభూతములుమాత్రమే యైనవి.

కళాశాలలందుగాని - విశ్వవిద్యాలయములందుగాని తయారగు గ్రాడ్యుయేట్లు జవసత్వములుడిగి వాడిన ముఖములు, గుంటలుపడిన కనుదోయి, అంటుకుపోయిన చెక్కిలి, ఎండిన పెదవులతోడను ప్రత్యక్షమగుచున్నారు. మెదడుమాత్రమే వీరికి సజీవమైయున్నది - అదియును నిస్తేజముగ.

గృహమునకును - విద్యాలయమునకు దుర్భేద్యమగు భిత్తి నిర్మింపబడినది. విద్యావిధానమంతయు సాంఘిక సాంప్రదాయైక్యతను విచ్ఛిత్తి చేయుచున్నది. గృహమున బాల్యవివాహములు, విద్యాలయములందు శృంగారరసప్రబోధపూరితములగు కావ్యపఠనము చేయబడుచున్నది. వ్యవహారమున రాజభక్తి యెక్కుడు. కోరికయందుమాత్రము ప్రజాస్వాతంత్ర్యప్రబోధము మాత్రమే చేయబడుచున్నది. విచారింపగా నీ పరిస్థితులన్నియు బయటనుండి - అనగా విజాతీయతనుండి యుత్పన్నములై యువజన విద్యార్థులయొక్క ఆదర్శ విచ్ఛిత్తిని కలుగజేయుచున్నవి.

## ఇతరదేశములు - యువజనసంఘము

స్వతంత్రదేశముల పరికింప, అచ్చటి యువజన విద్యాలక్షణము, భవిష్యద్దశాకార్యముల సృష్టించి, ఆత్మవిశ్వాసమును వికసింపజేయుచున్నది. వర్తమానకాల పరిస్థితులను సాహసముచే కార్యప్రణాళికయందు పరివర్తనమొనర్చుచున్నది. ఆశాజ్యోతిని త్యజింపక జీవితమును దీపశిఖవలె జ్వలింపజేయును. దేశముయొక్క భవితవ్యసిద్ధినంతను, అచ్చటి యువజన విద్యాలక్షణమే పరిష్కరించుచున్నది. కావుననే వారి యుద్యమములు దేశమహత్తును ప్రదీపింపజేయుచున్నవి. ఆ సంఘము లెల్లెడలను స్వాతంత్ర్యవాయువునే పీల్చుచున్నవి. ఆ సంఘముల రక్తము వీరపురుషుల చరిత్రలచే ముద్రితమైయుండును. భావికాల యుత్సాహ సాహసములచే స్థైర్యము నొందియున్నవి. ఆ సంఘముల తీక్ష్ణదృష్టి కాలమేఘముల బద్దలుచేయును.

## సామ్రాజ్యసంపాదనము - ప్రాచీనాధునికము

నేడు మనకన్నులయెదుట, డిక్టేటర్‌షిప్పుల తోడను, ఫాసిజ, ఇంపీరిలిజమ్, సోషలిజములతోడను సామ్రాజ్య సంపాదనముచేయుచున్నటుల రాజ్యతంత్రము మనకు ప్రత్యక్షమగుచున్నది. ఈ వాదములతో కూడిన సామ్రాజ్యతత్వము వేదకాలమున నిమ్నోన్నతముల నొందలేదు. కాని శేషించినకాలములందు, ఒకదాని వెనుక మఱొకటి ప్రచరితములై పోటీచేయుచు పోరాటమును సాగించుచున్నటుల మన ప్రాచీనచారిత్రక సాక్ష్యములున్నవి. (1) త్రేతాయుగమున రావణ కుంభకర్ణులు తపశ్శక్తి ద్వారమున వరప్రాప్తినొందిరి. రావణుడు దేవమానవులచే అవధ్యత్వమును సాధించుటకు సంపూర్ణమగుశక్తి సామర్థ్యముల నార్జించెను.

సూర్యచంద్రాద్యష్టదిక్పాలక ప్రకృతిశక్తుల నతిక్రమించి రాజ్యతంత్రమును సాగించెను. సామంతరాజుల నందరిని తనరాజులఁజేసెను. తన యేలుబడిలో చరాచర పదార్థముల నన్నిటిని స్వతంత్ర మొనర్చెను. ఇయ్యది సామాన్యమగు డిక్టేటరు షిప్పా! హిట్లర్ వంటి డిక్టేటర్లు రావణుని ముందు ధూపమునకైన పనికివత్తురా! ఇట్లే హిరణ్యకశ్యప, హిరణ్యాక్ష, తారకాసుర మొదలగు దానవనేతలును రాజ్యతంత్రమును నిర్వహించిరి.

మన వేదములందే 'సోషలిజ, కమ్యూనిజములకు' అంకురార్పణ చేయబడినది. 'సహనావవతు-సహనౌభునక్తు-సహవీర్యంకరవావహై-తేజస్వినావధీతమస్తుమావిద్విషావహై-ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః' అని ఇప్పటికిని వైదిక సాంప్రదాయ వివాహవిధులందు స్త్రీల స్వాతంత్ర్యమునకు వలయు ధార్మికవిధులు పాణిగ్రహణమున 'ధర్మేచ, అర్థేచ, కామేచ, నాతిచరితవ్యా-నాతిచరామి' అని విధింపబడుట మనకు తెలియుచున్నది. ఇట్టి సమాన ప్రతిపత్తితోఁ కూడిన సోషలిజము వేదకాలమున మరొకరూపముననైనను, అనుష్ఠింపబడియుండెనని పై వైదిక ఋక్కుల సాక్ష్యమువలన నూహింపవలనుపడుచున్నది కాని యిప్పటి రష్యాయందు ప్రచలితమై సిద్ధినొందిన దీమార్గమే రూపాంతరము నొందినదనవచ్చును. కాక మన వేదాంతమంతయు విశ్వమానవ సోదరత్వమునే ఘంటాపథముగ చాటుటలేదా!

రామాయణకాలమును పరికించిన డిక్టేటరులకు డిక్టేటరగు రావణుని హతమార్చి శ్రీరాముడు సోషలిజమునకు స్థానమిచ్చుటకు ప్రయత్నించలేదా! కాక అగ్నిచే పారిశుద్ధ్యమొందిన సీతా మహాసాధ్విని ప్రజానురంజనమునకై తిరిగి యరణ్యమున బలిపెట్టలేదా! లోకారాధనకై కాంతాకనకముల రెంటిని త్యాగమొనర్చి శ్రీరామచంద్రమూర్తి మానవాదర్శముల చిరస్థాయిగ నుండునట్లొనర్చి యశఃకాయమును బడసెననుటలో సందేహమేమికలదు? ఇట్లే మానవాదర్శముల నన్నిటిని మనకు సమకాలీనుడగు మహాత్మాగాంధి గారు అనుభవపూర్వకముగ మన కన్నులయెదుట ప్రత్యక్షమొనర్చుటలేదా!

## నేటి భరతఖండము - తదుద్ధరణము

నేటి భరతఖండము కళామయసంపదను సంపూర్ణముగ కోల్పోయినది. కళ యనగా ఉపాధ్యాయ వృత్తి మొదలు వివిధవృత్తులను దేశ, దేహ, ప్రకృతులకును, మత సాంఘిక సాంప్రదాయములకును ఐక్యతను సంపాదించి, దేశమును వివిధదాస్యములనుండి విముక్తినొందించుటయే ఇట్టి ప్రణాళిక నుద్ధరించుటలో మతము నకు వృత్తికిని యభేదమును సాధించుట మొదటి ప్రయత్నము భారతీయ గృహోపకరణములన్నిటియందును ఈ యభేదమును సమగ్రముగ ప్రతిబింబింపఁజేయవలెను.

ఋషిముఖ్యశ్రుత వేదవేదాంతాదిజ్ఞానము మొదలు బిచ్చగాండ్ర పాటలవరకును, ఒకేవిధమగు సమన్వయజ్ఞానమును తిరిగి సాధింపవలెను జీవితములను దేశ దైవ భక్తిమయములను గావింపవలెను. ఐహికాముష్మికములకు ఏకాత్మను సాధింపవలెను అద్దాన జ్ఞానసమృద్ధమైన యానందము లభింపగలదు. వృత్తిపరుల హస్తముల దాగియున్న కళాప్రావీణ్యమును లెస్సగ నుద్ధరింపవలెను. అప్పుడే గ్రామ, పట్టణ చైతన్యముద్దీపితమై దేశమంతయును కళామయసంపదచే విరాజిల్లగలదు ఈ ప్రయత్నము కేవలము ధనికశక్తిత్వముచే సాధింపబడనేరదు. ధనము లోకమునకు మూలశక్తియే, కాని తన్నిర్వహణమునకు విద్యాధికులగు (విజ్ఞానులగు) యువతీయువకుల ప్రయత్నములే దోహదమొసగి సర్వసంపూర్ణమగు దేశభవితవ్యతను సిద్ధింపఁజేయగలవు.

# కళ

★

శ్రీపతి
కామరాజు
మైత్రేయి

★

'ఏమండీ, మీపేరు కళా? ముద్దుగావున్నది. కళోపాసకుల లక్షణాలన్నీ వున్నాయి ఆహా! మంచి ప్రొఫైలు వుంది. అదృష్టవంతుణ్ణి నీవు నిజంగా కళానిధివే సుమా!' అని నెమ్మదిగా, కళను రెండు చేతులలోకి తీసికొని బలవంతంగా ముద్దుపెట్టుగోబోయ్యాడు ఆ డైరెక్టరు...

'ఛీ! వదులు...'

'వదలను'

'జాగ్రత్త!'

'ఏం జేస్తావు?'

'నలుగురితో చెప్పి గడ్డిపెట్టిస్తాను...'

'ఆలోచించుకో...'

'నేను సినిమాలో పనిచెయ్యను—'

'ఏం కళోపాసినివి కావూ?'

'అయితే—'

'కళ అంటే మంచిచెడ్డలతో తీసికోవాలి'

'నాకు కళలో వుండే మంచే కావాలి'

'ఛీ! నీవంటి అవ్యక్తి మరొక్కతె వుండదు. సిరి వస్తుంటే మోకాలు అడ్డుతున్నావు.'

—చెళ్ళేలున ఒక్క లెంపకాయపెట్టి, డైరెక్టరు రూములోనుంచి పరుగెత్తుకొనివచ్చి కారులోపడ్డది కళ. అంతే, అంతటితో కళకు సినిమాకు విడాకులు. ఆ పరిశ్రమలో యింక చేరనని శపథంపట్టింది ఆ కళోపాసకురాలు. మరునాడు ఆంధ్ర దైనికపత్రికలో యొక పూర్తి పేజీ యడ్వరుటైజుమెంటు—

"ఆంధ్రలోకానికి నూత్నతార, డైరెక్టరు, కెమేరామేను మొదలైనవారు, ఫిలిం పరిశ్రమకు తమ శక్తినంతా ధారపోసినవారు, సమస్త కష్టాలకు, శ్రమకు, ఖర్చుకు ఓర్చి, ప్రత్యేకించి యేరిన వరాలతార—మిస్ చంచల.

అభిప్రాయాలు :—

డైరెక్టరు :-ఇంతవఱకు ఆంధ్రలోకం, కనని అందం, వినని గాత్రం. ఈమె అభినయించే నూత్నఫిలిం చూడండి.
కెమెరా :-ఏ ఫక్కీలో ఫోటో తీసినా యింత అందమైన వ్యక్తి నేను చూడలేదు.
సౌండు రికార్డరు :-ఏ స్థాయిలో పాడినా యింత హాయియైన పాట నేను వినలేదు.
మేకపు ఆర్టిస్టు :- ఏ మేకప్పు లేకుండా సహజమైన సౌందర్యం, లావణ్యం వుంది మిస్ చంచలకు.

త్వరలో రాబోవుచున్నది. రాబోయే ఉగాదికి ఆంధ్రలోకానికి కానుకగా అర్పింపదలచాము."

ఈ ప్రచురణ చూసింది కళ. భావాలు పరంపరలుగా రేగాయి. ఇవన్నీ తాను ఒప్పుకుంటే, తనకు వర్తించేవి. 'అబ్బా ఎవరినయినా చేయగలరు. ఏ తారనయినా సృష్టించగలరు. దుమ్ములో కలపగలరు. ఒకనాడు తార-మరునాడు కూడు గుడ్డలకు లేని బికారి.'

౨

కళ చిన్నప్పటినుంచి ఆదర్శకంగా పెరిగింది. బడిపంతులు సుబ్బారావుగారి కూతురు. ఈయన భార్య రాధ. ఎంతో గారాబంగా పెంచారు కళను. ఇరుగుపొరుగువారందరికి కళను చూస్తే ఎంతో ముచ్చటగావుండేది. చదువులో చురుకు. మంచి అందమైనది. సంగీతం బాగా నేర్చుకుంది. సుబ్బారావు నాట్యం అంటే చెవికోసుకునేవాడు. అందుచేత కళకు భరతనాట్యం నేర్పించాడు. తనకు వచ్చే కాస్త జీతం, 'కళ'ను ఆదర్శకంగా చేయాలని మొదటనుంచి ఖర్చుపెట్టేవాడు. బళ్లో ఏ యిన్స్పెక్టర్లు వచ్చినా, ఏ ప్రైజు రోజన్నా, అందరు కళ కోసము వెదకాలిసిందే. అందరు కళను అభినందించేవారు.

ఒకరోజు బళ్లో 'పేరంట్సు - డే' ప్రతి సంవత్సరంలాగే యీ సంవత్సరము జరపడానికి యేర్పాటులు జరిగాయి. ఆ రోజునే ప్రైజులన్నీ పిల్లలకు యిచ్చేవారు. పిల్లలు చిన్న నాటకం వేస్తారని, ఫాన్సీ వేషాలకు ప్రైజులిస్తారని ఏవేవో చెప్పుకుంటున్నారు. చిన్న పెద్ద అందరు చాలా హడావిడిగా వున్నారు. వూళ్లో వుద్యోగస్థులందరు వచ్చారు.

ప్రైజులు యిచ్చేటందుకు కలెక్టరు 'రాజు' గారికి ఆహ్వానము పంపితే తప్పక వస్తాననీ, ఆరోజు ఆ వూళ్లో క్యాంపు వేస్తానని జవాబు వచ్చింది. ఇంతకంటే కావలసినదేమిటి? బడిఅంతా అట్టుడుకుతున్నది. మంచి తోరణాలు, ఎఱ్ఱ, పచ్చ కాగితాల జెండాలు, చెట్లమీదనుంచి బడిమీదికి, బడిమీదనుంచి చెట్లమీదికి ఎగురుతున్నాయి. సాయంత్రము 5 గంటలైంది. పిల్లలంతా మంచిమంచి జరీపావడలతో, చొక్కాలతో, వివిధరంగుల రిబ్బన్లతో, పూలతోను, ఒకరిచెయ్యి ఒకరు పట్టుకొని, గంతులు వేస్తూ, వుల్లాసముగా తలిదండ్రుల వెంబడి నడుస్తున్నారు. చూసేవారికి చాల హాయి గొలుపుతున్నది ఆ దృశ్యము. మంచిచెడ్డలు తెలియని ఆ పసికూనల జిలిబిలి పలుకులకు, వారు వేసే వివిధప్రశ్నలకు జవాబుచెప్పలేక, మాటలు మైమరపించి వారి పెద్దరికము కాపాడుకొనుటే ఉచితమని ఎంచి 'అదిగో, ఈవేళ కళ నాట్యం చేస్తుందిట. మీరుకూడ అలా నాట్యం నేర్చుకోకూడదా'అని పిచ్చిపిచ్చి ప్రశ్నలు వేయకుండా వారి బుద్ధి కుశలతను అణిచివేశారు.

హాలంతా క్రిక్కిరిసి తలిదండ్రులతో, ఆడపిల్లలతో కిటకిటలాడుతున్నవి. స్త్రీలు తలలలోవున్న పూలవాసనలచే హాలు పరిమళిస్తోంది.

బిళ్లబంట్రోతు, వెనక తహశీల్దారు, రివిన్యూ యిన్స్పెక్టరు, గుమాస్తా, కలెక్టరుగారితో హాంగుగా దయచేసి వారికై ప్రత్యేకించిన స్థలాల్లో ఆసీనులయ్యారు.

మాష్టరుగారు చెప్పిన తొలిపలుకులతో / వార్షికరిపోర్టు చదవటం అయింది. ప్రెసిడెంటుగారు బడియొక్క రిపోర్టు విని ఆమోదించి మాష్టర్లను, వారుచేసిన కృషికి మెచ్చుకొని, ధన్యవాదాలు అర్పించారు. ప్రైజులు యివ్వవలసిన అవకాశము వచ్చింది. హెడ్డుమాష్టరుగారు లేచి, 'అన్నిటిలో ప్రాముఖ్యతవహించి, ప్రతి సబ్జక్టులోను ఫస్టుమార్కులు వచ్చినందున, ఫస్టుప్రైజు బంగారుపతకం కుమారి కళకు'అని చెప్పారు. ముసిముసి నవ్వులతో, సిగ్గుతో తలవంచుకుని కలెక్టరుగారిదగ్గరకు వచ్చి బంగారుపతకం తీసికొంది. అందరు కరతాళధ్వనులు చేశారు. సుబ్బారావు, రాధల కళ్లు చెమ్మగిలినాయి. వారి పిల్ల యింత మందిలో పేరుదెచ్చుకొని, అందరి మెప్పులు తెచ్చుకోవటంకంటె తల్లిదండ్రులకు కావలసిందేమిటి? మిగతా

షైప్రిజులన్ని యివ్వడము అయినవెంటనే, ఏవో కొన్ని చిన్నచిన్న సీనులు, ప్రహసనాలు అయినవి. తర్వాత కుమారి కళ నాట్యము అన్నారు.

అంతా నిశ్శబ్దంగా వుంది. ఇదివరకే ఏర్పాటుచేసిన స్టేజిలో ఫిడేలు, మృదంగ వాయిద్యములు వాయిస్తున్నారు. ఎక్కడో మురళీనినాదం వినవచ్చింది. ఆ నాదాన్ని వెతుక్కుంటూ రాధ వచ్చింది. ఆ రాధే కుమారి కళ. నాట్యంచేసికొంటూ, మురళీనాధుని వెతుక్కుంటూ, ప్రేమతో ఆహ్వానిస్తూ, ప్రేమరసం కళ్ళలో ఒలుకుతూ, మురళీనాదం విననప్పుడు నిస్పృహచెందుతూ, వివిధభావాలు ముఖంలో చూపిస్తూ చూసేవాళ్ళను ఒళ్లు పులకరింపజేస్తోంది.

ఇంకనుకొన్ని ఆటలుపాటలు అయినతర్వాత సభముగిసింది. కలెక్టరుగారు తమ తుది ఉపన్యాస ములో, 'జీవితంలో కళ యేవిధంగా పైకివస్తుందో చూస్తువుంటాను. గృహచ్ఛిద్రాల్లోపడి 'కళ'ను మరచి పోయి, ముప్పైయేండ్లకే ముదుసలియై, జీవితముమీద రోతకలిగివుంటుందో, లేక, ఆంధ్రదేశానికి హిందూ దేశానికి పేరుతెచ్చి, కళకు మెరుగులుపెట్టుతుందో చూస్తూవుంటాను' అనిచెప్పి సభముగించారు.

## 3

కాలచక్రము తిరుగుతోంది. కళకు 18 సంవత్సరాలు వచ్చేయి. సుబ్బారావుగారు చనిపోయాడు. రాధకు కష్టాలుఅన్నీవచ్చాయి. ఇంట్లో మగదిక్కు లేదు. కళా తానుతప్ప ఎవ్వరులేరు. సుబ్బారావు ఆస్తి చాలావదలిపెట్టకపోయినా, ఏదో యింతతినటానికి భూవసతికల్పించాడు. దానితోటేవారు కాలము వెళ్ల బుచ్చుతున్నారు. సుబ్బారావు బ్రతికివున్నప్పుడు రాధయెంతచెప్పినా కళను పెళ్లిచెయ్యటానికి యిష్టపడలేదు.

కళకు చిన్నప్పటినుండి సినిమాలోకివెళ్లి పెద్దతారఅయిపోవాలని ఓ కోరికవుండేది. దానికితోడు సంగీతము, నృత్యము అవికూడ వుండడముచేత మరీ అభిలాష ఎక్కువగావుండేది. రోజు పేపరులలోవుండే సినిమాపోజులు, బొమ్మలు ఆవిడను ముగ్ధురాలినిగా చేస్తూవుండేవి. ఒకనాటిపేపరులో కళ 'తారలు' కావాలన్న అడ్వరుటైజుమెంటుచూసి, ఇన్నిరోజులకు తనకోరిక తీరుతున్నది కదాఅని, ఎదో జీవనోపాధి కనుపించుచున్నది కదాఅని, అప్లికేషను పెట్టుకొన్నది.

కళనుచూసిన దగ్గరనుంచీ యన్ని గౌరవాలు, ఆదరాలు ఆవిడవే. అసలు డైరెక్టరుగారు నిశ్చ యించడమే రెండు మూడురోజులు కులాసాగావెళ్లిపోయింది.

డైరక్టరుగారిని దర్శించివచ్చిన తర్వాత కళ యేమిచేయటానికితోచక నిస్పృహతో తనపడక కుర్చీలో పడుకుని ఏదో ఆలోచిస్తోంది. భగ్నహృదయ జీవిత ఆశయాలన్నీ ఒకసారి రేకెత్తాయి. చిన్నతనంలో తనకువచ్చిన గౌరవాలు, ప్రైజులు, కలెక్టరురాజుగారి ఉపన్యాసం యివన్ని ఒక్కసారి ఆమె మనోవీధిలో తళుక్కుమన్నాయి. వేడినిట్టూర్పు విడిచింది—

కళ ఎంతో ప్రయత్నంమీద కలెక్టరు రాజుగారి అడ్రెసు కనుక్కొని, ఆయన దర్శనార్థము వెళ్లింది. రాజుగారు కళను చూచి నివ్వెరపోయినాడు. ఆనాటి కుమారి కళ యీనాటి భగ్నహృదయ కళ.

తనకున్న పలుకుబడి వినియోగించి స్త్రీ సదనములో నెలకు ఏభైరూపాయిల జీతంమీద పిల్లలకు కళోపాధ్యాయినిగా ఏర్పాటుచేయించాడు. ఇచ్చిన వాగ్దానము నెరవేరింది.

పిల్లలకి నాట్యము నేర్పుతూవుంటే కళకి ఎంతో ఆనందముగా వుండేది. పిల్లలను బాగా తరిఫీదు చేసేది. ఇక విద్యార్థినిలు సహజంగా, అవలీలగా నృత్యంచేస్తూవుంటే 'భావి ఆంధ్రదేశపు అవలోకమా' అని అందరు అన్నారు. పాపం కుమారి కళ కళ్లు చెమ్మగిలి ఒక కన్నీటిబిందువు ముత్యమువలె జారింది—

# పరదా

**— శ్రీమతి —**

**ఎన్. అలివేణి**

★

పరదాల మాటునన్
బ్రతుకేటి పరదా?
సోదరీ!
తెరదాటి విశ్వమును
పరికింప రాదా?

పరదాల మాటునే
బాగున్న దంటావు
బానిసత్వమె మహా
భాగ్యమంటావు - ఐన
స్త్రీజాతి కికముక్తి
లేదమ్మ సోదరీ! ||పర||

మహిమాస్పదము 'హిందు'
మతమునందున బుట్టి
దానికి కళంక భూ
తంబైన పరదాను
చేపట్టినా వింత
సిగ్గయిన లేకుండ ||పర||

పులిజూచి నక్క వా
తలు పెట్టుకొన్నట్లు,
అన్యమత సాంప్రదా
యంబైన పరదాను
అనుకరించీ హాస్య
మునకు పాలయ్యావు ||పర||

అన్య మతస్థులే
అది దురాచారమని
అవలగెంటిరి దాని
నదితెచ్చి పెట్టుకొని
పదిలమ్ముగా భద్ర
పఱిచావ వెఱ్ఱివై ||పర||

నిను 'అసూర్యంపశ్య'
అనగానె అదియొక్క
పొగడికయని మదిన్
పొంగి పోయెదవు చాల్
చాల్ దివాంధము తోడ
సరిపోల్చుటయ కాద ||పర||

సూర్యరశ్మి యొకరి
సొత్తౌటె పురుషుండు
గుత్తకొన్నాడ నీ
కున్ లేకపోవుటకు
ఆరోగ్యమునకు న
త్యంతావసర మద్ది
పడయవే రవిరశ్మి
పరదాలు వడివీడి ||పర||

ప్రకృతి కాంతామణీ
రమ్యావయవములను,
తిలకించి పులకింప
కలనైన వీలవని
దిక్కుమాలిన పరద
తెచ్చుకొంటివి బేల ||పర||

సర్వతోముఖ సంఘ
సంస్కార మీవేళ
జరుగుచున్నను దురా
చారమౌ పరదాను
అంటిపెట్టుకు వదల
నంటావు ఇదియేమె ||పర||

అన్ని మహిళా సమ
స్యలలోన 'పరదా' యె
అతిముఖ్యమగు కాన
సవరింపు మనుముందు
అదియె స్త్రీ యున్నతికి
ప్రథమ సోపానంబు

పరదాల మాటునన్
బ్రతుకేటి పరదా?
సోదరీ!
తెరదాటి విశ్వమును
పరికింప రాదా!

# సజీవమైన వాఙ్మయం కావాలి

## కవిత్వమున్నది కాని - నిర్మాణం లేదు

★ రోహిణి ★

"నేటి మన వాఙ్మయము" ను గురించి చెప్పుకోవాలంటే ఉత్సాహం సన్నగిల్లుతూవుంది. అంటే చెప్పుకోతగ్గదియేమీలేక కొంత, ప్రాచీనవాఙ్మయానికి పై చేయికాగలిగినది, లేక వాటితో తులతూగేది కాని లేక కొంత, ఏమీ చెప్పుకోలేక పోతున్నాము. పురుషులచే నిర్మింపబడ్డది గాని, స్త్రీలచే నిర్మింపబడ్డదిగాని ఏదీ లేకపోవడం మన దౌర్బల్యాన్ని సూచిస్తూవుంది.

అసలు వాఙ్మయ ప్రపంచములో స్త్రీలకు సంబంధం చాలాతక్కువ. ఈ దౌర్బల్యం అన్నిభాషలకు వున్నట్టే మనభాషకుకూడావుంది. ఇక స్త్రీ రచనల కొరకు చూడాలంటే ప్రాచీన కవయిత్రీమణులైన గార్గి, మైత్రేయి, అవన్తిసుందరి, సులభ మొదలైనవారు మాత్రమే కనబడతారు. ఇటీవల పూర్వకవయిత్రీ మణులైన మొల్ల, తరిగొండ వెంకమాంబ, ముద్దుపళని మొదలగువారు గోచరిస్తారు. అంతే—

ఇక ఆధునిక రచనలలో పూర్వపువారి దారిని పోయినదేతప్ప స్వతంత్ర రచనగానరాదు. ఇది భావి చరిత్రకారునికి ఒక నిద్రాణమైన యుగంలా కనబడుతుంది—నిర్మాణములేని నిస్తేజులమనుకుంటాడు.

అయితే నేడు కవిత్వం లేదనిగాదు, నిర్మాణంమాత్రం లేదు. ఈనాడు అమల్లోవున్న భావకవిత్వం తాటాకుల మంటలాటి 'పొంగు'గా చూడబడుతోంది గాని, సరియైన నిర్మాణపు పంథాలోకి చేర్చబడడంలేదు.

ఇక ఎటునుంచి ఎటుచూచినా, ఈ విషయంలో మనం ఏమాత్రమూ అలక్ష్యంగా వుండకూడదు, శాశ్వతంగానిలచి, ఒక క్రొత్తదనానికి మార్గదర్శకము కాగలిగిన గ్రంథాలు మన యుగంలోకూడా నిర్మితంకావాలి.

అయితే మనలో శక్తివంతులులేక కాదు ఈ దౌర్బల్యం వృద్ధిఅవుత. ప్రస్తుతం 'మనది' అంటే 'మనకు' గౌరవంలేని పరదాస్యప్రవృతి అనే తమస్సులో పడి, అజ్ఞానులమైవున్నాము; ఇదే మనలను నిర్వీర్యులను చేస్తోంది. 'ఇది సజీవమైన వాఙ్మయము' 'ఇది స్త్రీలచే నిర్మాణమైనది' అని చెప్పుకోగలరచన సృష్టింపబడితేనేగాని మనకర్తవ్యం పూర్తికాదు. దీనికి వెంటనే నేటికవితాధురీణులు, కవితామతల్లులు కొంచెం శ్రద్ధబూనుతారా?

# బదులు

● శ్రీమతి నందగిరి ఇందిరాదేవి



**ఎరువు, ఉద్దెర, బదులు, అప్పు—చివరకు చావుబాకీ క్రింద పరిణామం—పుచ్చుకొనునప్పటి శ్రద్ధ ఇచ్చు నప్పుడుండదు—ఈ దౌర్బల్యం 'అలవాటు' అయిపోయి, మనలో నీచత్వాన్ని మనకు తెలియకుండానే వృద్ధిచేస్తోంది. ఇది ఉపేక్షణీయంకాదు.**

బదులుతీసికొనుట దురభ్యాసమనిన వింతగాఉండవచ్చు. ఏలనన, కొన్ని అలవాట్లు దురలవాట్లు అని మనకు తెలిసికూడ వాటినుండి తప్పించుకొనలేము. జర్దాతినుటగాని, పొగత్రాగుటగాని (Smoking) ఆరోగ్యమునకు భంగముకలిగించు దురభ్యాసమని ప్రతివారికి తెలియును. కాని ఈ దురలవాట్ల జాబితాలో 'బదులుతీసికొనుట'కూడ ఉన్నదని సాధారణముగా స్ఫురించదు. ఎంతో సామాన్యవిషయమే అయినప్పటికి, ఈ బదులుతీసికొనుట అలవాటయినవారు, త్రాగుడుఅలవాటుకంటె విపరీతముగా, నెమ్మదిగా అప్పులు చేయుటకు వెనుదీయరు. వీరికి అప్పుచేయుట మిగుల కొంచెపువిషయముగా కన్పట్టును. ఈ అప్పుమొదలు కొద్ది మొత్తముతో ప్రారంభమయి క్రమముగా పెరుగకమానదు. ఈపెద్ద మొత్తములు వడ్డీకి వడ్డీలతో ప్రజ్వలించి కాపురములను కాలవహ్నిలో కూలద్రోయును.

ఏ దురభ్యాసమునయినను దానిని అలవరచుకొను నుద్దేశము ఎవరికియుండదు ప్రథమమున. కాని అదిఏదో తమాషాకు సిగరెట్లు, సారాయి, నల్లమందు-ఒకసారి రుచిచూడడమునకే ఆరంభమయిన అలవాటు, మత్తుకలిగించుగుణము కలవి కనుక, మరియొకసారి ఆకర్షింపబడెదరు. ఇంతలో అలవాటుకాబోయినదాయని రెండవసారికూడ తప్పదు. మూడవసారి తప్పించుకునెదమనినను తప్పించుకొనజాలరు. బదులుతీసుకొనుట కూడ ఆ విధముగనే అభ్యాసమగును. అందువలన చిన్నప్పటినుండియు చక్కగ పాతుకొనిపోవును ఈ అలవాటు.

'ఒ-న-మా'లు దిద్దుకొను పిల్లలదగ్గరనుండికూడ 'ఒకమాటు నీ బలపంముక్కయియ్యవు?' అని ప్రక్కపిల్లలను అడిగెదరు. కొంచెము పెద్దవారైనపిమ్మట విద్యార్థులు తరగతిలో టీచర్లుఇచ్చునోట్సు బద్ధకముచేత అప్పటికప్పుడు వ్రాసుకొనరు. మరల వ్రాసుకొనవచ్చునని తరగతిలో తమాషాగ గప్పాలుకొట్టి సాయం కాలము కష్టపడిపనిచేయునట్టి విద్యార్థులవద్దకు నోట్సు బదులుకువెళ్లెదరు. ఇక గృహస్థులయినపిమ్మట ఈ అలవాటు తమాషాక్రిందనుండక మరల్చుకోలేని అలవాటుగమారును. బజారులో ఆకర్షణీయమయినవస్తువు కనబడినయెడల, అది అవసరములేకపోయినను, దగ్గరడబ్బులేని సందర్భములో స్నేహితులనడిగి 'యింటికి పోగానే యిచ్చివేస్తాను' అని ఆవస్తువుకొనుట జరుగును. చేతులో పదిరూపాయలనోటున్నను పండ్లవానికి రెండణాల డబ్బులియ్యవలసివచ్చినప్పుడు నోటును విడిపించ బద్ధకించి ప్రక్కయింట రెండణాలు బదులు తీయుదురు.

ఇట్లు బద్ధకమువలన, సోమరితనమువలన ఒకటి రెండుసారులు బదులుతీసికొనినపిమ్మట ప్రతివస్తువు కూడ బదులుతీసికొనివచ్చుటకు బుద్ధిపుట్టును. ఈ తీసికొనిన అణాలు, రూపాయలు, వస్తువులు ఇయ్యకుండవలెనను

నుద్దేశముతో తిరిగియియ్యరనికాదు. తీసికొనినప్పుడు తొందరగా ఇయ్యవలయుననియే తీసికొందురు. కాని అశ్రద్ధవలన మరచిపోవుటకూడ కొన్నిసారులు సంభవించును దీనితో మనస్పర్థలేర్పడక తప్పవు. ఈ మనస్పర్థలు, తత్సంబంధమయిన ఎత్తిపొడుపులు చిన్న చిన్న పోట్లాటలుగామారి 'వారికి వీరికి మాటలులేవండీ' క్రిందకు దిగును. సంగతేమని విచారించిన 'వడ్లగింజలోనిది బియ్యపుగింజ.' తోడుకు మజ్జిగచుక్క నీయలేదనో, పిండివిసురుకొనుటకు తిరుగలియియ్యలేదనో సాధారణముగా స్త్రీలలో మనస్పర్థలకు కారణములగును. అలవాటయినపిమ్మట ఈ రకమువారు బదులుతెచ్చిన వస్తువులుకాని, డబ్బుకాని తిరిగి యిచ్చివేయవలయు నన్న భయముకాని బాధ్యతనుకాని గుర్తించరు.

కొందరుసంపాదన యెంతతక్కువగనుండినను తమ 'స్టాండర్డు'ను కాపాడుకొనుటకు కొనువస్తువులకు, బిడ్డల నగలకు పెట్టుఖర్చు అమితముగానుండును. ఇవన్నీ అవసరముగానే కన్పట్టును. సంపాదననుబట్టి ఖర్చులు హెచ్చుతగ్గు చేసుకొనవలయునుగాని ఏనెల కానెల 'హళ్లికి హళ్లి-పూజకు పూజ' చేయుటవలన బదులుచేయవలసివచ్చును. అకస్మాత్తుగావచ్చుజబ్బులకు, ప్రయాణములు మొదలయినవి వచ్చినటువంటప్పుడు సంఘములో గొప్పవాళ్లమని అనిపించుకొనుటకు ఎక్కడలేనిడబ్బు ఖర్చుపెట్టుటవల్లన జబ్బులమాట అటుండ నిచ్చి రోజుబత్తెముగడుచుట దుర్ఘటమగును. అయ్యగారిప్లానలు సూట్లు, అమ్మగారి బనారసు పట్టుచీరలు మొదలుకొని స్నేహితులకు కాఫీకప్పులవరకు ఆయాఅంగళ్లలో బదులే. ఇక్కడ ఈ శబ్దమును బదులనివాడక ఉద్దరఅనివాడుకున్నను ఫలితము రెండునుఒకటే. కొద్దిగా నాగరకులమనిపించుకున్న వారిఅవసరములు అట్లుండ తక్కువజాతివారికి దురలవాట్లు ఉండుటవలన ఆసమయముకాగానే బదులుచేయవలసినదే. త్రాగుడు అలవాటయిన, తలతాకట్టుపెట్టిఅయినా డబ్బు తెచ్చుకొనెదరు. ఇట్లు అప్పులన్ని పెరిగినపిమ్మట ప్రాణము విసిగి ఆత్మహత్యలరూపమున పరిణమించును.

బదుళ్లుకాక 'ఎరువు' లుకూడ అటువంటివే. నగలు, బట్టలు, వెండివస్తువులు మొదలయినవి తీసుకొనిన వస్తువులను ఆ రూపములోనే తిరిగి యిచ్చుటను 'ఎరువు'అనివాడెదరు. ముప్పాతికమువ్వీసము పెండ్లిండ్లలో పోట్లాటకు కారణము ఈఎరువుసొమ్ములే. వివాహంముగిసిన పిమ్మట పెండ్లిపీటలపై పెట్టినవగలు తీసికొనుట సంభవించగానే బాగా సొమ్ము పెట్టినారని సంతోషించిన తల్లిదండ్రులు ఏదోవిధముగా తమకోపమును ప్రకటించెదరు. ఈవ్యవహారము ముదిరినప్పుడు మగపెళ్లివారు 'కావలిస్తే మీ అమ్మాయిని తీసుకుపొండి. మాఅబ్బాయికి యిహపెళ్లేకాదా?' అని ధీమాగా మాట్లాడెదరు అంతటితోచెల్లు ఆపెళ్లి! ఆ అమ్మాయి వీరికవసరములేదు.

బదుళ్లు, ఎరువులు ఇచ్చువారు తాము ఇచ్చుటకూడ ఒక దురభ్యాసమని గమనించిన ఈ చెడు అలవాటు సమసిపోవును సాధ్యమయినంత వరకు బదులు ఇచ్చుట నిరాకరించుట అలవరచుకొనవలయును అంత్య నిష్ఠూరమునకన్న ఆదినిష్ఠూరమే మేలుకనుక. కాని మొహమాటమువలన, స్నేహితమువలన అట్లు అడిగినప్పుడు మోటుగా లేదని నిరాకరించలేము. ఇట్లుబదుళ్లు ఇచ్చుటలో పరోపకారము సహాయము లేదనను. నిజముగా, స్నేహితులయినవారు ఆపదలో నున్నప్పుడు డబ్బు సహాయము ( ఇంకేదయినను ) చేయవలసినదే కాని తిరిగి వాపసు రాబట్టుకొన వలయునను ఆశ లేకుండా ఇచ్చుట మంచిపద్ధతి. ఒకవేళ ఆడబ్బు వాపసు వచ్చినట్లుయిన సంతోషము. లేకున్న దిగులుపడకూడదు అట్లే బదులుకు వెళ్లకుండా సరిపెట్టుకొనుట ప్రతిగృహిణి, ప్రతిగృహస్థుడు నేర్చుకొనవలయును. బదుళ్లుతెచ్చి స్నేహితులను సంతోషపెట్టి గొప్పవాళ్ల మనిపించుకొనుటకంటే—నిర్భయముగా బీదవారముగానే ఉండిన, తినినతిండి ఒంటబట్టును. తమసంపాదన కనుగుణముగా ఖర్చుపెట్టుకొనిన ఈ చిక్కులేవియు నుండవు.

# భృంగమా!

● శ్రీమతి వట్టికొండ విశాలాక్షి ●

ఈ కలువపూవులో
ఈవు ఝుంకారిస్తు
ఆ కలువపూవులో
ఆపె ఝుంకారిస్తు
ఏమి చేయుచునుంటిరే!
భృంగమా!
ఏమి చేయుచునుంటిరే!

★

రమణీయమైన ఆ
రామవాటికలోన
గుంపు గుంపులు గూడి
సొంపుగా కూర్చుండి
ఏల చూచుచు నుంటిరే?
భృంగమా!
ఏల చూచుచు నుంటిరే?

★

అస్ఫుటిత కుసుమాళి
నందముగ కూర్చుండి
పరిమళం బింతేని
పరవశము గాకుండ
కాపుకాయుచు నుంటివా?
భృంగమా!
కాపుకాయుచు నుంటివా?

★

కలువరేకులలోని
కమ్మతావులు చిమ్మ
మధురాసవాస్వాద
మత్త చిత్తమ్ముతో
ఝుంకార మొనరింతువా?
భృంగమా!
ఝుంకార మొనరింతువా?

★

భవదీయ మృదుగాన
పారవశ్యమ్ములో
ఉన్నంతసేపు నా
కొక్క విషయంబేని
జ్ఞప్తికై నను రాదుగా
భృంగమా!
జ్ఞప్తికైనను రాదుగా!

★

సద్భావ సౌధాళి
శాంత చేతస్కులై
కల్పనా ప్రతిభమై
కైతనల్లెడు కవుల
కామోద మొనగూర్తువా?
భృంగమా!
ఆమోద మొనగూర్తువా?

★

అనుపమాన దయార్ద్ర
సార్ద్రచిత్తవయేని
అహరహంబును గూడ
ఆనంద దాయివై
అచటనే వసియింపుమా!
భృంగమా!
అచటనే వసియింపుమా!

# మహారాష్ట్ర మహిళలు

● అంగపటిమకు - సుగుణ సంపదకు - ధైర్యసాహస ములకు ఆంధ్రవనితలకు వీరు అక్కచెల్లెండ్రు ●

శ్రీమతి గంటి కృష్ణవేణమ్మ

మహారాష్ట్రమనునది బొంబాయి రాజధానిలోని కొన్ని జిల్లాలు కలసిన ప్రదేశము. మధ్యపరగణాలలోను, నిజాంరాజ్యములోను మహారాష్ట్రులు లేకపోలేదు. కాని యాప్రాంత్యము లుత్తరమహారాష్ట్రమని పిలువఁబడుచున్నవి. ఉత్తరమహారాష్ట్రులకు దక్షిణమహారాష్ట్రులకు భాషలో చాలవఱకు వ్యత్యాసములున్నవి. దక్షిణమహారాష్ట్రులభాష శుద్ధము, ఔత్తరాహుల దన్యభాషా మిశ్రమము.

మహారాష్ట్రభాష పంచప్రాకృతములలో నొకటి. దేవనాగరలిపి దీనిప్రాచీనతను వెల్లడించుచున్నది. వీరిభాష, దేశము శతాబ్దములనుండియు చారిత్రకప్రశస్తిని బొందినవి. చాలవఱకాంధ్రమునకు మహారాష్ట్రమునకు పోలికలున్నవి. పవిత్ర గౌతమీ కృష్ణానదులు రెండుదేశములను శీకరాక్షతలతో సేసలుచల్లి యాశీర్వదించుచున్నవి. గోదావరి మహారాష్ట్రముననే భూమికి దిగినది. ఆంధ్రమునుజుట్టి యంబుధిఁగలసినది. మనరాష్ట్రమువలె నిదియును పురాతన నాగరికతగలది. ప్రఖ్యాతివహించిన పురుషులేగాక స్త్రీలును రెండుదేశములలో నున్నారు.

భారత స్త్రీలోకమున కాదర్శప్రాయులైన మహిళామణుల నీ రాష్ట్రము నాటికినేటికి కనిపెంచుచున్నది. పీష్వాలకాలమునుండియు మహారాష్ట్రమునకు పూనా ప్రధాననగరమును, సాహిత్యము నకుఁబట్టుగొమ్మయునైయున్నది. చాలావఱకిచటి స్త్రీలు విద్యావతులు. గ్రామాదులలోని కర్షకకుటుంబములు విద్యాగంధము లేనివనుట తప్పుకాజాలదు సాధారణ గ్రామములోను, చిన్నచిన్న పట్నములలోను మహిళాసంఘము లున్నవి. విద్యావతులగు స్త్రీల యాజమాన్యమున నీసంఘములు స్త్రీజనోద్ధరణకై యనుపమానమగు సేవను చేయుచున్నవి. స్త్రీలను విద్యావతులుగా నొనర్చుటే యీసమాజముల ముఖ్యోద్దేశము. సభ్యురాలుగా చేరిన ప్రతిస్త్రీయును సంఘసేవసేయవలెననెడి యాశయ మీసమాజములలో గొనియాడదగినది. కార్మికుల యిల్లాండ్రకు తదితర స్త్రీలకు మహిళాసంఘములు విద్యనిచ్చి నాగరకులనుగా నొనర్చుచున్నవి. అన్నిటికంటె నాంధ్రమహిళలు గ్రహింపఁదగిన యుత్తమాదర్శము వీరికడనున్నది. యాజమాన్యము వహించినవారియెడ సభ్యురాండ్రందఱుచూపు గౌరవవిశ్వాసములు-దీనిని వీరపూజయనుడు, నేతలయెడభక్తి యనుడు, ఏదైననుఁగావచ్చును-నాయకురాండ్ర యడుగుజాడలఁదప్పించి యవల పాదమూపని వీరిభక్తి విశ్వాసములు గొనియాడఁదగినవి గావా? వీరిసమాజమే వీరికుటుంబము. కలతలు, కష్టనిష్ఠూరము లీకుటుంబమున నుండవు. సమాజోద్దేశమును గార్య రూపమునఁబెట్టి సఫలీకృతమనోరథులు కావలెననెడిదే వీరియుత్తమలక్ష్యము.

పెక్కుచోట్ల సేవాకాంక్షగల స్త్రీలు వైద్యసహాయము దొరకనిచో స్త్రీల కష్టముల నివారింపఁదలఁచి ప్రసూతికావైద్య (Midwifery) పరీక్షలకు బోయి యుత్తీర్ణులై సేవకుగడంగుచున్నారు. అచ్చటచ్చట యీ సమాజము లనాథ శిశుపోషణముకూడ చేయుచున్నవి. తన్నిమిత్తము శ్రీమంతుల సీమంతినులు గూడ Nursing నేర్చుకొనుచున్నారు. ఇంతియగాక యీ సంఘము లమాయకపు బాల వితంతువులకుఁ బైపరీక్షలకేగఁదగు సామర్థ్యమును గల్పించి స్వయంపోషక శక్తిని కలిగించుచున్నవి.

నేనెఱింగినంతలో మనయాంధ్రవనితలకన్న, ఘూర్జరాంగనలకన్న మహారాష్ట్ర స్త్రీ హృదయ మౌదార్య ధైర్యసాహసముల కాకరమని చెప్పకతప్పదు. పూర్వ మెపుడోయుండిన దుర్గావతి యాదిగాగలవారి కథలటుండ, నేడును బొంబాయి నగరముననేగాక నాసిక, ఖాందేశ్, మున్నగు చిన్నపట్టణములలోగూడ స్వాతంత్రోద్యమములందుగాని, మరి యే కార్యక్రమములందుగాని బాలికలు, యువతులు, వృద్ధులు ముందంజవేసినిలుచుచుఁ దమ పూర్వుల చరిత్రముల జ్ఞప్తికిఁదెచ్చుచున్నారు. పికెటింగ్ మొదలగు ముఖ్యస్థలముల స్త్రీలే కనబడుచుందురు. రక్షకభటులొకరి స్థానమునుండి తప్పించిన మరుక్షణముననే మఱియొకయువతి కాన్పించుచుండును. అక్షయవస్త్రముల ట్లొకదినమంతయు నీరీతిజరుగుట నొకానొక సమయముననే స్వయముగఁ జూచియుంటిని. నిష్పాక్షికబుద్ధితోఁ బరిశీలించిన మనదేశమున స్త్రీ లింతటి సాహసచిత్తులు లేరనియే చెప్పవచ్చును. ఒకమాటు మనయాంధ్రదేశము నుండి వచ్చిన M L A. (Central) గారొకరీయూర 'ఆంధ్రమహాసభ' యందు పన్యసింపుచు "అఖిలభారత కాంగ్రెసు సమావేశపుటుత్సవ సందర్భములో 'ప్రభాత్ ఫేరీ'లు సాగించుచుండిరి. అన్నిదేశముల గుంపులలోను స్త్రీలనేకులగు పడుచుండిరి. కాని యాంధ్రదేశపు పంక్తిలో నొక్క దువ్వూరి సుబ్బమ్మగారు దక్క మరియొక స్త్రీ యెట్టునకైనను లేకుండెను. దీనిఁబట్టి మనయాంధ్ర స్త్రీల సాహసౌదార్యములను స్వాతంత్ర్యాభిమానము లనెఱుంగనగు" నని విచారమును వెలిబుచ్చియుండిరి.

మహారాష్ట్రమున స్త్రీలనేక సంఘములలో వ్యాయామ పరిశ్రమలయం దుత్తీర్ణులై స్వచ్ఛందసేవికాదళముల వేనవేలు స్త్రీలను చేర్పించుచున్నారు. చేతి పనులన చెప్పనక్కరలేదు. క్లబ్బులలోని సభ్యురాండ్రుచేసిన చిత్ర విచిత్రపుఁ జేతిపనుల ప్రదర్శనములు (Exhibitions) సాగించి తన్మూలమున సంఘాభివృద్ధికి ధనమును ప్రోగుచేయుచున్నారు. వారి సంఘము లింతటి యుపయుక్తములగుటకు ముఖ్యకారణము వారిలోగల సంఘీభావము.

మనకును వారికినిగల వ్యవహారతారతమ్యముల నింతవఱకును పరిశీలించితిమి. ఆచారములఁ గొంతవఱకు గమనింతము. ఉత్తమ కులాంగనలేగాక తదితర జాతుల



'మహారాష్ట్ర' మనుట తోడనే వీరచిహ్నమని ద్యోతకమగును. శివాజి, దుర్గావతి, తిలక్, గోఖ్లేలవంటి వీరావతంసల కడుపారగన్న ధన్యభూమి అది.

స్వాతంత్ర్యాపేక్షకు, ధైర్యస్థైర్యసాహసములకు, సంఘీభావమునకు, కరడుగట్టిన విశ్వాసము గల వారిఆచార వ్యవహారముల యందభిమాన గౌరవాప్రమత్తతలకు మహారాష్ట్ర మహిళలదే అగ్రతాంబూలము.



వారును శుభ్రత శీలములందాసక్తి గలవారు—మాంసాహారులు కానిండు, శాకాహారులు కానిండు. నిద్దుర లేచినంతనే ప్రతిస్త్రీయు కల్యకృత్యముల నిర్వర్తించి స్వీయాలంకరణమునకు గడంగి, తలదువ్వి జడవేసికొని ముఖమున బొట్టుపెట్టుకొని, తరువాత గృహాంగణముల రంగవల్లులచే నలంకరించును. నాగరికులుగాని యనాగరికులుగాని వీరివలె పాత్రముల తళతళలాడునట్లు శుభ్రపఱచుకొను నలవాటవశ్య మనుకరింపదగినది. వంట చేయునప్పు డనాగరికులనిపించుకొను స్త్రీలును మిక్కిలి పరిశుభ్రతతో భోజనపదార్థముల నుపకరణముల సిద్ధముచేసికొందురు. ఎంతపేదవారైనను నీదేశమున మూతలేని పాత్రముల కొనరు.

మహారాష్ట్ర దేశమునందలి స్త్రీలు చాలవఱకు సుఫరద్రూపులు. వీరినిజూచియే రవివర్మ తన చిత్రములఁ గళలుట్టిపడునట్లు లేఖింప గలిగెను. నాగరికులగువారిమాట యటుంచి పల్లెపడుచులుకూడ కనుల పండువు సేయునట్లలంకరించుకొందురు. జాతివిభేదములేక సర్వులొకేరీతి పైకాసెబిగితో చీరలఁగట్టుదురు. ముక్కునకు నత్తువేసికొను నలవాటు నేటికిని వీరియందు విరివిగాఁగనబడుచున్నది. కుంకుమాంకిత వదనముతో, నాసికాచంపకమునకు నాడెముఁగూర్చు ముక్కరతో, మంగళాలయయగు గౌరీదేవివలె మహారాష్ట్రాంగన కనులపండువుసేయును. విపరీతపు సొగసులకులోనై వ్యక్తిత్వమును చంపుకొనని యాదర్శ ప్రాయయగు హిందూగృహిణి యీమె.

స్వకులాచారానుసరణమునందును, స్వధర్మాచరణమునందును వీరికి పట్టుదలహెచ్చు. ఆంధ్ర వనితామతల్లికివలెనే వీరికిని శ్రావణమాసము ముఖ్యము. క్రొత్తగఁబెండ్లియైన పడుచునకు మనవలె మంగళగౌరీ వ్రతమున్నది. వరలక్ష్మీవ్రతమును వీరుపాటింపరు. నాగచతుర్థి, గరుడపంచమి యిత్యాదుల ననుసరింతురు. దసరా, దీపావళి, సంవత్సరాది, వినాయకచతుర్థి వీరి ముఖ్యమగు పండుగలు. ఆషాఢశుద్ధ ఏకాదశీనాడు పండరీపురమున తిరుణాలజరుగును. ఆనాడు మహారాష్ట్రులు స్త్రీపురుషులుపవసించి భజనలు, పూజలు జరిపింతురు.

వీరు మాతృభాషాభిమానులని చెప్పకతప్పదు. ఏలయన నెంతటియనాగరికులైనను, కాయకష్టము సేయువారైనను వారివారిపిల్లలను - మీదుమిక్కిలి పదిపదునైదేడుల యాడుపిల్లలను విద్యాభ్యాసమునకై పాఠశాలలకు బంపుచుందురు. వారు నువేషములననుకరింపక, తమ యాచారములనుండి దృష్టినిమరల్పక విద్య నభ్యసింపుచుందురు. చదువుకొనినస్త్రీలు గృహకృత్యముల నిర్వర్తింపరను మూఢమతమునకు వీరి యాచరణ ఖడ్గమువంటిది. మనదేశపుస్త్రీలకన్న వీరికి జాత్యభిమానముమెండు. సంఘమున సంఘీభావము బలవత్తరము.

అంగపటిమయు, సుగుణసంపదయు, ధైర్యసాహసములును వీరిలోవలె తెనుగువనితలయందును గలవు. కాని మనస్త్రీలోకమునకుత్తేజ మిచ్చువారుకొఱత. విసుగువిరామములేని ప్రయత్నములవలన, నిరంతర ప్రచారములవలన మనస్త్రీలకిట్టి యున్నతదశ తప్పకరాగలదు. కుగ్రామముల, పట్టణముల, నగరముల, మారుమూలల స్త్రీజనోద్ధరణకై యభ్యుదయ సంఘములు చిన్నవికాని, పెద్దవిగాని స్థాపించుకొని ప్రచారము సాగింపఁగల యుత్సాహవతులగు యువతీరత్నముల చేతనున్నది యాంధ్రమహిళల భావి భాగ్యోదయము. ఉద్ధరింపఁ బ్రయత్నింపక మనస్త్రీలు వెనుకబడియున్నారనుకొనుట మనదేతప్పు 'యత్నేకృతే యదిన సిద్ధ్యతికోఽత్రదోషః'. యత్నించి విఫలమనోరథులమైనను తప్పుకాదు—

# సత్వరాంధ్రరాష్ట్ర సముపార్జనలో

# స్త్రీల బాధ్యత

ఆంధ్ర పుత్రిక

'ఎక్కడున్నావే గొంగళి? అంటే, వేసినచోటనే వున్నాను' అన్నట్టుగా వుంది మన ప్రత్యేకరాష్ట్రోద్యమస్థితి. పాతిక సంవత్సరాలుగా జరుగుచున్న యీ ఆందోళన, ఉత్సాహం ప్రారంభమైననాడు ఎట్లావుందో నేడూ అట్లానేవుంది. అంతకంటె ఏవిధమైన అభివృద్ధీ లేదు—

అయితే, ఇకజరగవలసిన విషయమేమిటి, అందుకు స్త్రీలెంతవరకు పాలొని పాటుపడవలసి వుంటుంది?

ఇందుకు కట్టుదిట్టమైన నిర్మాణాన్ని వృద్ధిచేసే కార్యక్రమం ఒకటి ముఖ్యంగా కావాలి. పురుషులతో సమానంగా-ఒకవిధంగా అధికంగాకూడా-త్యాగం చేసి స్త్రీలు దేశీయోద్యమంలో పాల్గొని పాటుపడడానికి ఏవిధమైన ఆటంకమూ లేదు. అందుకు సంసిద్ధులైనవారు తప్పకుండా చేయవలసిందే. కాని, ఈవిధమైన, అంటే గత స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొనినట్లు త్యాగాన్ని చూపేందుకు ప్రతిస్త్రీకి వీలుపడదు. అట్టివారు ఇంటివద్దవుండే అఖండమైన మార్పు తీసుకొనిరావచ్చు.

ముఖ్యంగా పరిశ్రమలను పోషించడం. ఆంధ్రదేశంలో కొండపల్లి దువ్వెన్నల దగ్గరనుంచి అనేకవిధములైన వస్తువులు తయారు అవుతూవున్నాయి. మనకుకావలసిన వస్తువులను కొనుక్కునేటప్పుడు ఆంధ్రపరిశ్రమలది మొదటి పక్షంగాచూచి కొనుక్కోవడం - లేనినాడు స్వదేశీసామానులు కొనుక్కోవడం - ఒకనియమంగా పెట్టుకోవాలి.

ఇంట్లో బాలబాలికలకు రాష్ట్రప్రసక్తి, ఆంధ్రనాయకుల యొక్క ప్రత్యేక శక్తులు, ఆంధ్రభూమియొక్క ప్రత్యేక ప్రాభవం-మొదలైన ఆంధ్రోన్నత్యానికి దోహదమునిచ్చు విషయాలనే ఎప్పుడూ చెబుతూవుండాలి.

తోడిస్త్రీలలో యీవిషయమైన రాష్ట్రవాంఛను ప్రబోధించాలి.

ఉత్తర ప్రత్యుత్తరాలలో ఆంధ్రభాషకే ప్రాధాన్యం కల్పించాలి.

ఇవిపైకి అల్పవిషయాల్లా కనపడినా, నైతికంగా అఖండమైనమార్పు తీసుకొనిరాగలవు. దీనికి ఆంధ్రమహిళాలోకం ఎందుకు శ్రద్ధవహించకూడదూ?

# చారుదత్త

● శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మ

శూద్రక మహాకవిచే సంస్కృతమందు విరచితమై సారస్వతప్రపంచంలో ఆణిముత్యమువలె ప్రకాశించుచు విశ్వవిఖ్యాతి నొందినది - 'వసంతసేన, లేక మృచ్ఛకటిక'—

---

—అది నిశాసమయము - చీకటిముసుగులో అమరావతి పట్టణము ప్రశాంత రూపము దాల్చియున్నది - మన్మథోత్సవములో చారుదత్తుని గాంచి తన హృదయము నాతనికి దత్తమొనర్చిన వసంతసేన - నిజగృహంబునువీడి, పరిచారికలువెంటరా చారుదత్తుని గృహంబున కేతెంచుచున్న సమయమది—

—మార్గమధ్యమున విట, శకారులు వెంబడించినారు.

శకా :- నిలు - నిలు - వసంతసేనా! - నిలు.

గీ॥ ఏల పోయెదు? పఱుగిడి యేల చనెదు?
చంగు చంగున, దయనించు, చంపమాగు
నిప్పులోబడ్డ తోలునా నిప్పుడిదిగో
కాల్చుచున్నాడు కాయమ్ముఁ గాముఁడతివ!

విటు :- వసంతసేనా!

గీ॥ నాట్యమును నేర్పు మృదుచరణమ్ములదర
గాఢ భయచంచలములైన కనులతోడ
పాఱిపోయెదవేలనే - వ్యాఘ్రము వెను
తరుమగా వేగఁ బఱుగిడు హరిణివోలె.

శకా :- బావా! ఇదిగో వసంతసేన వెడలుచున్నది.

గీ॥ మనము వెనువెంట తరుమగాఁ జనెదు నదిగొ
కుక్కలు తరుమపో యాడునక్క వలెను
అతుల నూపురారవ పరిహాసయగుచుఁ
జక్కిలమువోలె నామది స్రుక్కఁజేసి.

విటు :- వసంతసేనా!

గీ॥ పతఁగ రాజేంద్రు భయమునఁ బాఱిపోవు
పాపపడఁతినా వేవేగఁ బఱచెదేల?
వడికిఁ బవనోపమేయుఁడఁ బట్టుకొనఁగ
లేడ నిన్నింతలో? శక్తిలేదె నాకు?

గణిక :-(కలయఁజూచి) పల్లవకా, పల్లవకా! పరభృతికా, పరభృతికా! మధురకా, మధురకా! శారికా, శారికా! అమ్మయ్యో! నా పరిజనము కనిపించుటలేదు. ఇప్పుడు నా శరీరమును నేనే రక్షించుకొనవలెను.

శకా :-తొత్తుకూతురా! విలపించు. విలపించు. పల్లవకనుగాని, పరభృతికనుగాని, శారికనుగాని, నిఖిలవసంతమునుగూర్చిగాని విలపింపుము. ఎవ్వఁడు కాపాడునో చూచెదను—

గీ॥ దుస్ససేనుండు సీతను దొంగిలించి
నటులనే జుత్తుఁబట్టి నిన్నిటహరింతు
యమపురేశుండు కృష్ణుఁడో? యముఁడో? కుంతి
కొడుకు జనమేజయుండో? దిక్కుగలదొక్కొ.

విటు :-వసంతసేనా! భయమెఱుఁగని నన్ను హృదయమున నిలుపుము. చూడు—

గీ॥ పాడు. శీలమ్ముచే రాత్రి పరిచితమ్ము
వెనుక నెఱుఁగుదుఁ జీకటి వీధులెల్ల
స్త్రీల సన్నిధి నీమాటఁ జెప్పనేల?
బాటఁ జావగా మిగిలిన భటులె సాక్షి.

గణిక :-అమితముగ సందేహించుచున్నాను. ఆత్మస్తుతి పరాయణు లకార్యము లొనరింపరా?

విటు :-కల్యాణీ! మమ్ము బ్రతిమాలుకొనడమను పగ్గములను పట్టుకొనుము. చూడు—

గీ॥ ఆశ్రయము వీడ జనియించు నాగ్రహమిఁక
నలుక నేమేమిచేయుము? అనునయులను,
స్త్రీలఁ గాపాడు - నా ఖడ్గ దీర్ఘకరము
బాల! నన్న నీమేనుఁ గాపాడుకొనుము.

గణిక :-అనునయమున్న - భయమునే కలిగించుచున్నది.

శకా :-వసంతసేనా! బావ బాగుగా పలికినాడు. బలవజ్జనదుర్లభానునయమంతదాక బహూకరింపఁబడును. చూడు—

గీ॥ నెమ్మి మెడవలె నల్లనై నిశితమైన
ఖడ్గమునఁ దలఁగొట్టి భోకార్తు నిన్ను
కోపమును మాకుఁ బుట్టించు కుజనుఁడకట!
తత్క్షణమె చచ్చు బ్రతుకడు తథ్యమరయ.

గణిక :-ఆర్య! కులపుత్రజనమునకు శీలపరితోషజీవినియగు గణికను కదా!

విటు :-కనుక నే ప్రార్థనము.

గణిక :-ఆర్య! నన్నేమి కోరుచున్నారు. శరీరమునా? అలంకారమునా?

విటు :-లత పువ్వులను విలుచుటకు తగినది కాదు. అలంకారము వలదు.

గణిక :-ఆత్మను కష్టపెట్టజాలను.

శకా:-వసంతసేనా! రాజకుమారుఁడను. కామింపఁదగినవాఁడను.

గణిక :-శాంతుఁడవైతివి.

శకా :-విను. బావా! విను. వసంతసేన నన్ను శ్రాంతుఁడవనుచున్నది.

విటు :-(తనలో) మూఢుఁడు నిందను తెలిసికొనలేకున్నాడు. విధ్వంసకుఁడవు అనిన శ్రాంతుఁడవు అన్నదను కొనుచున్నాడు. మఱియు—

గీ॥ అభినయించుచు మాటల నంగగముల
పలుకుచున్నాఁడు మతిలేని పలుకులెల్ల
విరసగతినాఁడు, మితిమీఱు పురుషమయద
దనరు పసరమ్ము నూత్నావతారమితఁడు.

(ప్రకా) వసంతసేనా! వేశ్యాజనవిరుద్ధముగ నాకడ ప్రవర్తించుచున్నావేమి? చూడు—

గీ॥ వెలసె మాకొఱకయి సానివీథులయిన
దారిబుట్టిన లతవంటి దానవీవు
ధనమునకు నమ్మ దేహమ్ము దాల్చినావు,
ప్రేమమై జరింపుము ప్రియా ప్రియులఁగూడి.

గణిక :-ఈ యభినివేశ మభిజనముచే తూచబడుచున్నది.

శకా:-బావా! ఈ వీథి గాఢాంధకారపూరితము. దీనినిప్పుడు పారిపోనీయరాదు. ఇది - ఆ మన్మథోత్సవము మొదలు నయనమాత్ర సంతుష్టుఁడును, దరిద్రసార్థవాహపుత్త్రుఁడును అగు చారుదత్తవటువును ప్రేమించినది. ఇదె వాని ఇంటి పెరటి గుమ్మము.

గణిక :-(సంతసించి, తనలో) ఇదె అతని గృహము! భాగ్యవశమున శత్రుజనవిరోధమునఁ బ్రియజన సామీప్యమునకుఁ దీసికొని రాబడితిని. అగును - ఇంతలో నిట్లొనరింతును. (వెడలును)

శకా :-(చూచి) బావా! పారిపోయినది—పారిపోయినది—

విటు :-ఎటుపోయినది? వెతుకుము. వెతుకుము—

శకా :-బావా! కనిపించుటలేదు.

విటు :-అయ్యో! వంచితులమైతిమి. వసంతసేనా! ఇప్పుడే దొరకెదవులే—

గీ॥ గాఢమగు సందెచీకటిఁ గానరావు
మేఘగర్భమ్ములోనున్న మెఱుపుపగిది
వాయువశమైన గంధంపు పరిమళమ్మ,
ముఖరితాభరణములు నిన్ మొనసి తెలుపు

(గణిక స్రగ్గాభరణములు తొలగించును)

---

శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారి ఆంధ్రీకృత చారుదత్తలోని ఒక సన్నివేశము.

దసరా ఉత్సవముల సందర్భమున విద్యుశ్ఛక్తి దీపములచే అలంకరింపబడిన
మైసూరు రాజప్రాసాదము



మైసూరు ఛాముండి పర్వతమునగల మహానంది



## శ్రీమతి బొడ్డుపల్లి బాలాత్రిపురసుందరమ్మగారు

గుంటూరునందు స్త్రీల నిమిత్తమై మహాలక్ష్మీ పఠనమందిరమును స్థాపించి స్త్రీల విద్యాభివృద్ధికై నిరంతరము పాటుబడుచున్న సేవావ్రత. తమ కొమారులకు కట్నములను గాని, తమకు వియ్యపురాలి లాంఛనములనుగాని స్వీకరింపక విద్యావంతులగు తమ కొమారులకు విద్యావతులైన కన్యలను దెచ్చి వివాహమొనర్చిన సంస్కరణ పరాయణ. నిరంతర ఖద్దరుధారి, దేశసేవిక, కవయిత్రి. ఈమెచే విరచితమైన పాటలు కొన్ని 'గృహలక్ష్మి'లో అప్పుడప్పుడు ప్రచురితమగుట పాఠకులు గమనించియుందురు.



పెనుగొండ భారత మహిళాసమాజమువారు, సమాజముయొక్క ప్రథమ వార్షికోత్సవమును జరిపారు. అధ్యక్షతవహించిన శ్రీమతి హట్టి పిల్లమ్మగారు మధ్యగా కూర్చుని వున్నారు.

# అంధలోకం



పవిత్రప్రణయమే వివాహ ధర్మంలోని పవిత్ర సూత్రం. అట్టి ప్రణయాన్ని అందచందాలుగాని, అంగసౌష్టవాలుగాని, అలంకారాలుగాని- ఆకర్షించలేవు.

పవిత్రప్రేమ పవిత్రహృదయంలోనే ప్రతిఫలిస్తుంది. ఇదే—

పట్టభద్రుడు ప్రభాకరుడి జీవితాశయానికి ఇతివృత్తం అయింది.

అనాధ శకుంతలకు అర్థంకాకపోయినా, ఆమెలో అనురాగ వాహిని పొంగిపొర్లింది.



"శకుంతలా! నీవింత దీనంగావున్నావేమి? ఈ కన్నీటి కెరటాలేమిటి?...నీవైఖరిచూస్తే రాత్రంతా నిద్రలేకవిలపిస్తున్నట్టుంది......మాట్లాడవూ? నీ మనస్సు బాధించేవిషయం అంతరంగిక మిత్రుడనైన నాతోచెప్పకూడదూ?" అంటూ ఆప్యాయంగా ఆమె తలనిమురుతూ, బుజ్జగిస్తూ సమీపంగాకూర్చున్నాడు ప్రభాకరరావు.

'నా'అన్నవారులేని విశాలప్రపంచంలో ఏకాకిగా జీవిస్తోంది శకుంతల.

ప్రభాకరరావు ఆడినమాటలవలన, బాధింపబడ్డ ఆమె మనస్సు కొంతవరకు ఉపశమించి ఊరటబడింది. క్షణంక్రిందట లోకం తనకు సర్వశూన్య మనుకొన్న శకుంతల తనకుకావలసిన సర్వస్వము ఉందనుకొని నిర్ధారణ చేసుకుంది. అందువల్లకలిగిన అపరిమితానందంతో మాటాడలేకపోయింది. "శకుంతలా! మాట్లాడవేమి? ఎల్లప్పుడూ నీ దృష్టిలోపానికి ఏడుస్తూకూర్చుంటే ఫలమేమైనావుందా? భగవంతుడేమిచేసినా మనమేలు కొరకేఅన్నారు అనుభవజ్ఞులు." అంటూ తనవుపన్యాసాన్ని మరికొంతవరకు సాగదీశాడు.

"ప్రభాకర్! నేనేమి పాపంచేసేనని భగవంతుడు నాకీశిక్ష విధించాడు? పదునైదుసంవత్సరాలవరకు ప్రకృతి రామణీయకంచూచి ఆనందించినకళ్లు ఇట్టేమాయమై గుడ్డిదాన్నయేనంటే కారణం ఏమని నిరూపించుకోవాలి? నాకడగండ్లుచూడలేక కాబోలు కనికాచిన తలిదండ్రులు చినప్పుడే కాలంచేశారు. పెంచిపెద్దచేసిన నాయమ్మ పట్టుమని పం్రడెండేండ్లు నిండకముందే పరమపదించింది." అని ముఖమును దిగ్రమింగుతూ జవాబు చెప్పింది. "ఊరడిల్లు శకుంతలా! ప్రతి జీవికీ కర్మకట్టికుడపందే విడవదు. బాధసహిస్తేనేగాని భక్తికుదరదు అన్నట్టు అడగమరచాను, నీకు ప్రాయంపైబడ్డా పెళ్లిమాట తలపెట్టవేం శకుంతలా?" అంటూ మందహాసంచేసేడు.

ప్రభాకరరావు నోటనుండి ఈ మాటలు ఊడిపడేసరికి కొంచెంఉపశమిస్తున్న శకుంతల దుఃఖం మళ్లీ ఉబికిఉప్పొంగింది. ఆమెవిడచిన వేడినిట్టూర్పు వాతావరణాన్ని చీల్చి ప్రభాకరరావు హృదయంవరకు ప్రాకితాకింది. ఆమె హృదయంలో ఎన్నోభావాలు రేకెత్తేయి, మస్తిష్కంలో లెక్కలేనన్ని తలంపులు మెరిశాయి.

"అయితే ప్రభాకర్! అంధురాల్ని ఎవరుపెండ్లాడుతారు? నన్నుచూడ్డానికే సహించని స్వార్థపరులు పుస్తికట్టడానికి పూనుకొంటారా? అథవా, కడితే వాళ్లకినలుగుర్లో నగుబాటు, తాహతుకు

తక్కువ కాదూ ? పోని ఇప్పుడు పెళ్లికై ఎవరు పెనుగులాడేరు ?" అంటూ లేనిధైర్యము తెచ్చుకొని జవాబు చెప్పింది.

'అదికాదు శకుంతలా ! నిన్ను పెళ్లాడ్డానికెవరైనా సమ్మతించి వచ్చారనుకో' అంటూ గొంతు సవరించుకొని పలికేడు—

'అటువంటిది తటస్థించదు. ఒకవేళసమకూడితే నే నిరాకరిస్తాను. ఎందుచేతనంటే ?........'

'ఎందుచేత ?'

'నేను వివాహితను కనుక' అని ధీమాగా సమాధానంచెప్పింది శకుంతల.

'శకుంతలా ! నీకు వివాహమైనదా? ఎప్పుడు? ఎక్కడ? ఎవరికి?' అతనికంఠము రుద్ధమైనది. హృదయకుహరములో తుపానుచెలరేగింది. అప్పుడే అప్రయత్నంగా వారిరువురిచేతులు కలుసుకొన్నాయి.

ప్రభాకరరావు పట్టభద్రుడు,సంఘసంస్కర్త. అతని నివాసస్థానం లక్ష్మీపురమే. అతనికి వేలువిడచిన మేనమామతప్ప 'నా' అన్నవారులేరు. పిత్రార్జితమైన భూవసతి, గృహముకలవు. ఉద్యోగమేదయినా కలసి వచ్చేవరకూ అనవసరపు భేషజముల కాటపట్టైన పట్టణాలలో ఊరకే ప్రొద్దుపుచ్చడానికి ఇష్టపడక తన స్వగ్రామానికి చక్కావచ్చేడు. శకుంతలా ప్రభాకరుల ఇండ్లురెండూ ఎదురుగుమ్మాలు. ప్రభాకరునిదయకు పాత్రమైహృదయాన్ని అయస్కాంతంవలె ఆకర్షించింది శకుంతల. సంఘంసానుకూలం కాకపోయినా, అమ్మ

★ శ్రీమతి అడపా సుగుణమణి ★

లక్కలాడిపోసినా, తోడివారు తొంగిచూడకపోయినా కూడా, తనమేనమామ కుప్పలుతిప్పలుగా ఉత్తరాలు వ్రాసినా, వారిపవిత్రప్రేమని అరికట్టలేకపోయినాయి. కాలక్రమేణ శకుంతలా ప్రభాకరులు భార్యాభర్తలైనారు.

వేళాకోళానికిపాలైన కొత్తకోడలు అత్తవారింట అడుగుపెట్టగానే ప్రభాకరుడికి రెవిన్యూయినస్పెక్టరు (Revenue Inspector) పదవి లభించింది. అంతవరకూ మీసముత్రిప్పుతున్న గ్రామమునసబు దాసోహం అన్నాడు. కండ్లెఱ్ఱజేసిన కరణం కాళ్లావేళ్లా తిరిగాడు. పరిహసించిన పౌరులు పడిగాపులు పడ్డారు.

ప్రభాకరరావు నివాసస్థానం పట్టణానికి మార్చుకొన్నాడు. కళ్యాణమై రెండేండ్లు గడచేయి. ఆదంపతుల ప్రేమాభివృద్ధి చిహ్నముగా ఒకకుమారుడు కలిగాడు. ఇంటవంటమనిషి సేవకులు, దాది ఉండడంచేత శకుంతలకు నేత్రలోపం కానరాకుండా కాలం గడచిపోతోంది.

ఒకరోజురాత్రి ప్రభాకరుడు కమానునుంచి తిరిగివచ్చేసరికి శకుంతల కంటతడిపెట్టడం కానిపించింది. కారణం ఏమని కలయవెదికి చూచాడు కాని కానరాలేదు.

'శకుంతలా ! నీవింకా దేనికొరకు విచారిస్తున్నావు? నీకు లోకములో నేను, చిన్నికుమారుడు క్షేమేకు ఉన్నాం. మాకు నీకండ్లలోపం ఏమాత్రం కడగండ్లు పెట్టలేదు. నీ వనవసరంగా మనస్సు నొప్పిచేసుకోవడం కూడదుసుమా' అంటూ ఓదార్చేడు ప్రభాకరుడు.

'ప్రపంచంనాకు ప్రబలాంధకారం. కట్టుకొన్నభర్తనీ, కడుపునగన్న కొడుకునీ చూడడానికి కళ్లులేని నిర్భాగ్యురాలను. నాకు నాకొడుకుని చూడాలని మనస్సు కొట్టుకొంటున్నది. మీ దివ్యమంగళ

విగ్రహాన్ని సందర్శించాలని మనస్సు తహ తహ పడుతున్నది....ఓ భగవంతుడా! నేనేంపాపము చేసేనని నాకళ్లు పాడుచేసేవు......?" అని విలపిస్తూ ప్రభాకరునితొడపైకి ఒరిగిపోయింది.

'శకుంతలా! నా బాల్యస్నేహితుడైన డాక్టరొకడు పాశ్చాత్యదేశాలు తిరిగి కండ్లజబ్బులు బాగు చేయడంలో ప్రావీణ్యంపొందేడు. అతడు రేపోమాపో ఈవూరికి రానున్నాడు. వచ్చినవెంటనే అతనితో ఈ విషయం ప్రస్తావించి అతనిసలహా తీసుకుందాం. మనఅదృష్టం బాగుండి భగవంతునికరుణ మనవరకూ ప్రసరిస్తే నీదృష్టిమాంద్యం మాయవచ్చు.' అంటూ ఆ సమీపములోనే ప్రాకుచున్న రమేశాన్ని చేతులతో పైకెత్తి 'అమ్మనిన్ను కళ్లతోచూడాలని కంగారుపడుతోందిరా. ఆ భాగ్యానికి నోచుకుంటావో, లేదో బాబూ!' అంటూ ఆప్యాయంగా ముద్దుపెట్టుకొన్నాడు కొడుకుని.

ఆరోజున శకుంతల కండ్లకి శస్త్రచికిత్స చేయడానికి సర్వమూ సమకూర్చబడినవి. నిర్ణీతకాలానికి డాక్టరువచ్చాడు. బాగోఓగో, ఏదో ఆ గుండుకొమ్ము లనుమానం ఆరోజున తేలిపోవాలని నిశ్చయించుకొని ఆపరేషన్ టేబు (Operation Table) లెక్కింది శకుంతల. ఆమె యిష్టదైవాలని పూజించింది. యిలవేల్పులకు మ్రొక్కింది. పెద్దలకి పేరంట్రాండ్రకి పసుపూ కుంకమూ చెల్లించింది. శస్త్రచికిత్స సమాప్తమైంది. 'ఆపరేషన్ (Operation) సవ్యంగా అయిపోయింది. ఆపైని భగవంతునిదయ, మీ అదృష్టం. నేటినుండి పదిహేనుదినములు కండ్లకుకట్టిన కట్టు విప్పకూడ'దంటూ డాక్టరు వెళ్లిపోయాడు.

రోగిని మంచంమీదనుండి లేవకుండా వలయుసౌకర్యాలు స్వయంగా ఏర్పాటుచేస్తూండేవాడు ప్రభాకరుడు.

'నా అదృష్టంబాగుండి మీ అర్ధాంగినైనాను. కాకుంటే నాపాట్లు కుక్కలకుకూడా లేకపోయి ఉండేవి. అయినా సేవకులుండగా మీరెందుకు శ్రమతీసుకుంటారండీ?" అంది శకుంతల సాభిప్రాయంగా.

'వెట్టిదానా ఆలిఅన అర్ధాంగి అని నీవెరుగుదువు. నా శరీరమునకై నే సేవచేసుకోకూడదూ. దానికూడా పరాయివాని సహాయంకావలెనా' అంటూ సమయోచితంగా జవాబుచెప్పేడు ప్రభాకరుడు.

'ఒకటీ......రెండూ......మూడూ......కాదు అబ్బా పదునైదుదినాలే ఎంతని ఓపిక పట్టనూ? రోజులుగడిచినట్లే కనబడవు. ఒక్కొక్కరోజు ఒకయుగంలాగ తోస్తోంది. ఈయిల్లు ఎల్లాంటిదో? ఈగది ఎట్లాగుంటుందో? రమేశు ఎవరిపోలికో...... ?"

*　　　　*　　　　*　　　　*

'అదిగో నాకుమారుని కిలకిలనవ్వు...రమేశ్...రమేశ్...రమేశ్' అని కండ్లకట్టువిప్పి పిచ్చిదానివలె లేచిపరుగెత్తి చిన్నకుమారుని ముద్దులాడి మూర్ఛపోయింది శకుంతల.

'శకుంతలా, శకుంతలా! ఒక్కరోజు తాళలేకపోయితివా? అయ్యో! కలకాలం గుడ్డిదానివలె పడియుండుమని నీ నుదుట భగవంతుడు వ్రాసిఉండెనా?" అంటూ శకుంతలనుచేరి శైత్యోపచారాలు చేయ మొదలుపెట్టాడు ప్రభాకరుడు.

'భయంలేదు. శస్త్రచికిత్సకి పదిరోజుల విరామమేచాలు. చావుకువేస్తే లంకణానికి తేలుతుందని నేను పదిహేనురోజులని నియమంపెట్టాను. కొత్తగా వెలుతుర్ని చూడడంచేత మూర్ఛపోయింది. అదిగో స్పృహకలుగుతుంది. మీయొద్ద భగవంతుడున్నాడు. మీ రనోన్యాన్యానురాగముతో లోకానికి ఆదర్శ దంపతులుగ జీవించం' డని డాక్టరు సరిగా ఆసమయమునకేవచ్చి ఆశీర్వదించాడు.

శకుంతలకి చైతన్యం కలిగినతరువాత డాక్టరుకి ప్రణామంచేసి, కొడుకునెత్తుకొని ముద్దులాడి, భర్తను సందర్శించి మందహాసంచేసింది.

# "అలా ఏడుస్తావేం... ఆడపిల్లలా?"

★ సరస్వతి ★

'అబ్బే, ఆడపిల్లలా అలా ఏడుస్తారా?' అని చటుక్కున అనేస్తారు, ఎవరైనా ఒకపిల్లవాడు ఏడుస్తూవుంటే. దీనిభావమేమిటో గాని యిది మనలోనేగాదు, తమిళులు మొదలైన దక్షిణాత్యులలోను, ఔత్తరాహుల లోను కూడా ప్రబలంగావుంది. పోనీ, మగవాళ్లుమాత్రమే ఆడవారిని చులకనచేసే నిమిత్తం అంటున్నారా అంటే, ఆడవారుగూడా యీమాట అనేస్తూవున్నప్పుడు, దీనిలో ఏదో విశిష్టత వుండితీరాలి—

అయితే, 'బాలానాం రోదనం బలం' అనే సామ్యంప్రకారంగా పిల్లలై నప్పుడు అందరూ ఏడుస్తారుగాని, ఆడపిల్లలుమాత్రం ఏడవడం, మగపిల్లలు ఏడవకపోవడమూ ఏమిటి? అంచేత 'ఆడపిల్లలా ఏడవడం'లో ఏదో ప్రత్యేకత వున్నదన్నమాట.

మనలో ముసలమ్మలు కొందరు, శిశువు పుట్టీపుట్టడంతో వారి ఏడుపును బట్టి ఆడపిల్లయినది, మగపిల్లవాడయినది చెప్పుతూవుంటారు. అందువల్ల వీరిఏడుపుకు ఒకప్రత్యేకత వుండటం తథ్యం.

కాకుంటే, పేరుమోసిన పెద్దకవీశ్వరులైన పెద్దన్న, తిమ్మన్న అంతటి వారే స్త్రీల రోదనవిశేషాలనుగురించి అధ్యాయాల కధ్యాయాలే వ్రాసి వున్నప్పుడు ఆడపిల్లల ఏడ్పులో అతిశయం లేకపోవడమేమిటి?

అంతవరకూ ఎందుకు, శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి నడిగితే యీ ఏడుపుయొక్క ప్రాశస్త్యం పూర్తిగా తెలుస్తుంది.

నిజానికి ఆడపిల్లల ఏడుపులో అందము, లాలిత్యము, అనేకవిధమైన కళ గోచరిస్తుంది. అదే మగపిల్లలలో అస్వభావికంగాను, మోటుగానూ వుంటుంది. అంచేత ప్రకృతిలోనే దీనిసూత్రం మరుగుపడివుందని తెలుస్తుంది.

ఇంకొకటి – యీ 'ఏడుపు' కూడా లలితకళల్లో ఒకఅంగముకూడా అయి వుంటుంది, ఏడుపులో ఎన్నెన్నో భావాలు వ్యంగ్యముగాను, స్పష్టముగాను స్ఫురిస్తూ వుంటాయి గనుక. ఆవేదన, వ్యథ, దుఃఖము, విరహము మొదలైన విశేషావస్థలు దీనిలోనివే గనుకాను.

అయితే ఇవన్నీ, విశేషించి ఆడపిల్లల ఏడ్పులో సహజంగా, మార్దవంగా స్పష్టీకరింపబడతాయి గనుక యీమాట వ్యావహారికమైపోయి వుంటుంది సర్వత్రా. అంతేకాని నేడు మనమనుకుంటూ వున్నట్టు, చులకనచేయు నిమిత్తంగాదని మాత్రం తెలుసుకోవాలి.

# ★ ★ ★ స్త్రీ విద్యార్థి సంఘాలెందుకు?

రెండుమూడు సంవత్సరాలు తీవ్రంగా పనిచేసి, విద్యార్థిసంఘాలు విద్యార్థుల్లో చైతన్యాన్ని తీసుకొచ్చినై. ఆందోళనావిధానం, ఉద్యమం మొదలైనవాటినిగురించి ప్రతీ సామాన్యవిద్యార్థికీ తెలిసింది. విద్యార్థుల కోర్కెలను సంపాదించటానికి జరిపిన వివిధ పోరాటాలవల్ల సంఘాలు మంచి బలాన్ని సంపాదించినాయి. దేశీయోద్యమానికి ఉపాంగాలని నిరూపించుకొన్నాయి. కాని స్త్రీ విద్యార్థులేరీ ఈ దృశ్యాల్లో? విద్యార్థిసంఘాలు తాము తీసుకొద్దామనుకున్న చైతన్యాన్ని, స్త్రీ విద్యార్థుల్లో తీసుకురాలేక పోయినై. స్త్రీ విద్యార్థుల సంపూర్ణ సహకారం లేకపోతే విద్యార్థి ఉద్యమం ముందుకు సాగలేదని వేరే చెప్పనవసరంలేదు.

విద్యార్థిసంఘాలు స్త్రీ విద్యార్థి ఉద్యమాన్ని ఎందుచేత తీసుకరాలేకపోయాయో పరిశీలించవద్దూ మరి! స్త్రీ విద్యార్థులీ రోజునకూడ, విద్యార్థులు చేసే ఆందోళన, సంఘాశయాలు, కార్యక్రమం తమకికూడ చెందినవేనని గుర్తించలేదు. వారి దైనందిన కృత్యాల్ని యంత్రాల్లాగ నెరవేరుస్తున్నారు. పాఠశాలకి వస్తారు; కాలేజీలకి వస్తారు, ప్రతీ రోజు, ప్రతి సంవత్సరమూను. చుట్టూ ఉండే విశాలప్రపంచంలో ఏం జరుగుతుందో వారికి తెలియటంలేదు. వారి విషయం ఒకే ఒక్క విషయంమీద కేంద్రీకరింపబడివుంది. అది వారి విద్యార్థి జీవితాశయం; పరీక్ష ప్యాసు కావటం. ఈ గ్రుడ్డితనానికి తోడు, మనదేశంలోని ప్రస్తుత విద్యావిధానంవారిని మరింత గ్రుడ్డిగా చేస్తోంది. ఉన్నతభావ సందర్శనానికి గాని, సాంఘిక, ఆర్థిక, రాజకీయ మనోదాస్యాలనుండి రక్షించుకోటానికిగాని ఉపకరించటంలేదు; మార్గాలు చూపించటంలేదు!

## స్త్రీ విద్యార్థుల ప్రత్యేక సమస్యలు

కొంచం శ్రమ తీసుకొని ఆలోచించి చూస్తే, స్త్రీ విద్యార్థులకి, పురుష విద్యార్థులకి ప్రస్తుత సమాజంలో ఉన్న స్థానం, వారి స్థితిగతుల్లో ఉన్న భేదం. ఈ విషయాల్ని అవగాహనచేసుకొని గుర్తించక పోవటం మూలాన్నే, విద్యార్థి సంఘాలు ఈ రోజువరకు స్త్రీ విద్యార్థులను ఉద్యమంలోనికి తీసుకురాలేక పోవటానికి కారణం అని వెంటనే తేలిపోతుంది. విద్యార్థులికి, స్త్రీ విద్యార్థులకి ఒక నిర్ణీతమైన సామరస్యపు హద్దు తప్పక వుంది. ఇది వప్పుకొని తీరాలి. కాని ప్రస్తుతం వారు స్నేహభావంతోటి, పరస్పర సానుభూతి సహాయాలతోటి మెలగుతూండడానికి, ఉద్యమంలో బాహాటంగా కలసి ముందుకు నడవటానికి, స్త్రీ విద్యార్థులను నిరోధించే ముఖ్యకారణాలు యివి.

ఈ రోజున విద్యార్థుల్లో కదులుతూన్న ఉజ్వలచైతన్యం స్త్రీ విద్యార్థుల్లో చాల కొంతపడివుంది. ఇంకా వారు ఉద్యమ ఆవశ్యకతని గుర్తించలేదు. విద్యార్థిసంఘాల్లో పురుష విద్యార్థులతోబాటు తమకుకూడ సమానకర్తవ్యం, బాధ్యత వుందని గుర్తించలేదు.

విద్యార్థిసంఘాలు, ముఖ్యంగా రాజకీయసంఘాలనే దురభిప్రాయం చాలవరకు వ్యాపించివుంది.

ఇవన్నీ అటుంచి, విద్యార్థిసంఘాల్లోనే కొన్ని లోపాలున్నాయి. మనదేశంలోని స్త్రీ పురుష విద్యార్థుల స్థితిగతుల్లో చాల భేదం ఉందని, వారికి ప్రత్యేక అవసరాలు. సమస్యలు ఉన్నాయని,

విద్యార్థి సంఘాలదృక్పథం రాజకీయం కాకపోయినా ప్రతి విద్యార్థినీ సాంఘిక, ఆర్థిక, రాజకీయ విషయాల్లో తనసేవారంగాన్ని సువిశాలం చేసుకొని, పాఠశాలల్లోను, పరిపాలనలోను, విద్యావిధానములోను వున్న లోపాలు సంస్కరింప బడడానికి తగిన ఆందోళన చేయవలసివుంటుంది. లోపాలు సవరింపబడితేనే గాని యువతీలోకం ఉన్నత విద్యకొరకు ఉత్సహించదు.

ఈ ప్రాథమిక సత్యం విద్యార్థి సంఘాల దృక్పథానికి దూరంకాకూడదు.

మాతృక :
మిస్ కనకదేశ గుప్త

అనువాదం :
ఆంధ్రరాష్ట్ర స్త్రీ విద్యార్థి సంఘం

★ ★ ★ ★ ★

విద్యార్థిసంఘాలు ఇంతవరకుకూడ గుర్తించలేకపోయాయి. తత్ఫలితంగా, వారి ప్రత్యేక సమస్యలకు ఇవ్వవలసిన ప్రాముఖ్యత, శ్రద్ధ ఇవ్వలేదు.

అందుచేత ఇప్పుడు చేయవలసిన పని యేమిటంటె, వారి ప్రత్యేక సమస్యలమీద, కష్టాలమీద చిన్న చిన్న ఉద్యమాల్ని లేవతీయాలి. ఈ ఉద్యమం తమదేనని, దాంట్లో వారికి సమానబాధ్యత వుందనీ, ప్రతి స్త్రీ విద్యార్థికి విపులంగా బోధించాలి. ఆమె చేయూతలేనిదే ఉద్యమం సాగదని మరీ మరీ స్పష్టీకరించి ఆమె ఉద్యమంలో చేరేటట్టు చేయాలి. అది ఆమె జాతిఅంతా కోరే వాంఛ, మాతృదేశపు పిలుపూను.

## స్త్రీ విద్యార్థులు ప్రత్యేక సంఘాలక్రింద ఏర్పడవలసిన ఆవశ్యకత

వీరి కనీసపు కోర్కెలమీద, కష్టాలమీద నెమ్మది నెమ్మదిగా ఆందోళనచేస్తూ ఉద్యమాన్ని సాగించాలి. ప్రారంభదశలోనే పెద్ద వివాదాల్ని, సమస్యల్ని పెట్టుకోటం చాల పొరపాటు. ఎప్పుడుకూడ వాస్తవికత్వానికి (Reality), వాతావరణానికి దూరంగా తొలగిపోకూడదు. విద్యార్థిసంఘాలు పోరాడే కోర్కెలకు ఈ క్రింది కోర్కెలు జతచేర్చి ఉద్యమం లేవదీయవలసివుంటుంది.

## విద్యార్థినుల ప్రత్యేక కోర్కెల

1. మనదేశంలో నూటికిద్దరుబాలికలు మాత్రమే విద్య నభ్యసిస్తూండడం చాల శోచనీయమైన విషయం. మిగిలిన స్త్రీజనానికి ఆఖరికి వారిపేరైనా వ్రాసుకోటం చేతకాదు. అందుచేత మన ముఖ్యకర్తవ్యం వారికి విద్య నభ్యసించే అవకాశాలు కలుగజేయటం. ప్రభుత్వాన్ని వెంటనే తగినన్ని విద్యాలయాలు, విద్యార్థివేతనాలు, ప్రాథమిక పాఠశాలలు ప్రతీ పెద్ద గ్రామంలోను స్థాపించేటట్టు ఒత్తిడిచేయాలి.

2. గ్రామాలనుండి దూరప్రదేశాల్నుండి వచ్చే విద్యార్థినులకు ఉండే గొప్ప విషమ సమస్య వసతి గృహాలనుగురించి. స్త్రీ విద్యార్థినులకు కొంచం సుఖవంతంగాను, గౌరవప్రదంగాను ఉండే వసతిగృహాలు కావాలి. ఇల్లాటివి మిక్కిలి తక్కువగా ఉన్నాయి. ఉన్న కొన్నికూడ, జైలుజీవితం కంటే నికృష్టంగా ఉంటున్నాయని తమ అనుభవాల్ని చెబుతున్నారు స్త్రీ విద్యార్థులు. పైగా ఈ వసతుల్ని విశ్వవిద్యాలయాధికారులు గుర్తించటం చాల అరుదు. ఉదాహరణకు, కలకత్తావంటి మహానగరంలో రికగ్నైజుచేయబడిన వసతి

గృహాలు రెండుమాత్రమే ఉన్నాయి. ఈవిధంగా విద్య నభ్యసిస్తూన్న కొద్దిమంది స్త్రీ విద్యార్థినులు చాల అసౌకర్యానికి లోనవుతున్నారు. అందుచేత మనం వెంటనే విద్యార్థినులకు తగినన్ని భోజన, వసతిగృహాల్ని ఏర్పరచి, వాటిని గుర్తించేటట్లు చేయాలి.

3. కొన్నికొన్నిచోట్ల విద్యాలయాలు ఒక్కొక్క జాతికొరకు స్థాపించబడివున్నాయి. ఒక్కొక్క కాలేజీలో, హిందువులకో మహమ్మదీయులకో తప్ప, మిగిలిన ఏ జాతివారికి చోటుండదు. అర్థంలేని ఇల్లాంటి విపక్షతలు, భేదాలు విద్యార్థిజీవితానికి, దేశాభ్యుదయానికి భంగకరం కాబట్టి విద్యాలయాలు జాతి, మత, తరగతి భేదంలేకుండా ఉండేటట్లు పాటుపడాలి.

## సాంఘిక వ్యవహారాలు

ప్రస్తుత సమాజపు మూఢాచారాలు, నిరంకుశపు ప్రాచీన కట్టుబాట్లు, స్త్రీ విద్యార్థులను ఎన్ని విధాల బాధించి కృంగదీస్తున్నాయో చెప్పలేము. బాలురకంటె బాలికల్ని ఎక్కువ ఘోరంగా బాధిస్తున్నాయీ కట్టుబాట్లు. స్త్రీ విద్యార్థులకు సమాజంలో గౌరవప్రదమైన స్థానమే లేదు. వారసత్వపు హక్కే లేనే లేదు. యువకులతోపాటు యువతులుకూడ సమానహక్కుల్ని, బాధ్యతల్ని పంచుకొనేటట్లు తీవ్రంగా అలజడి సాగించాలి.

విద్యాలయాధికారులు సమాజము, వీరి ఆరోగ్యసౌభాగ్యాలనుగురించి శ్రద్ధవహించ నవసరంలేదనుకుంటున్నారు. ఈ విషమ పరిస్థితుల్ని నశింపజేసి, బాలికల ఆయురారోగ్యాల్ని అభివృద్ధిపొందేందుకు అన్ని జాగ్రత్తలు తీసుకొనేటట్లు చెయ్యాలి మనం. ప్రతీ స్కూల్లోను, కాలేజీల్లోను మనకి ప్రత్యేక ఆటస్థలాలు తగినన్ని ఉండాలి. వ్యాయామశిక్షణ పొందేటందుకు, ఆరోగ్యం అభివృద్ధిపొందేటందుకు మనం ప్రతీ ప్రయత్నంచెయ్యాలి.

## ప్రాథమిక సంఘాలు స్థాపించాలి

ఈ పై కోర్కెలతో, స్త్రీ విద్యార్థుల్లో చిన్నచిన్న ఉద్యమాల్ని, ఆందోళనాన్ని లేవదీయాలి. అందుకోసం ప్రతీ విద్యాలయంలోను ప్రాథమిక సంఘాల్ని వెంటనే స్థాపించాలి. ఈ సంఘాలు విద్యార్థినుల కష్టాల్ని, కోర్కెల్ని బాహుళ్యంగా ప్రచారం అవటానికి, పఠనబృందాలు (Study Circle) వాగ్వాద సభలు (Debates) ఏర్పరుస్తూండాలి. ప్రసిద్ధ నాట్యప్రదర్శనాలు, నాటకాలు మొదలైనవి ఏర్పాటుచేసి తమ కార్యక్రమంతో స్త్రీలలో విద్యాప్రచారంకూడ సాగించాలి.

నిద్రపోతున్న స్త్రీ విద్యార్థుల్లో చైతన్యం కలగజేసి, తర్వాత విద్యార్థి ఉద్యమంలో వారి కర్తవ్యాన్ని నెరవేర్చేటట్టు చేయడమే ఈ సంఘాల ప్రధానాశయం.

ప్రస్తుతపరిస్థితుల్లో కొద్దిమంది బాలికలుమాత్రమే విద్యావతులై, కర్తవ్యాన్ని గుర్తించి, స్వాతంత్ర్య వాయువుల్ని పీల్చటానికి ప్రయత్నాలుచేస్తోంటే, వేలకొలది యువతుల్ని సత్యాగ్రహంచేసి, లాఠీదెబ్బలుతిని, జైళ్లకుపోవాలని అనకూడదు. న్యాయంకూడా కాదు. విద్యార్థిసంఘాలు నిజంగా తమకోసంకూడా పాటుపడుతున్నాయని తెలియజేయగలిగితే, వారి ప్రత్యేకసమస్యల్ని అందరూ కలిసి చర్చించుకోటానికి సావకాశం కల్గజేసినట్లైతే చాలు మన స్త్రీ విద్యార్థిసంఘాల ప్రధానాశయం సాధించామన్నమాటే! అప్పుడే ఉద్యమం ఎల్లా నడపాలో తెలుస్తుంది. సంఘంలోని స్వార్థపరుల నోళ్లు కట్టి యువకులతో సమానఅర్హతని పొందగలమని తెలుసుకుంటారు. అప్పుడే వేలకొద్దీ యువకులు ఉజ్జ్వలచైతన్యంతోటి ముందరికివచ్చి పనిచెయ్యగల్గుతారు.



# దేశసేవిక

శ్రీమతి మధురాపంతుల విజయలక్ష్మి



స్వాంతంబార్తజన ప్రమోద కరణాసక్తంబు; కృత్యంబులా
శాంతవ్యాప్త చలద్వ్యశోకలిత సద్ధ్యానంబు; లాస్యంబు శా
మ్యాంతర్భావ సమృద్ధసూచితల సద్భావంబులై యొప్పదో
కాంతా! శాంతయుతా! సువాగ్విభవయుక్తా! ధన్యనీవే సుమా!

'నాదేశంబిది, నాదుసోదరులె యన్నంబంచు బన్నంబులె
న్నోదిక్కింతలేక కుందుచయయ్యో! యున్నారు' నీవేటి క
మ్మా! దివ్యంబగు తావకీనసువచో మాధుర్య సంపత్తి స
ద్బోధంబున్ బచరించె మాకెటుగణింతున్ నిన్నుఁ జక్షుప్రదా?

స్వారాజ్యాప్త్యభిలాషఁ బూరుషులు విశ్వస్తుత్య మారీతిఁ దా
మారంభింపఁగ దేశసేవలను, దేశౌన్నత్య సంసిద్ధికై
నారీలోకముకూడఁ జాలునని సానందాత్మవై చాటఁ గాం
తారత్నంబ! ధరింతువెల్లపుడు. జేతన్ రంగుజెండానహో!

నీకుంగల్గెడి వస్తుజాలముల నన్నింటిన్ నాసన్ వీడి లోఁ
జీకాకింతయు లేక మాతృపద రాజీవార్చ నాలగ్నవై
లోకుల్ 'మేల'ని నీ మహోద్యమము నాలోకించుచున్ బల్క న
స్తోకామోదముతోడ నుందువు నమస్సుల్ నీకుఁ ద్యాగాస్పదా!

అమ్మా నాన్న యటన్న పల్కులకు ముందేగాదె నీపుత్ర ర
త్నమ్ముల్ నేరిచిమాటలందున్నను యత్నంబింతయున్ లేక యే
సమ్మోదమ్మిడఁ జాలునట్టివగు నా 'స్వారాజ్య సంసిద్ధి' 'భే
దమ్ముల్ వీడుట' లన్న వాక్కులవి సంతాపాభ్రఝంఝానిలా!

కన్నుల్ గల్గిన గ్రుడ్డిమానవులు లోకంబందు వేలాతిగా
నున్నారంచుఁ దలంచి, జ్ఞానమిడఁగా నూహించి, సాధించఁగా
నిన్నుం బంపఁగఁబోలు సదసన్నిర్ధారణా జ్ఞానభూ
తౌన్నత్యన్; సకలామరస్తుతమహత్పాదాబ్జయౌవాణియే!



# ★ చలనచిత్రకళా ప్రపంచం ★



## లలనారత్నములు

## చలన చిత్రములు

ప్రపంచమందెల్ల పరిశ్రమలలో నేడు సినిమా పరిశ్రమ అగ్రస్థానము వహించియున్నది. కేవలము ధనార్జనముకొఱకై ఏర్పడిన వ్యాపారసరణియే గాక కళాప్రధానమైనదగుటచే యీ పరిశ్రమ అధికజనాదరణమునకు పాత్రమైనది. అన్ని దేశములందువలెనే ఆంధ్రదేశమునందుగూడ నిది అన్నిమూలల నల్లుకొనుచున్నది. అనేకులగు స్త్రీ పురుషుల కిది జీవిక నొసంగుచున్నది. అసంఖ్యాకులగు స్త్రీలును, పురుషులును దీనిలో ప్రవేశించి ఈ కళ నారాధించుచున్నారు. అందులో ముఖ్యముగా స్త్రీలెంతవరకు సినిమాలయందు నటింపదగునను విషయమును జర్చించుటే యీ వ్యాసోద్దేశము.

సినిమాలలో స్త్రీ లభినయించుటనుగూర్చి ఇదివరకే పలువురు చర్చించియున్నారు. కొందరు అభినయము, నాట్యము అనాదినుండియు వేశ్యలసొమ్మనియు, ఏ కారణముననో అవి మాయమైపోగా పడుపువృత్తియే వారికి మిగిలినదనియు, నేడు సినిమాలు వెడలుటనుబట్టి వారందఱు వానిలో నటింప దొరకొన్నచో నిప్పటి హేయమగు దుస్థితి తొలగిపోయి సంఘము కొంతవరకు బాగుపడుననియు వ్రాసియున్నారు. మఱి కొందఱు స్త్రీలు స్త్రీ పాత్రలును, పురుషులు పురుషపాత్రలును నటింపబూనుకొన్నచో సంఘమున అవినీతి మఱింత హెచ్చగుననియు, భారతదేశపరిస్థితుల కది తగదనియు వ్రాసియున్నారు. ప్రఖ్యాతనటకులును, విమర్శకులును అగు శ్రీ బళ్లారి రాఘవాచారిగారు వాహిని సినిమా సంచికలో 'కథ ఏ సాంఘికపరిస్థితులకు సంబంధించియుండునో, కవియు, నటకులును నా సంఘమువారై యుండిననేగాని సహజములును, నిర్దుష్టములును నగు ఉత్తమచిత్రములు తయారుగా'వని వ్రాసియున్నారు. అనగా 'రైతుబిడ్డ' యను చిత్రము తయారు

జాతీయజీవనమునకు ప్రతిబింబమై, అంతర్జాతీయ ప్రఖ్యాతిని, ప్రాముఖ్యతను పొందవలసిన యీ చలనచిత్రకళా పరిశ్రమ మన దేశమున సంకుచితమై అవినీతి కాకరమై యుండుట, భారతదేశ కళాప్రాభవమునకు తీరని మచ్చ —

జాతీయోన్నతికి దీనిని సమగ్రముగ నుపయోగించుకొనుటకై జాతి మత వివక్షతలేక సర్వులు దీని నారాధించి చలనచిత్రకళయొక్క కార్యక్షేత్రమును సువిశాలమొనర్చుకొనుటకు 'కులస్త్రీలు' కూడ యిందు పాల్గొనవలయునను భావము ప్రబలమై యున్నది.—

కాని ఇట్టి 'సంస్కారము' ముందుగా పరిశ్రమయందును, దాని నారాధించు వ్యక్తులయందును అవశ్యకము గాని - కళలోను కులస్త్రీలలోను మాత్రము కాదు.

★

—— శ్రీమతి ——

కె. నిర్మలాదేవి

★

కావలయునన్న, కవియు, నటకులునుగూడ రైతులై యుండవలయునని వారి తలంపు. అట్లే వేశ్యలనుగూర్చిన కథలలో వేశ్యలును, సాంసారిక చిత్రములయందు సాంసారిక స్త్రీలును నటింపవలయునే గాని లేకున్న చిత్రము సహజముగా నుండదని వారి యభిప్రాయము. ఇందువలన ఆచార్యులుగారు సంఘములో గల ఎల్ల తరగతులవారును నటింపవచ్చునని ఒక స్వేచ్ఛాపత్రము దయచేసినవారైరి. వీరి యాశయమెంతవర కనుసరణీయమో యవశ్యము చర్చింపవలసి యున్నది.

ఈ యభిప్రాయము ప్రకారము స్త్రీల జీవితమున సినిమాలు నేడు పెద్ద మార్పొకటి తెచ్చిపెట్టుచున్నవి. ఈ మార్పు నేటి స్త్రీలకు శ్రేయోదాయకమా లేక హానికరమా అను విషయముకూడ మన మాలోచింపవలయును సాంఘికపరిస్థితులు నానాటికి సంస్కారము నొందుచున్నవి. ప్రాచీనులు నిర్మించిన కొలతబద్దలతో నేటి పరిస్థితులను కొలిచి యిది మంచి, అది చెడ్డయని చెప్పుటకు వీలుగాకున్నది. పూర్వ మవినీతికరములుగా నిషేధింపబడిన కార్యము లిప్పుడు నిరభ్యంతరములుగా జేయబడుచున్నవి. 'సామాన్య దృష్టిలో అవినీతి అనే అజ్ఞానానికి కళాలోకంలో తావులేదు' (ముత్యాలశాల) ఇది వెంపటివారి కళాసూత్రము, కళ పేరట ఎన్ని దురాగతములు జేసినను తప్పులేదని వారి సిద్ధాంతము. సినిమా రంగము నానాటికి ఆర్థిక, సాంఘిక, రాజకీయ విషయములలో విశాలమైపోవుచున్నది. దానిలోని ధనార్జనోపాధులు, దానిలోని స్వేచ్ఛాజీవనము సాంసారిక స్త్రీలకుగూడ వ్యామోహము గల్పించుచున్నవి. దినదినము ఎందఱో కుటుంబస్త్రీలు సంసారములవదలి రంగమున బ్రవేశించి ఉజ్వలతారలగుచున్నారు. ఉన్నతకుటుంబములకు జెందినవారుగూడ అనేకు లీవెట్టి వ్యామోహమునకు దాస్యము జేయుచున్నారు. సినిమాలపేరట నెంతయో కాలుష్యతము సంఘమున పేరుకొనుచున్నది. వెంపటివారు జెప్పిన కళ యను కృతకాంబరముతో దానిని సంస్కర్తలు, విద్యావంతులు కప్పిపుచ్చుచున్నారు. పూర్వుల యభిప్రాయములేవియును ఇప్పటి కళాభిజ్ఞులకు రుచించుట లేదు. పూర్వులాక్షణికులు దూరాహ్వాన, వధా, యుద్ధ, భోజన, శయ్యావిహారాదుల నాటకరంగమున కెక్కింపరాదని నిషేధించిరి. కాని నేటి రంగము మారినట్లే, ఆ సూత్రములును మారినవి. ఇప్పుడు రంగముపై ముఖ్యముగా చూపబడునవివియే.

పరపురుషస్పర్శ, ఆలింగన,చుంబనాదులు సాంసారిక స్త్రీలకు కూడనివి. ఆచారమునుబట్టి వేశ్యలు చేసినను తప్పుగా నెంచబడనివి.

నటీ జీవితమున నివి తప్పించుకోరానివిగూడను. ఏలన, చిత్రమున నటించు వ్యక్తులు భార్యాభర్తలే యుండు టరుదు అదియునుగాక వారి సమ్మేళనముతోడనే కథ పూర్తిగాదు. కథలో యితర సంఘట్టనము లనేకము లుండును. వానిలో నాయిక అనేకములైన ఇతర కథాపాత్రములతో కలిసిమెలిసి తిరుగవలసియుండును. సామాన్యజీవితమునందుకంటె విలక్షణపరిస్థితులను కల్పించుకొననిదే కథా వస్తువు ఆకర్షకముగా నుండదు. అట్టిచో సంసారస్త్రీలకు ఇతర కథావ్యక్తులతో గలుగు సన్నివేశములుగూడ సామాన్యజీవితమందునకంటె విలక్షణముగానే యుండును. యీ విలక్షణత్వము సంసారస్త్రీల గృహజీవనమునకు మిక్కిలి హానికరము. నాయకుడు భర్తయైనప్పుడే ఇన్నిచిక్కులు గలుగుచుండ ఇతరవ్యక్తులవిషయమున వేఱుగా జెప్పనవసరములేదు.

బొంబాయిటాకీసువారి 'జీవనప్రభాత్' నందును, 'నిర్మల' లోను గృహజీవనము ప్రదర్శించు పట్టున స్త్రీ వ్యక్తులును పురుష వ్యక్తులును ఎట్లు సంచరింపవలయునో చక్కగా ప్రదర్శింపబడినది. జీవన ప్రభాత్‌లో శయ్యాగృహరహస్యములను ప్రదర్శించు పట్టునగూడ కథాపాత్రములను ఎడమెడముగా శయ్యపై నాసీనులనుజేసి హాస్యకరములగు సంభాషణములతోడనే డైరెక్టరు రసపోషణము చక్కగా గావింపగల్గినాడు. మన 'వందేమాతరం' డైరెక్టరుగారికి నాయిక నమాంతముగా నాయకుడు లాగి పైని బడవేసికొనునంతవరకు చూపించినగాని తృప్తిగలుగలేదు. ఇట్టి యసభ్యదృశ్యమును గల్పించుటకు నాయిక సంసార స్త్రీ యైనచో రెట్టి యవస్థలపాలౌనో వేఱుగా జెప్పబనియుండదు. 'నిర్మల'లో గృహస్థజీవనము జూపు పట్టున నాయకు డ్వాలువిచ్చెను చేతులతో బట్టుకొనియుండ నాయిక దానిని ఉండగా జుట్టుచున్నట్లు చూపియున్నాడు. ఈ ఘట్టము మిక్కిలి సున్నితముగాను, కళాసమన్వితముగాను, ఆకర్షకముగాను నున్నది. కాని వందేమాతరం లోని గృహజీవనము 'ఇది సానికొంపా, సంసారికొంపా?' అని అందులో అత్తగారడిగిన ప్రశ్నలో మొదటి భాగమునకే సమాధానముగా నున్నది ఇట్టి విపరీత జీవితమును ప్రదర్శించుటకే ఏర్పడిన సినిమాలయందు సంసార స్త్రీలు నటించుటేమాత్రమును తగదు.

'సామాన్యజీవితమునగూడ గాజులవాడు, వైద్యుడు మున్నగువారిచే తాకబడినను స్త్రీ తన పాతి వ్రత్యమును నిలుపుకొనుచున్నది కాదా! అట్లే సినిమాలలోగూడ ఇతరులు తాకినను, పట్టుకొన్నను యామె తన జీవితమును నిష్కలంకముగానే నిర్వహింపవచ్చు'నని ఈ సందర్భమున నెవరేని ఆకాంక్షింపవచ్చును. కాని సామాన్యజీవితమున అట్టివి జీవిత ధర్మసాధనమునకు ఏర్పడిన నిర్ణయములు. శరీరధారణమునకు, సుమంగళీ జీవితమునకు అవి లేకున్న జరుగదు. వానిని సంఘము, శాస్త్రము ఆమోదించి విధులుగా జేసినవి. అవి యవి నీతిని ప్రబలజేయుటలేదు? అట్టివి జీవితమున కదాచిత్కముగా సంభవించుచుండును. సినిమా జీవితమందన్ననో వానికంటె విపరీతములగు సంఘట్టనములు, మన శ్చాంచల్యమును ప్రేరేపించునట్టి శృంగార చర్యలు, డైరెక్టర్లు తమ బుద్ధిబలమునంతయు వినియోగించి, ఆలోచించి, కల్పించి వానిలో తారలను జొనిపి జంత్రపుబొమ్మల నాడించినట్లు ఆడించుచున్నారు. దీనివలన స్త్రీలయందు సహజ సౌకుమార్యము, స్త్రీత్వము, కలికితనము నాశనమై పోవుచున్నవి. ఇట్టి జీవితము నిజముగా స్త్రీ లెవ్వరికి సమ్మతముగాదని డైరెక్టర్లకు తెలియును.



అందువలన వారు వేలకొలది రూప్యములను జీతములుగా నిచ్చి యాశగొల్పి తారలకొఱకు వలల నొడ్డు చున్నారు. నూతనోత్తేజమనియు, స్వేచ్ఛాజీవనమనియు, సంఘసంస్కారమనియు, దేశస్వాతంత్ర్యమనియు, పెద్దపెద్ద పేరులుబెట్టి ఆత్మలాభాభిమానులై కేవలము ధనాశాపరులై జాతిసంప్రదాయమును గుర్తింపక, ఆచారమును ఆదర్శగుణమును మరచి ఇష్టమువచ్చినట్లు చిత్రములుదీసి జాత్యౌన్నత్యమును మంటగలుపుచున్నారు.

క్రొత్తయొకవింత, పాతయొకరోత యన్నట్లు క్రొత్తగా గనిపించుచున్న యీ స్వేచ్ఛా జీవనమునకు వ్యామోహమునొంది, సంసారస్త్రీలును, కులీనలగుయువతులును రోజురోజును మందలుమందలుగా సినిమా రంగమున జేరుచున్నారు. దరిద్రభారతదేశమున జన్మించుటే చేసినపాపమై పేదరికము ననుభవించు మానవతు లెందఱో దరిద్రబాధ భరింపలేక డైరక్టరులిచ్చు జీతమునాశించి యందుబ్రవేసించి వారిసౌశీల్యమును గోల్పోవు చున్నారు. ఇట్టిజీవితము సంసారస్త్రీలకు తగదు. సంసారస్త్రీలు సినిమాలో నటించుటతగదు. సినిమాలపైని యభిమానము తలకెక్కుటచే మగలతో విడాకులనొంది రంగములకెక్కిన కాంతలవిషయములుగూడ మనకు గోచరించకపోలేదు. ఇప్పటికి నటనటీవర్గమునందుజేరి ప్రఖ్యాతివహించినవారల శీలగుణాదులను మనము నిత్యము పత్రికలలో చదువుచునేయున్నాము. తారలప్రసిద్ధి వహించిన హాలీవుడ్డునటీమణులు, తమశీలమును క్షీణసంతలో వేలము వేయుటచేతనే లక్షలాదిగా జీతము లార్జించుచు నటీనక్షత్రమండలము నలంకరించుచున్నారు. దానినే యొరవడిగా నుంచుకొని ఆంధ్రతారలుగూడ జాతీయత, ఔన్నత్యమును, ఘనతనుమరచి డైరెక్టర్ల చేతులలోని కీలుబొమ్మలై తమజాతికంతటికి నైచ్యమాపాదించుచున్నారు.

ఇట్టివ్యభిచార భావములను ప్రదర్శింపవలసిన వారగుటచేతనే వారిసంసర్గము సంఘమున దోషమునకు మూలమని యెంచి నటనటీ వర్గమును శాస్త్రము పఙ్క్తిబాహ్యముగానిషేధించియున్నది కావున సకాలమునందే ఈయరిష్టప్రవాహము నరికట్టుటకు ఆంధ్రమహిళా సమాజము ప్రబలమగుప్రయత్నము జేయవలయును, సినిమా రంగములు పూర్తిగా సంస్కరింపవలయును లేకున్న జాతికి తీరనిచేటు వాటిల్లును, ఆంధ్ర స్త్రీల యౌన్నత్య మింకను అడుగంటును నేడు సినిమారంగములందవినీతిప్రభుత్వము వహించియున్నది. దానికిస్వలాభము నాసించెడి డైరెక్టర్లేకారణము వారుతీయు కథలట్టివి, వారుకల్పించు రంగములట్టివి. వారుప్రోత్సాహముజేయు ప్రయత్నములట్టివి. ఒకానొకఫిలుము డైరెక్టరు, ‘ వ్యభిచారమన్న నేమియుతప్పులేదనియు, అన్యపురుషసంపర్కమన్నచో స్త్రీలు భయపడవలసిన పనిలేదనియు, అట్లుభయపడుట సంఘములో దౌర్బల్యము నధికము జేయుటనియు, అవినీతియను దానికొకకొలత బద్ధలేదనియు, ఒకజాతికి అవినీతిగాతోచునది మఱొకజాతికి మిక్కిలి నీతియుక్తముగా దోచుచుండు ’ ననియు, నుపన్యసించుచుండ నేనుస్వయముగా వినియున్నాను. ఆయనఇప్పుడు గూడ మనరాసులో ఒకపెద్దఫిల్ముకంపెనీకి డైరెక్టరు, ఫిలుములుగూడ తీయుచున్నాడు. నేటిడైరెక్టర్ల యభిప్రాయములట్టివి. నిజముగావారిస్టూడియోలలోని జీవితమంతయునట్టిదే. ఇట్టి నికృష్టజీవితముపై సంసారస్త్రీలే మాత్రము సానుభూతిజూపతగదు. ఈ వేఱుపుర్వు ఆంధ్రమహిళా జాతీయ వృక్షమును సమూలముగా కొరికివేయకమునుపే ఆంధ్ర స్త్రీలు మేల్కొనవలెను. అవినీతితో వఱ్ఱోడుచున్న ఈసినిమా జీవితప్రవాహమున ఇంకను కొందఱు స్త్రీలు కొట్టుకొని పోకమునుపే దానినరికట్టుటకు తగుప్రయత్నములు జేయుచుండుట ఎంతయు ఆవశ్యకము.

# కుమారి టంగుటూరి

# సూర్యకుమారి

**ఉత్తమకుల కన్య ● నృత్య గానకళా పిపాస ● ఆదర్శ భావపూరిత**

(చిత్రలేఖ)

సంపన్నకుటుంబీకులు, సాంప్రదాయప్రసిద్ధులు అయిన శ్రీ టంగుటూరివారి వంశంలో జన్మించిందీ కుమారి. సుప్రసిద్ధ ఆంధ్రనాయకులు ఆంధ్రకేసరి శ్రీ టంగుటూరి ప్రకాశంపతులుగారి తమ్ముళ్లు శ్రీ టంగుటూరి శ్రీరాములుగారి మూడవకుమార్తె ఈమె. రాజమండ్రిలో శ్రీరాములుగారు వకీలుగా పనిచేస్తూవున్న రోజులవి. ప్రకాశంపంతులుగారి స్వరాజ్య పత్రికకు ఉత్తేజకరములైన వ్యాసములను వ్రాస్తూ, వీలైనప్పుడల్లా జాతీయోద్యమాలలో పాల్గొంటూ శక్తివంచన లేక శ్రీరాములుగారు పాటుపడుతూవున్న దినములవి. నలువైపులా జాతీయవాంఛ ప్రాకుతూ పొంగిపొరలుతున్న 1925 సంవత్సరం అక్టోబరు నెలలో జన్మించింది సూర్యకుమారి.



కుమారి టంగుటూరి సూర్యకుమారి

చిన్నప్పటినుంచి జాతీయ భావపూరితమైన వాతావరణంలో పెరుగుచు, జాతీయగీతములు పాడుతూ, ఉన్నతాదర్శముల నలవరచుకొన్నది. పాటలన్నా, పద్యములన్నా అత్యధికమైన ఆశ. ఎప్పుడును ఏదో ఒకటి పాడుతూవుండే ఆసక్తి. అన్నగారైన రామమోహన్‌తో కలిసి గ్రామఫోన్ పాటలు వచ్చీరాని మాటలతో పాడుతూవున్న నాటి పసితనపు పలుకులు, పాటలు వినేవారిని ఆహ్లాదపరవశులను చేసేవి. అన్నా తానూ పోటీలువేసుకొని పాడిన పాటలకు ఆల్‌కాట్ తోటలోని గున్నమామిడి చెట్లమీది చిన్న కోవెలలు శ్రుతి మేళవించి హెచ్చరికతో గొంతెత్తిపాడి, సూర్యకుమారి భావికీర్తికి రేఖలు దిద్దుతూ ఆలాపించేవి.

బడిలో నాటకములు వేయునప్పుడు సూర్యకుమారి పాటలు వినడానికి ప్రత్యేకంగా కుతూహల పడేవారు. నాటకాల్లో కృష్ణుడు, నారదుడు మొదలైన పాత్రలను ధరించి మృదుమధురంగా పాటలు పాడడమే గాక, హావభావపూరితంగా అభినయించేదికూడ.

సుమారు నాలుగుసంవత్సరముల క్రితం సూర్యకుమారి పాటవిని శ్రీ గోపాలకృష్ణ ఫిలిమ్సువారు తీయడానికి ఉద్యమించిన 'విప్రనారాయణ' అనే తమిళచిత్రంలో పూజారి కుమార్తె పాత్రకు యీమెను నియోగించారు. అదే యీమె మొట్టమొదటగా సినిమాప్రపంచంలో పాల్గొనడమైనప్పటికి, అన్యప్రాంతానికి చెందిన పరభాష అయినప్పటికి ఆ పాత్ర నతి సహజంగా నటించి తమిళదేశములో ప్రజామన్ననల పొందింది. దానితో 'అదృష్టము' (Luck) అనే తమిళ చిత్రంలోకూడా ప్రధాన భూమికను నిర్వహించి తన కీర్తిని సువిశాలం చేసుకొన్నది——



చి॥ సూర్యకుమారి అన్న రామమోహన్‌తో——(చిన్నతనమున)

తరువాత సూర్యకుమారి యొక్క దివ్యగానామృతము ఆంధ్రభూమిలోకూడా వెల్లివిరిసింది. శ్రీ గూడవల్లి రామబ్రహ్మంగారి కోరిక మీద సారథి ఫిలిమ్సువారి 'రైతుబిడ్డ'లో రైతు సర్వి రెడ్డి కుమార్తెగా నటించి ఆంధ్రమహాశయుల ప్రత్యేకాభిమానాన్ని సంపాదించుకుంది. దానిలో యీమె పాడిన 'రాబోకు రాబోకు చందురూడా' 'హృదయము - పొంగెగా' అనే పాటలు, ప్రత్యేకంగా యీమెచే పాడబడిన 'కాంగ్రెసుజెండా' 'పావన హిందూ మాత' మొదలైన జాతీయగీతాలు ఆంధ్రభూమిలో అమితమైన ప్రచారాన్ని పొందాయి——

కుమారి సూర్యకుమారి సినీమాలలో ప్రవేశించుట ధనాశచేగాదు - సంగీతమునందు, నాట్యము నందు ఆమెకు వున్న విశేషాదరాభిమానములే ఆమెను ఆకర్షింపజేసినవి.—

ఐనను గౌరవము, ప్రతిష్ట, మంచినడత మొదలైనవి ప్రధానముగ నెంచు ఈమె కలకత్తా, బొంబాయి మొదలగు పట్టణములనుండి అనేకమైన ఆహ్వానములు వచ్చినను వారివారియొక్క నడవడి మొదలైనవి పూర్తిగ తెలియనందున యీమె ఆ ఆహ్వానాలను మన్నించలేదు. వయస్సున పిన్న అయినా సుగుణములలో మిన్న అయిన సూర్యకుమారి అభిప్రాయములు ఆదర్శమైనవి.—

అన్నవస్త్రములకు లోపములేని సంపన్నకుటుంబములో జన్మించి, కళారాధనకే పాటుపడుతూ వున్న సూర్యకుమారి గౌరవప్రతిష్టలు అభినందింపదగినవి.

కిన్నెరలు మ్రోగే గాత్రమూ, మృదుమధురమైన ఒదుగు, హృదయతంత్రుల నాలాపింపజేసే పాట, ఆదర్శపూరితమైన భావాలుగల సూర్యకుమారి తనకు ఒక వినిర్మలమైన భవిష్యత్తును నిర్మించుకొనడమే గాక, ఆంధ్రప్రసక్తికి, ఆంధ్ర వనితాలోకానికి కీర్తినిగూర్చే ఒక ఆధునిక యువతీరత్నమౌతుందని ఆశించడంలో అతిశయోక్తిలేదు.

- ప్రతి సంవత్సరమూ భారతదేశంలో తయారవుతూవున్న చిత్రాల క్రింద 1,20,00,000 అడుగుల ముడి ఫిల్ము ఖర్చు అవుతూవుంది.
- భారతదేశాన్నించి ఇంగ్లండు అమెరికా దేశాలకు ఫిల్ముల సంబంధంగా సగటున 60 లక్షల రూపాయిలు ప్రతి సంవత్సరమూ పంపబడుతున్నాయి.—
- బాలబాలికలకు విద్యను గరపడానికి ఉపయోగించే విద్యావిషయ ప్రబోధకరమైన చిన్నచిన్న చిత్రాలు, ఒక్క అమెరికాలో 2,500 వున్నాయి.
- అమెరికాలో అన్ని శాఖల్లోను పనిచేసేవారిలో స్త్రీలకంటె పురుషులే ఎక్కువ. కాని సినిమాలలోమాత్రం పురుషులకంటె స్త్రీలు నూటికి 8 మంది ఎక్కువగా వున్నారు.
- అంతర్జాతీయ విఖ్యాతినందిన గ్రేటాగార్బో అనే పాశ్చాత్య నటీమణి యీ పరిశ్రమలో సంపాదించినంత ధనం మరి ఏ తార ఇంతవరకు సంపాదించలేదు.

జాతీయ విజ్ఞానవికాసములకు క్రీడారంగమైన చలనచిత్ర, రంగమును కులస్త్రీలు బహిష్కరించకూడదు—

కాని, కులస్త్రీలు పాల్గొనడానికిపూర్వము దానిని సంస్కరించవలసి వుంది. అందుకు వనితామణులు టెక్నీషియన్లుగా వుండడం చాలా అవసరం.



# సినిమాలు – స్త్రీ టెక్నీషియన్లు



—— శ్రీమతి ——
జి. కళ్యాణి



చలనచిత్ర పరిశ్రమ ప్రస్తుతము ప్రపంచ ప్రధానపరిశ్రమలలో ఒకటిగా ఎంచబడుతోంది. వేలకువేలు ప్రజలు యీ పరిశ్రమనే ఆధారంగా చేసుకుని జీవిస్తూవున్నారు. ఈ పరిశ్రమకు సంబంధించిన చిత్రముల ప్రకటనలలో స్త్రీల పేర్లే విరివిగా ప్రచారం పొందుతూవుంటాయి. అంచేత స్త్రీలీ పరిశ్రమలో విశేష స్థానంపొంది, దీన్ని పోషిస్తున్నారనుకుంటాము. కాని నిజం పరికిస్తే ఇది అంతా వట్టి భ్రమ అని తేలిపోతుంది. ప్రకటనలలోను. తదితరములలోను కనపడేవారు కేవలము కథాసందర్భములో పాత్రధారిణులుగా వున్నవారే కాని ఫిలిమును తయారుజేసే సాంకేతికశాస్త్ర ప్రవీణుల్లోమాత్రం కాదు. ఈ లోపం ఎక్కడుంది? చిత్రాల్లో నటించి పెట్టుబడిదార్లకు లక్షలకొద్ది ధనాన్ని సంపాదించిపెడుతూన్న స్త్రీలకి యీ టెక్నికల్ విషయాలలో ప్రవేశం ఎందుకుండ కూడదు?

అయితే, స్త్రీలుకూడా లేకపోలేదు. బొంబాయిటాకీసువారి సంగీతదర్శకురాలు సరస్వతీదేవి అనే విద్యాధిక. మద్రాసు సౌండు సిటి ఫిలిం కంపెనీ నిర్మాతలైన ఎ. నారాయణగారి సతీమణిగూడా శబ్దగ్రాహిణిగా పనిచేస్తూవుండేది. ఇక విఖ్యాత ఆంధ్రతార శ్రీమతి కన్నాంబకూడా రాబోయే వారి 'మాతృప్రేమ' అనే చిత్రానికి దర్శకత్వంలోకూడా పాలు తీసుకుంటుందని వింటున్నాము. ఇంతే - దీనికిమించిన వారు స్త్రీలలో కనపడరు.

పాశ్చాత్య చలనచిత్ర పరిశ్రమలో స్త్రీలు అమితంగా పాల్గొని, యీ కళయొక్క ఔన్నత్యానికి పాటుబడుతున్నారు. డైరెక్టరు సహాయార్థం 'కంటిన్యూయిటి గరల్సు'గా పనిచేస్తున్నారు. చిత్రంయొక్క ముందువెనుకల సమన్వయం యీ కంటిన్యుయిటీ మీదనే ఆధారపడివుంటుంది. దుస్తులలోను, స్థలనిర్దేశములోను, ముఖభావాలను ఆయా పాత్రలకుండవలసిన పరిస్థితులలో వారి 'నుంచుటలోను వీరు సహాయపడి

చిత్రంలో ఎగుడు దిగుడులు రాకుండా కథాసందర్భాల్లో అన్వయం కుదిరేలా చూస్తూవుంటారు. ఇదే కాక, అన్ని విధములైన టెక్నికల్ విషయాల్లోనుకూడా వీరు విశేష శ్రద్ధ చూపుతూవుంటారు.

అలాగే మనదేశంలోకూడా ఉత్సాహవంతులగు స్త్రీలు ఛాయాగ్రహణంలోను, శబ్దగ్రహణం లోను, శిల్పంలోను, మేకప్‌లోను తరిఫీదునొంది పనిచేస్తే ఈ పరిశ్రమ ప్రస్తుతము ఉన్నస్థితికంటె ఎక్కువ ఔన్నత్యమునకు రావడానికి వీలుంటుంది.

స్త్రీలకు మేకప్ చేయవలెనంటే స్త్రీలే వుండాలి. స్త్రీలకంటె ఎక్కువ అందముగా మేకప్ చేయగలరా తదితరులు? స్త్రీలు వేషాన్ని ధరించివున్నప్పుడు వారికి స్త్రీలే సహాయులుగా వుంటే చాలా మంచిది. మేకప్‌లో స్త్రీలు వున్నారంటే సంసార స్త్రీలుకూడా ఫిలింలో కొన్నికొన్ని పాత్రలను ధరించ డానికి అవకాశాలుంటాయి.

నేటి చిత్రాలు కొన్నిటిలో అన్నచెల్లెలు, తండ్రికూతుళ్లు - ఎవరికితగిన గౌరవము వారికివ్వక అనవసరముగా ఒకరినొకరు ఆలింగనము చేసుకొనడం మొదలైనవి ఎన్నెన్నో చూపిస్తున్నారు. ఇటువంటి చోట్ల స్త్రీలను కేవలము నీచపరచడమే గాక, నీతియుతమైన కథాసందర్భాన్ని పాడుచేయడము, స్వాభావిక తకు దూరమైపోవడమూ, అసభ్యంగా తయారవడమూ జరుగుతున్నాయి.

స్త్రీజాతికి మన చిత్రాల్లో జరుగుతూవున్న అన్యాయం మరెక్కడా వుండదు. దేశవిఖ్యాతిపొందిన ప్రభాత్ కంపెనీ, బాంబే టాకీసు, న్యూ థియేటర్సు మొదలైనవారి చిత్రాలలో స్త్రీలకు తగిన గౌరవం ఇస్తున్నారు. సంసారవిషయములు చూపించునప్పుడు ఒకరినొకరు ముట్టుకొనకుండానే అన్నిరసములు చూపిస్తున్నారు. ఈపాటి గౌరవమర్యాదలు మన ఫిలిముల్లో కరువైపోయాయి. ఈ మాలిన్యం పోవాలంటే యీ పరిశ్రమకు సంబంధించినవారిలో కొంత ఉన్నతభావాలు ఉదయించి మార్పు రావాలి—

తరువాత స్త్రీలు టెక్నికల్ శాఖలలో పనిచేయాలి. అప్పుడుగాని యీ అన్యాయం పోదు—

ఇదేగాకుండా, స్త్రీలు ఆయా పర్యవేక్షణలలో వుంటే, గృహములను చూపించు సందర్భాలలో, దినచర్యలను చూపించు సందర్భాలలో పరికరములను వస్తువులను సమకూర్చడం మొదలైన విషయములు అతి స్వభావసిద్ధముగా చూపించబడతాయి—

దర్శకత్వము, ఛాయాచిత్ర శబ్ద గ్రహణములు, ఎడిటింగు మొదలైన టెక్నికల్ విషయములలో స్త్రీలు ప్రవేశించి పనిచేసిన చిత్రములలో అస్వభావికత చాలవరకు తగ్గిపోతుంది. ఓర్పు, సహనము, పట్టుదల, విషయ విమర్శనము మొదలైన గుణములకు స్త్రీలు ఆటపట్టు. ముఖ్యంగా చిత్రం విజయవంతం కావాలంటే ఇటువంటి గుణములు టెక్నీషెయిన్సుకు వుంటేనేగాని వీలుపడదు.

ముఖ్యంగా స్త్రీలు దర్శకులుగాను, సాంకేతిక పర్యవేక్షకులుగాను వుంటే నేడు యీ పరిశ్రమలో జరుగుచున్న అవినీతి పూర్తిగా తొలగిపోతుంది.

నేడు సంసారస్త్రీలుకూడా యీ పరిశ్రమలో విశేషంగా పాల్గొనాలి అనే విషయం బాగా ప్రబలంగావుంది. వీరు చేరడానికి ఏలాటి అభ్యంతరమూలేదు కాని ముందుగా యీ పరిశ్రమలో ప్రస్తుతం ప్రబలంగావున్న అవినీతి తొలగిపోవాలి. దానికి సాంకేతికశాఖలో స్త్రీలు విశేషంగా వుండాలి. అప్పుడు గాని సంసారస్త్రీలకు యివి ప్రవేశార్హం౦గాదు. కనుక యీ విషయంలో స్త్రీలుకొంచెం శ్రద్ధబూనితే చలన చిత్రకళా పరిశ్రమ ఇంకా వృద్ధిపొంది, దానియొక్క ఉపయోగం మనం విరివిగా పొందగలుగుతాము.




ప్రొద్దస్తమానము బయట తిరుగుటవల్ల మిక్కిలేతనైన ముఖచర్మము, గాలి, దుమ్ము, ఎండలకు వాడి పోవును. మీ చర్మము మీకు తెలియకనే మొద్దుబారియుండుటయు, కళాహీనముగాను, వికారంగాను ఉండుటను చూడడముతోనే మీకు దిగులు కలుగును.

సుందరమైన చర్మము స్త్రీకి మెప్పును, ప్రీతియు తెచ్చును. అతి శుభ్రముగాను, పూలమృదుత్వము పొందియున్న ముఖచర్మమును ఎంతచూచినను తక్కువయే.

స్త్రీయొక్క చర్మమునకు జాగ్రత్త అవసరము. అందులో వట్టి కడుగుటతో చాలదు. పాండ్స్ క్రీమ్ రంధ్రములలోనుండు మురికిని, నూనె విశేషమును తీసి అతి శుభ్రముగా నుంచును.

పాండ్స్ క్రీమ్ సీసాను కొనుడు. మీ వేళ్ళ చివరలతో క్రీమును మీ చర్మముమీద రాయుడు. మృదువైన గుడ్డతో దులుపుడు. మరియు కొద్దిగా వేరే క్రీమును తేలికగా పూసి, రాత్రంతయు నాజ్యమైన పొరను ఉంచుడు. ఈ మోస్తరుగా ఒక పదిహేనురోజులు రాత్రులయందు వాడుడు. అప్పుడు మీ చర్మము మృదువుగా లేతగా అవుతున్నట్టు మీకు తెలియగలదు.

పగలు, గాలి దుమ్మునుండి రక్షించుటలో శ్రేష్ఠమైనది 'పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్.'




పాండ్స్ క్రీములు అన్ని గొప్పస్టోర్సులో దొరకును. లేక పాండ్స్ పి||బ|| బాక్సు 144 బొంబాయి వారికి వ్రాయుడు.

# పాండ్స్ క్రీమ్



# ★ మొగలాయీ కళ
# రేఖాలేఖన పతకం ★

ప్రేమతో మా కమలకు,

నేను సకాలంలో ఉత్తరాలు వ్రాయడంలేదని నీకు నామీదకోపం వచ్చేవుంటుంది. కాని ఏం చేయమంటావు? నా జీవితము ఒకపత్రికా సంపాదకుని జీవితమువలె అయిపోయింది.

ఎప్పుడూఅనుకోలేదు నేను: ఈమధ్య ఉష ఉత్తరం వ్రాస్తుందని. ఉష ఈమధ్య డిల్లీవెళ్లిందట. అక్కడవున్న మొగలాయీ చక్రవర్తుల నాటివికొన్ని చిత్రాలను చూచి, ఆనందించి ఆరసాస్వాదంలో నాకువ్రాసింది. 'మొగలాయీ ప్రభువులు భారతీయకళకు ఎంత సేవచేశారు......మానవులెరుగని దేవుళ్లకోసరం ప్రాకులాడే మనకళను మానవసేవకోసరం భూమిమీదకు దించేరు....తెలిసియో, తెలియకో ఎంత మహోత్కృష్టమైన కార్యాన్ని చేశారు యీ ప్రభువులు!'

నేను సంతోషించవలసిన విషయం ఒకటి, నాస్నేహితుల పేదహృదయాలన్నీ...నాతోపాటు కళకోసరం ఆర్చిపోతూవుంటవి. కాని భారతీయ కళాప్రాబల్యము వీరందరకూ అర్థం అయ్యిందా అని నాగుండె కొట్టుకుపోతూ ఉంటుంది.

భారతీయకళ నా అభిప్రాయములో, బౌద్ధమహాయుగంలో, బౌద్ధబిక్షుల యోగదృష్టి సహాయంతో అజంతాగుహల కుడ్యాలంకార రూపంలో, ఉన్నతోన్నతమైన స్థానాన్ని ఆక్రమించింది. రూపాన్ని రేఖలలో ప్రతిబింబించే ధ్వనికి (Suggestion) ప్రాధాన్యాన్ని ఇస్తూ, నిర్ణయాన్ని ముద్రలమూలాన...అనాదినుండీ అనుకరింపబడుతూ ఉన్న శిల్పసూత్రాల సహాయాన్ని...తెలియజేస్తూ...ఉత్తమ ఆదర్శాలకోసరం ప్రాకులాడేవారు ఆనాడు భారతీయ శిల్పులు. ఆ భారతీయాదర్శము మొగలుల చేతులలో ఏమైంది? మహాప్రభువు జహంగీరు చక్రవర్తి చేతులలో ఈకళ వింతైనమార్పులను పొందింది. వస్తువనుకరణంకోసరం...చక్రవర్తి భోగలాలసను తృప్తిపరుచడానికోసరం...రంగురంగులతో...రంగుల నీడలతో (Shade and Perspective) ప్రాకులాడింది. అనాదిసిద్ధమైన శిల్పసూత్రాలు యోగముద్రలు...మాయమైపోయినవి. ప్రబంధకవిత్వము లాగు భావము క్రుంగిపోయింది—భాషాకారిన్యాన్ని భరించలేక. ఆనాటినుండే మనకు రేఖాలేఖనము (Linear drawing) కరవైపోయింది. రంగురంగుల అలంకరణాలతో మునిగితేలే ఈ చిత్రాలలో.

మొగలాయీ ప్రభువుల చేసింది సేవే అంటావా? నా అభిప్రాయంలో కాదని. ఏనాడు మనకళ, మన ఆదర్శాలకు...మన సూత్రాకు (Conventions) మన ముద్రలకు 'దూరమైపోయిందో...ఏనాడు ఉత్కృష్టమైన రేఖా లేఖనపు స్థలమును నిర్జీవ ప్రాపంచిక (Realistic) చిత్రము దొంగిలించుకున్నదో...ఆనాడే మనసత్యమైన పతనము ఆరంభమయ్యింది. దానికి పునాదివేసింది ఎవ్వరు? అది 'మహోత్కృష్టమైన' కార్యమా? బాగా ఆలోచించు! తెలిసియో తెలియకో ఉష అలావ్రాసింది; దానికి పంద్రెండు పేజీల సమాధానం వ్రాసి పంపేను. తీరికవున్నప్పుడు అదిఅంతావ్రాసి పంపుతాను. ఈ ఉత్తరం వ్రాయడానికి ఇంత ఆలస్యమైనందుకు క్షమిస్తావా?

ఇట్లు నీ '**మణి**'.



# ఒకరికి సనాతనమా?

# ఒకరికి సంస్కారమా?

నీలాకాశంలో విహరించడానికి పక్షి ఒక్క రెక్కతో పైకి ఎగరలేదు .. రెండు రెక్కలూ వుండి తీరాలి.

'సంఘం' అనే 'పక్షి'కి స్త్రీ పురుషులు ఇద్దరూ రెండు పక్షాలు. ఇరువురిలోను సంస్కార భావం సమానంగా సాగుచేయబడితేనే గాని, సంఘం శాంతి సౌఖ్య నీలాకాశంలో విహరించలేదు!

స్త్రీయే దీనికి ముందంజవేస్తే పురుషుడుమాత్రం...?



రిటైర్డు డిస్ట్రిక్టుజడ్జీ నరసింహశాస్త్రిల్లవారు యిప్పుడు మద్రాసులో ఉంటున్నారు. శాస్త్రిలగారికి ఒక్క కొడుకు, ఒక్క కూతురు. కొడుకుపేరు వేణు. కొమార్తెపేరు పుష్ప. భార్య చిన్నప్పుడే మరణించినందున శాస్త్రిలవారు బిడ్డలను అతి గారాబముగా పెంచాడు. వేణు కిప్పుడు 20 సంవత్సరములు. బి.ఏ. సీనియరు చదువుతున్నాడు. వేణుకు పుష్పకు రెండేడ్లు తేడా. పుష్ప స్కూలుఫయినల్ ప్యాసై ఇంటరులో ప్రవేశించింది. చిన్నప్పటినుంచీ పుష్ప అంటే మిక్కిలి ప్రేమ వేణుకు. అన్నంతిన్నా, బడికిపోయినా, చదువుకొన్నా అంతాయిద్దరు ఒకమాటే చెయ్యాలి. తల్లిలేని బిడ్డలని తండ్రిగూడా వారికేకొఅతలేకుండా చూస్తూ వారి ఐకమత్యమునకు చాలా సంతోషపడుతూండేవాడు. కాని ఒక్కచోట చిక్కుగా ఉండేది. తండ్రి కొంచము సనాతనుడు. ఈ కొంచమే కొంపలుతీసేది. పిల్లలిద్దరికి చాలా అడ్వాన్సుడ్ వ్యూస్.

వేణుకు ఇంటరులో కలిశాడు ప్రసాద్. అప్పటినుంచి ఎంచేతో ఇద్దరూ చాలా స్నేహంగా ఉండేవారు. ప్రసాద్ ఎప్పుడూ తమ యింటికి రావడం, అందరూకలసి సినిమాలకు, బీచిలకు తిరగడం శాస్త్రుల వారికి ఏమాత్రము గిట్టదు. ప్రసాదు రావడం చూచాడంటే మరి విరుచకపడతాడు యింట్లో హిట్లరులాగ. ఒకటిరెండుసార్లు ప్రయత్నించాడు రావద్దని ప్రసాద్‌తో చెప్దామా అని, కాని ఎందువల్లో మానేసాడు.

ప్రసాద్ ఫస్టుక్లాసులో ప్యాసయ్యాడు. Bar-at-law కోర్సుకు పోవాలెనని ప్రసాద్ తీర్మానించుకున్నాడు. వేణుకు గ్రూప్‌లో పోయింది. పుష్పదేముంది, ఆమె జూనియరునుండి సీనియరుకు మారింది.

● శ్రీమతి కె. సీతాదేవి ●

ఆ సాయంకాలం వాకిట్లో టాక్సి ( Taxi ) వచ్చి నిలచిఉంది. ఈ మూర్తిత్రయం వంచినముఖా లెత్తకుండా ఆలాగె వెళ్లి తిన్నగా కారులోబడ్డారు. కారు బయలుదేరింది.

ఎట్లో సెంట్రలుచేరారు. ఫస్టుబెల్ అయింది. పెట్టెలోకెక్కాడు ప్రసాద్. ఆతనిజూచి ఒక్కమాటు భోరున ఏడువసాగింది పుష్ప. తనకంటి వెంబడి ప్రవహించుచున్న కన్నీటికాల్వల సంగతి తెలియక పుష్పను ఓదార్చబోయ్యాడు వేణు. ప్రసాద్ దుఃఖము మరి చెప్ప నలవికాదు. ఆతనికండ్లు నిప్పులవలె ఉన్నాయి. ఇదంతాచూస్తే ఒకరినివిడిచిఒకరు బ్రతుకగలరా అనిపిస్తుంది. ఇంతలో బండి కూత వేసింది. దగ్గరకుబోయి ప్రసాదుకు ఏదో చెప్పబోయింది పుష్ప కాని, బండి కదిలింది మరి ఉంటుందా!

ఉత్తర ప్రత్యుత్తరాలు విధివిరామములేకుండా జరుగుతూనే ఉన్నాయి లండను మద్రాసులమధ్య. తానక్కడ చూచుచున్న చిత్ర విచిత్రాలనంతా పూసగ్రుచ్చినట్లు ప్రతిజాబులో వ్రాస్తున్నాడు ప్రసాద్. ప్రసాద్‌వద్దనుండి జాబువచ్చిందంటే ఆదినమొక పండుగ వేణు పుష్పలకు. వేణులేనప్పుడు ఆ ఉత్తరాన్నే తిరిగి తిరిగీ చదువుకొని ఏదో సంతోషించేది పుష్ప.

తిరిగి ఎండకాలపు శలవులు వచ్చాయి. ఈ సంవత్సరంతో చదువులు పూర్తిఅవుతాయి వేణు పుష్పలకు. వేణు యం.ఏ., పుష్ప బి.ఏ. ఒకనెలదినములనుండి శాస్త్రిలవారు ఏదో కొంచము హడావిడిగా ఉన్నాడు. ఒకరోజు మధ్యాన్నము భోజనమైన తదుపరి పడకకుర్చీలో పడుకొని 'అబ్బాయి' అని పిలిచాడు శాస్త్రిలవారు వేణును. 'వస్తున్నానునాన్నా'అంటూ వేణు తండ్రివద్దకు వచ్చాడు. '......ఏం లేదు......పుష్పకిప్పుడు 20 సంవత్సరముల వయసైయింది. ఏదో పదిమందీ ఒప్పుకోకపోయినా వివాహం చెయ్యకుండా చదువులో దింపాను. బి.ఏ., గూడా పూర్తిఅయింది. యింక త్వరలో ఆనాలుగు తలంబరాలు గూడా పడితే బాగుంటుందేమో అని ఆలోచిస్తున్నాను" అన్నాడు శాస్త్రిలవారు.

వేణు:-అవును నాన్న, నా అభిప్రాయంగూడా అదే. త్వరలో చేయడమే బాగుంటుంది. ఏదో ముగ్గురమూకలసి ఆలోచిద్దాం. పుష్పను పిలువనా? పుష్ప అభిప్రాయముగూడా కనుక్కుంటే బాగుంటుంది అన్నాడు. 'ఏమిటి దాని అభిప్రాయం కనుక్కునేది? నేచెప్పేది వినుముందు. మన సుబ్బరామయ్యను చూచావుగా నీవు? వాండ్లకు ఇప్పుడు రెండుమూడులక్షల రూపాయలకుంది ఆస్థి. వాడు చాలాయోగ్యుడు. వాడికి స్తే బాగుంటుంది? అని అభిప్రాయపడుతున్నాను. ఏమంటావు.'

......'సరే ఏదో ఆలోచిద్దాంలే నాన్నా' అంటూ వెళ్లిపోయాడు వేణు.

* * *

పెండ్లిపనులేమో జరుగుతున్నాయి. తాను చెప్పినప్రకారమే జరిగితీరాలంటాడు తండ్రి. ఇది జీవితానికి సంభంధించిన విషయం, కాబట్టి నీవు పూర్తిగా ఆలోచించుకొని నీ అభిప్రాయం నాకు తెలియ చేశావంటే నా ప్రాణమైనా అర్పించి నీయిష్టం ప్రకారమే జరిగేటట్టు చూస్తాను అంటాడు అన్న వేణు. తనకా ప్రసాద్‌మీదుంది మనసు. మరి ప్రసాద్‌మనసో, ఏమో ఏలాఉంటుందో! తీరాచూస్తే అతడేమంటాడో? ఒప్పుకుంటాడనే దానికి ఘట్టి తార్కాణం ఏమీలేదు. ఆతనికి వ్రాయడానికా అసహ్యంగా ఉంటుంది. అతడొచ్చేవరకు ఆపుదామంటే దానికిగూడా ఒప్పుకోడు తండ్రి. మాట యిచ్చాను ఆ ముహుర్తానికే జరిగి తీరాలంటాడు. తానీ సంబంధానికి ఒప్పుకోనుఅంటే, వేణు తనవైపే ఉంటాడు కాని పరిస్థితులేలా మారు

కాదా! వేణుకు దమ్మిడీ ఖర్చు లేకుండా ఆస్తిగూడా యివ్వడు తండ్రి. తన నిమిత్తమై అతని జీవితము పాడవదా? అవును. అవుతుంది. అది ముమ్మాటికి నిశ్చయము. తన స్వార్థంకోసం వేణు జీవితాన్ని పాడుచేయడమా? కాదు. అట్లెన్నటికి జరుగదు. అది అధర్మము. తానేమైనాసరే—

తన కోర్కె పూర్తి అవడంతోటే అమెరికాకుపోయి అచ్చటినుండి రావలెననుకొన్నాడు ప్రసాద్. ఆ ప్రకారమే తన ఉత్తరాల్లోగూడా వ్రాశాడు వేణు పుష్పలకు. కాని ఏంచేతో మానుకొని నేరుగా ఇండియాకే బయల్దేరాడు. మద్రాసులో జరిగే గొడవలేమీ అతనికి తెలియవు.

మద్రాసులో దిగీదిగడంతోడనే బయల్దేరాడు నేరుగా శాస్త్రిలవారి యింటికి. కారు సరిగ్గా వారి వాకిటముందర నిలిచింది. అలా యింటివైపు చూచాడు ప్రసాద్. ఆ పచ్చతోరణాలు, ఆ మంగళవాయిద్యాలు, ఆ హడావిడి అంతాచూచి బహుశా అది శాస్త్రిలవారి యిల్లుకాదేమో అనుకున్నాడు. కాని పరికిస్తే అదేయిల్లు. ఏమిటో దిగి చూద్దామని కారుదిగి లోపలికెళ్లాడు. ఇంకేముంది. తన కెదురుగా అగుపడుతూంది పుష్ప పెండ్లిపీటలమీద. కాళ్లు ఆగాయి. అలాగే నిలుచున్నాడు కొయ్యబొమ్మలాగు. శరీర మంతా ముచ్చెమ్మటలుకమ్మాయి. దేహమంతా ఒడకసాగింది. నోటమాట రావడంలేదు. కండ్లవెంబడి ఒకటి రెండు వేడికన్నీటిబొట్లురాలినై. అంతా హడావిడిగాఉంది. ఎవరిపనుల్లోవారున్నారు. ఈతనిస్థితి ఎవ్వరూ గమనించలేదు. కాని హఠాత్తుగా పుష్ప చూచింది. చూచిజూడడంతోటే 'ప్రసాద్' అని కేకవేసింది. లేవబోయింది గూడా. ప్రసాదును చూచిన సంతోషంలో ఆమె ఎక్కడున్నదిగూడా మరచిపోయింది. అందరు ఆశ్చర్యపోయారు. సుబ్బరామయ్య వెనుకకు తిరిగిచూచాడు. గ్రహించాడు సంగతి. వెంటనేలేచి ఒక్కవిసురులో పొయ్యాడు, 'నాకీపెండ్లి అక్కరలే'దంటూ.

ఏదో పనివుండి లోపలికెళ్లాడు వేణు. జరిగిన గడబిడ అతనికి ఏమీ తెలియదు. కాని వెంటనే ఈ కలకలారావము విని పరుగెత్తుకువచ్చాడు. చూచాడు పరిస్థితి. అతడు నిర్ఘాంతపొయ్యాడు. అంతా అగమ్య గోచరంగాఉంది. పుష్ప ఇంకా పీటలమీద అలాగేఉంది. ఎదురుగా కొంచము దూరములో నిశ్చేష్టుడై నిలబడిఉన్నాడు ప్రసాద్. పెండ్లికొమారుని ఎటులైనా బ్రతిమాలి తేబోయిన పెండ్లిపెద్దలతో గూడా తిరిగివచ్చాడు తండ్రి నిరాశుడై. అతడు ససేమిరాఅంటే ససేమిరాఅన్నాడు.

మరి యిప్పుడు కర్తవ్యమేమిటి? ఏం జరగాలి? పుష్ప ఏమౌతుంది? తండ్రివైపు చూచాడు వేణు 'నాన్నా' అన్నాడు. తండ్రి పలుకలేదు. మంగళవాయిద్యములు గూడా ఆగిపోయాయి. అంతా నిశ్శబ్దంగాఉంది. యోచించి యోచించి 'ప్రసాద్ స్నానంచేసివచ్చి పీటమీదకూర్చో' అన్నాడు అతి ధైర్యంగా వేణు. ఈమాట అందరినీ స్థంభీభూతులను జేసింది. శాస్త్రిలవారు అక్కడచేరిన నలుగురి సిద్ధాంతులవైపు చూశారు. వారంతా గుడ్లెఱ్ఱజేసి—

'ఈ ఘోరకృత్యానికి సంఘం ఎంతమాత్రం ఒప్పుకోదు' అన్నారు ఏకగ్రీవంగా.

'ఏం' అన్నాడు వేణు.

'ఏం అంటే? అంతే! అలాఉన్నాయి ధర్మసూత్రాలు.—'

'మరి పెండ్లి అవలేదుగా!'

'అవసరంలేదు. పీటలమీద కూర్చున్నారుగా, అదిచాలు. తిరిగి వివాహమునకు పిల్లవాడికి హక్కున్నది గాని పిల్లకెంతమాత్రములేదు.'

'ఏంచేత?'

'ఏంచేతంటావేమిటి? అంతే. నీకేంతెలుసు? అలా చెప్పిఉంది మన గ్రంథాల్లో. ఎవరైనా వాటికి కట్టుబడాల్సిందే. లేకపోతే సంఘం వారిని బహిష్కరిస్తుంది.'

తొక్కత్రొక్కిన తాచులాగైంది వేణు స్థితి. కోపం పట్టలేకపోయాడు. 'మీరంతా' అని ఏదో ప్రారంభించబోయాడు. ఇంతలో తండ్రి అడ్డమువచ్చాడు. కాని ఆతడు లక్ష్యముచేయలే. తన ధోరణి తాను సాగించాడు. 'మీరంతా నే చెప్పబోయ్యే విషయం దయచేసి కొంచము సావకాశంగా వినాలని నా ప్రార్థన. ఈ రోజు ఇచ్చట జరిగిన పరిస్థితి అంతా మీకందరికి తెలిసియేవుంది. ఇప్పుడు నేజెప్పే నాలుగుముక్కలు గూడా విని ఏది న్యాయమో ఏది అన్యాయమో మీరే నిర్ణయించండి. అసలు ఈ సంబంధం నాకుగాని పుష్పకుగాని ఏమాత్రం ఇష్టంలేదు. ఇది మా తండ్రిగారు, మా మేనత్తగారు చేసిన కుట్ర. నా చెల్లియం దేదోషమూ లేదు. ఆమె పరమసాధ్వియని చెప్పుటకు నేను గర్విస్తున్నాను. ఆమె ప్రేమించిన వ్యక్తి ప్రసాద్. కాని కత్తులబోనులో పెట్టి నొక్కాడు మా తండ్రి. దాని ఫలితమే యిది. మూడు సంవత్సరముల నాడు మద్రాసు వదలి లండన్‌కు పోయిన ప్రసాద్, అందులో తాను మనసార ప్రేమించిన ప్రసాద్, అనుకోకుండా అకస్మాత్తుగా పైనుండి ఊడినట్లు ఎదుట అగుపడినప్పుడు పుష్ప అతనిని పలుకరించకుండా ఉండగలదా? స్వాభావికంగా చూస్తే ఏ మానవహృదయమైనా ఊరుకుంటుందా? ఒకవేళ అలా మైమరచుట తప్పంటారేమో! అయిన అగుగాక. కాని ప్రకృతికి విరుద్ధం ఎంతమాత్రము కాదని నేను ఘంటాపదంగా చెప్పగలను. పెద్దమనుష్యులగా పరిగణించబడే యిచ్చట చేరిన కొంతమంది ఏదో 'సంఘం' 'సంఘం' అని పదిమారులన్నారు. ఏమిటాసంఘం? సంఘం పవిత్రంగా శాశ్వతంగా ఉండాలంటే సంఘ నిబంధనలు సభ్యులందరికీ, వారు స్త్రీలు కానీయండి పురుషులు కానీయండి సమానంగా ఉండాలి. అన్ని ఉడిగి కాటికి కాళ్లుజాపుకొన్న సిద్ధాంతులవారికి నాలుగో పెండ్లి అవుతుంటే సంఘం ఒప్పుకుంటుంది. ప్రపంచమేమిటో యెరుగని పదేండ్ల పసికూన, ఆ సిద్ధాంతులవారి కొమార్తెకే తిరిగీ పెండ్లవడానికి సంఘం ఒప్పుకోదట. ఇదంతా మనం అంటే పురుషులు సంఘంపేరుతో చేసే ఘోరకృత్యాలు' అని ఇంకా ఏదో చెప్పబోతుండగా స్త్రీలలో ఏదో కొంత అలజడి జరిగింది. 'కూర్చోండి! కూర్చోండి' అని కేకలేశారు సిద్ధాంతులవారిని. సిద్ధాంతులవారికి ఏమీ బలం అగుపడలే. తిరిగి పెండ్లాడుటకు పుష్పకు హక్కుందన్నారు స్త్రీలందరూ ఒక్క కంఠంతో. ఒక్క జట్టుగా స్త్రీలు ప్రత్యేక శ్రద్ధ తీసుకొన్నారు. ఎవరిపనులు వారందుకొన్నారు. మ్రోగాయి తిరిగి మంగళవాద్యాలు. ప్రసాద్ పెండ్లికొడుకయ్యాడు—



# ఆంధ్రమాత

ఆంధ్రభారతకృతినంది, కీర్తివహించు, శ్రీ రాజమహేంద్రుఁడే సీమనుండె,
తిక్కనార్య సహాయదీప్తిఁజెన్నొందిన శ్రీ మన్మసిద్ధియే సీమనుండె,
కవిపోషణమునఁ బ్రఖ్యాతుఁడౌ సర్వజ్ఞ సింగభూకాంతుఁడే, సీమనుండె,
"దేశభాషలయందు తెలుగులెస్స"ని తెల్పు, శ్రీ కృష్ణరాయలే సీమనుండె,
మఱియు ఘనులైన ప్రభువులు, మంత్రివరులు, కవులు, పండితుల్ నీయందుగల్గినారు,
సకలసౌభాగ్యజాత ప్రఖ్యాత, పూత, యఖిలదేశైక విఖ్యాత, యాంధ్రమాత!

కష్టసహిష్టతగల్గిన నీవారి కిలనైక్యభావంబు గలుగదేల?
సకలవిద్యలయందు చతురులౌ నీవారి కిలనైక్య భావంబు గలుగదేల?
సర్వకార్యంబుల శక్తులౌనీవారి, కిలనైక్యభావంబు గలుగదేల?
పరులసేవలయందు ప్రౌఢులౌనీవారి కిలనైక్యభావంబు గలుగదేల?
తాము తమవారి కపకృతిదలఁచుచుండ, దయనురక్షింప నెవ్వరితరము జగతి,
"కంచెయే చేనుమేసిన, కాపదేల"; నఖిలదేశైక . విఖ్యాత, యాంధ్రమాత!

ఆంధ్రరత్నంబని యభినుతినొందిన, గోపాలకృష్ణాఖ్యు గొప్పశక్తి,
త్యాగశీలంబులదాల్పు సుబ్రహ్మణ్య కార్యదీక్షాక్రమ ఘటితశక్తి,
విశ్వదాతయటంచు వేనోళ్ల ప్రఖ్యాతి, దీపించుపుణ్యాత్మ దివ్యశక్తి,
ప్రజలకై దమతమ ప్రాణధనంబుల నర్పించినట్టి వారాత్మశక్తి,
ఆంధ్రదేశమా! నీప్రతియణువునందు, నిత్యవిజయైక దీక్షనే నెరపుచుండు,
కాలపక్వమన్నిటికిని గలుగవలయు నఖిలదేశైక విఖ్యాత, యాంధ్రమాత!

తమధర్మమునువీడ దగదంచు; గీతల శ్రీ కృష్ణులేమున్న చెప్పినారు,
స్వాతంత్ర్యమే మనజన్మహక్కుగ లోకమాన్యులు ప్రకటించి మనిపినారు,
సత్యాగ్రహము సర్వజయమని బోధించు గాంధీమహాత్ములు గల్గినారు,
శక్తివంచనలేక శ్రమపడునాయకుల్ భాగ్యవశంబునఁ బ్రబలినారు,
సత్యమే పరంబుగ వేదసమితిదెల్పు; ధర్మమే జయంబని ఋషితతియుఁబల్కు;
ఆస్తికతతోడ నుండ మమ్మరయుమమ్మ, అఖిలదేశైక విఖ్యాత, యాంధ్రమాత!

● శ్రీమతి కొరప్రోలు వెంకటరంగమ్మ ●

## చివరకు—

# సర్వనాశనమా!
# సర్వోదయమా!!

(జిజ్ఞాస - విజ్ఞానదృష్టి)



శ్రీమతి

కె. సుగుణమణి



మానవుఁడు యీ అనంతవిశ్వాన్ని, కాలాన్ని, ప్రదేశాల్ని శోధింప యత్నిస్తాడు, అందులో తానొక భాగం గనుక; తనలో అది యిమిడివుంది గనుకాను. అందుచేత తన నివాసస్థానమైన యీ భూమిని గూర్చి, తదితరములనుగూర్చి తెలిసికోవాలన్న ఆతురత అతనికి కలిగింది. ఆతురతతో అన్నివైపులా వెదుకుతున్నాడు. కండ్లకు కనబడినంతవరకు భూభాగాన్ని, సూర్య చంద్ర బింబాలనీ, నక్షత్రమండలాలని తిలకించి య్యేదైనా ఆచూకీ లభిస్తుందేమోనని ఆశపడ్డాడు. దాన్నిగురించి చెప్పే ప్రతివారి మాట, ప్రతి శాస్త్రం ఆలకించేడు. శాస్త్రజ్ఞులు యీ విషయాన్నిగురించి - తన నివాసస్థానం, తన ఉత్పత్తి, ఉనికి, కడకు రాబోయే స్థితిగతులు మొదలైన విషయాలు తెల్పుతారని గంపెడాశతో యెదురుచూస్తూ చెప్పినదంతా చెవులు తెరుచుకు విన్నాడు. మొదట్లో అంతా బాగానే చెప్పేరు. భూగోళం విడిచి నక్షత్రలోకాలన్నీ త్రిప్పి చూపిస్తే 'ఓహోహో' అంటూ ఆనందించేడు. 'కాలప్రవాహం యెదురాడి మాతోకూడ రమ్మంటే' వచ్చేడు. 'ఇంకా 200 అంగుళాల దూరదర్శని యంత్రాల్ని తయారుచేస్తున్నాం' అంటే వుబ్బిపోయేడు. 'అద్దాలమధ్య వస్తువులవలె అనంతకోటి నక్షత్రాలను చూస్తూ - ఒకవేళ విశ్వం తిరిగి చుట్టివచ్చిన కాంతి ప్రసారంవల్ల మళ్లీ చూచినవాటినే చూపెడుతున్నారేమో' నన్న శంకైనా లేకుండా 'ఏమి అనంతవిశ్వం' అంటూ ప్రస్తుతించేడు.

అంతవరకు బాగానేయుంది; బాగానే చెప్పేరు; విన్నాడు ఓపికతోటి....కాని...కానీ - చి-వ-ర-కు సర్వనాశనం సర్వశూన్యం అయిపోతుందనేసరికి!—తన సూర్యుడూ, తతిమ్మా నక్షత్రలోకాలు 'అవిలంఘనీయములగు ప్రకృతినియమాలకు లోనయిపోయి భస్మీభూతమైపోతా'యనేసరికి..., ఆ నియమాలవల్లే భూమండలం సూర్యుడికి దూరదూరం అయిపోయి అఖండశీతలంలో మునిగిపోతుందనేసరికి—, తాను, తన దారాపుత్రాదులు, సంతానీకులు, తన పరిశోధనలు, ప్రజ్ఞ, ప్రయత్నాలు, ఆశలు భూగోళంతో సహా నశిస్తే, తన సూర్యుడికీ నక్షత్రాలకు చివరకు తనరాతే రాస్తుందనేసరికి..., విశ్వం చివరకు ఉష్ణంతో చావడం (Heat death) ప్రాప్తించి, దానిపై అపూర్వచైతన్యంతో జీవరూపంతో నాట్యమాడే జీవశక్తి, తతిమ్మా ప్రకృతిశక్తి యావత్తు విశ్వాంతరాళాలలో యిమిడిపోయి - భరింపరాని, ఊహింపతరంకాని, జీవంఅనేది వుండటానికి దుర్భరమైపోయే శీతలములోనున్న - అచింత్యం, అభేద్యం, అనంతం అయే నిబిడాంధకారంలోనున్న లీనమైపోతుందని వినేసరికి,...ఉష్ణరక్తం కాస్తా చప్పగా చల్లారిపోయి నిరుత్సాహంతో పటుత్వంతప్పి, నిర్జీవప్రతిమయైపోతాడు.

అంతేగాదు అందలాని కెగిరి చిందులు(ద్రొక్కే) సైజగుణంగలిగి, విశ్వవిహారం సల్పగల సామర్థ్యం గలిగిన మనస్సుకూడ వైకల్యంపొంది 'హే పరమేశ్వరా!' యని యెప్పుడో వచ్చే ప్రళయం యిప్పుడేవచ్చినట్లు ఆశాపాశాలు త్రెంచుకుంటుంది. అవినాశినని యెఱిగిన దిట్టరియైన ఆత్మమాత్రం ప్రశాంతంగా ఉండగలుగుతుంది. కాని అంతాఅంతటి ఆత్మశక్తిగలిగినవారే వుంటే - అంతామహాత్ములు - రాధాకృష్ణులు, రామకృష్ణ పరమహంసలు అయితే యీగోలంతా యెందుకు? ఆస్థితికి అంతారావాలనేగదూ - ఈఅజపా జపాలు, తీవ్రతపస్సులు, అఖండ అల్లకల్లోలాలు, ప్రచండ పరిశోధనలు, వినూత్నజ్ఞాన సముపార్జనలు, నవనాగరికతలు, అనంతరచనలు, యీ మాయనాటకాలు, తంతూ, తమాషాను!

అలాఅన్నీ నశిస్తాయనిచెప్పి, మళ్లా ఆశకల్పిస్తూ, 'భయంలేదు; మానవజాతికి యింకాకొన్ని కోట్ల కోట్ల సంవత్సరాలు వ్యవధివుంది.' అని శాస్త్రజ్ఞులు ఊరటజెప్పినా శాంతిపొందడు మానవుఁడు. జీవితవికాసం, ప్రేమ ప్రయాసం, కళాకలాపం, మత మహత్యం, కాసింతైనా పనికిరాక కేవలం భౌతిక ధర్మాలు రాజ్యంచేస్తాయని నమ్మజాలక పోతాడు.

శాంతములేని జీవికిక ఆనందమెక్కడిదీ? తననైతికజీవనం భౌతికాన్ని కాపాడలేదని శాస్త్రజ్ఞులు తేల్చేక పూర్వపు శాంతికలుగుతుందా? 'శాంతికొరకని యదార్థాన్ని మరుగుబుచ్చి కల్లచెప్పమా?' యని శాస్త్రజ్ఞులనవచ్చు కాని వారిశాస్త్రంచెప్పిందే రైటనడం యేలాగు? భౌతికశాస్త్రజ్ఞులు తమశాస్త్రం ఆధారంగా చేసికొని, ఒక్కదృక్పథంలోనుండియే సృష్టిని పరీక్షించి 'సర్వనాశనం' అనుకోవచ్చు. కాని సమగ్రంగా చూచిచెప్పలేనందుకు అంతా తప్పిపోలేదూ? అలాగే శాస్త్రవేత్తలు చూచేది 'దృశ్యప్రపంచము', 'ఊహాసమన్వయమున్ను' ఇదిసృష్టికి ఒక వైపేనేమోనని ఆలోచించక, తమశాస్త్రాలకు పట్టుబడని వస్తుజాలం యీ ప్రపంచంలో భౌతికేతరంవుందని, అది శాస్త్ర పరిభాషలో చెప్పబడదేమోనని సందేహించక - తమ పరిమితజ్ఞానంతో సృష్టిని సర్వాన్నీ వూహించి (పైపండితులవలె) వర్ణిస్తే యదార్థం అంతే యెందుకవుతుంది? సృష్టికర్త వుద్దేశంకూడ అదేయేలా అవుతుంది?

ఈ శాస్త్రజ్ఞుల నాశనసిద్ధాంతం అవశ్య చింతవ్యమైనది. ఎందుచేతనంటే దీన్నిగురించి చింతించి తానురాబోయే నిర్ణయముపై మానవుని జీవితవిధానం ఆధారపడివుంటుంది. జీవంయొక్క నవశక్తి, సృష్టికర్తయొక్క ప్రేమదృష్టి, మానవునియొక్క దైవభక్తి, సృష్టియొక్క వైచిత్రియం, చివరకు యెందుకూపనికి రాకుండపోయి, రాబోయేవిషయాలు కేవలం భౌతిక సిద్ధాంతాలమీద ఆధారపడి వుండడమే నిజమనితోస్తే యికనైతిక దృష్టికి తావుంటుందా? అంతాకూడ యిప్పటి పాశ్చాత్య 'నాగరికత' దేశీయులవలె భౌతికదృష్టి ప్రధానంగా గలవారైపోతే మరి ఆధ్యాత్మికాని కాశయేమైనవుందా? ఇదే వాస్తవమైతే యిక యీ ప్రపంచంలో 'తినేటందుకు బ్రతకాలికాని, బ్రతికేటందుకు తినక్కరలేదు'. భౌతిక శరీరపోషణకు యెక్కువ ప్రాముఖ్యతయిచ్చి మానసిక ఆరోగ్యంమాట తలపెట్టం. ఉన్నతాశయాలు యీ భౌతికజీవాన్ని ఉద్ధరిస్తాయని నమ్మటకుబదులు భౌతికపరిస్థితులే మనలను తరింపజేస్తాయని తలుస్తాం! ఇఁక సారస్వజీవనంఅంటే యీ ప్రాపంచిక వస్తువులు, విషయాలు వీట్లలోని గొప్పమాత్రం లెక్కకువస్తుంది గాని, ఉత్కృష్టభావాలు, జంతుప్రేమ, పుణ్యకర్మలు, లలితకళలు, నిజమైన విజ్ఞానం సమకూర్చేవిద్యలు అడుగంటుతాయి, 'సత్యమే జయం' అన్నఆర్యోక్తి నడచి, రాక్షసయుద్ధాలు చేయగలిగేవాడిదే రాజ్యం అన్నట్లు తయారవుతుంది. వీట్లచిహ్నాలేగా ఇప్పుడు పాశ్చాత్య ప్రపంచంలో గోచరిస్తూ వున్నాయి. 'ప్రేమమున లోకముదయించె' నన్న సృష్టిహేతువును మరచి మారణక్రియకు దొరకొనిన మానవుడింక మానవుడనిపించుకుంటాడా?

ఇలాంటి ప్రేమభావం నశిస్తే అధఃపతిత్వం దాపరించి దానితో 'నూతన నాగరికతవిజ్ఞానం'లో కాలుపెట్టే మన్నమాట! సర్వమత సమన్వయమైన ఆర్యమతానికి, సర్వోత్కృష్టమైన భారతీయ నాగరికతకు అంజలివిడిచి పాశ్చాత్తపథంలో పడిపోతాము; పడిపోవుచున్నాము కూడా. సనాతనజాతీయ నాగరికత కంటె పాశ్చాత్త్యపద్ధతులే రుచించి నవనాగరికతా వ్యామోహానా వివశులగుచున్న భారతీయులును ఉన్నారు. వీరు - పూర్వము సీతాదేవి కుటీరమును పెల్లగించిన రావణునంతటి వాడెవఁడైన యిప్పుడు పుట్టియున్నచో హిందుదేశమును పెల్లగించి యేహోలెండుప్రక్కనో వేసిపెట్టమని వానిని ప్రార్థించియుందురు కూడను!! వారి దురదృష్ట వశాత్తునైతేనేమి, తదితరుల అదృష్టవశాత్తునైతేనేమి అట్టివాడు లేకపోయేడు!!

మామూలుగా మనిషి - తనశరీరం నశించినా విశ్వాన్ని, విశ్వనిర్మాతను విశ్వసించబోతాడు. ఏదో అవినాశిఆధారం ఒకటిఉండాలని తలుస్తాడు. ఈ జీవితసముద్రంలో కష్టసుఖం అనే తరంగాలలో కొట్టుకొంటూ అల్లాడుచున్న మానవుఁడు గట్టిగాపట్టుకొనుట కేదైనఆధారం వెదుక్కుంటాడు. వెదకి వెదకి ఆధారంఏమీ కనబడడంలేదు; నాకుతెలిసిన ప్రతీదీ, నేనుప్రేమించే విశ్వం యావత్తు అచింత్యమైన భీకర శితలంలో పేరుకుపోతుంది. విశ్వనిర్మాత ప్రాపుదేనికీ, యెచ్చటావున్నట్లు చెప్పబడదు! అని యిలా ఆధార రహితమైన విషయం సహించలేడు. ఇన్నాళ్లు పాపం, పుణ్యం, మంచి, చెడ్డ, దైనికజీవితం, భౌతిక జీవితం అని ఆశాపాశాలలో కొట్టుకొన్న మానవుఁడు ఒక్కసారిగా నిరాశచెందలేక - పదేపదే తర్కిస్తాడు. తత్త్వమ్మ శాస్త్రాలేమంటాయో, విజ్ఞానవేత్త లేమంటారో కూడ ఆలకించి, తనకు సృష్టికర్త ప్రసాదించిన వివేకాన్నికూడ వాటికిచేర్చి చూస్తానంటాడు.

మొన్న మొన్ననే పుట్టిన యీ శాస్త్రాలు, ఒకవైపుమూపేగల భౌతికవిజ్ఞాన శాస్త్రాలు మానవ జీవితాన్నిగూర్చి, దృశ్యాదృశ్య ప్రపంచాన్నిగూర్చి, జీవితం - విశ్వం వీట్ల అంత్యదశలను గూర్చి యింకా సమగ్రదృష్టితో. పారజూచి నిశ్చితంగా చెప్పలేవేమోనని తలుస్తాడు. కేవలం భౌతికనియమాలేకాక - భౌతికాన్ని నడిపే ఆధ్యాత్మికశక్తియే విశ్వమానవ వికాసాల (Evolution of universe and man) కు కారణం కావాలని శంకిస్తాడు. తనలో ఆవినాశాన్ని తలపింపజేసే ఆత్మవస్తువుకూడ అదే కావాలనుకుంటాడు. భౌతిక బలంకంటె ఆత్మబలమే గొప్పదని నిర్ణయించిన తరువాత అంధకారమయమనుకున్న జీవితంలో మరల ఆనందభాస్కరుఁ డుదయిస్తాడు. మానసకమలం వికసిస్తుంది. ఆవెనుక జగత్తుప్రేమ జన్యమని, ఈశ్వరుఁడు ప్రేమమయుడని గుర్తించి తనలో భూతదయ, విశ్వప్రేమ, విశ్వమానవ సౌభ్రాత్రభావం పెంచగలుగుతాడు. ఈవిధంగా భారతీయనాగరికత మరల సర్వదేశీయులకు మార్గదర్శకముకాబోయే తరుణంకూడ వచ్చింది.!

జ్ఞానార్జనమే మనముఖ్య కర్తవ్యముగా పెట్టుకొన్నతర్వాత - 'పాశ్చాత్త్య' 'ప్రాచ్య' భావాలు పోనడచి పాశ్చాత్త్య శాస్త్రాలూ విందాం; ప్రాచ్యవేదాంత గ్రంథాలూ చూద్దాం. 'సనాతనం', 'నూతనం' అని అనకుండా పూర్వకాలపు ఆధ్యాత్మ తత్వకోవిదులు పలికిందీ గ్రహిద్దాం, నూతన భౌతిక శాస్త్రవేత్తలు చెప్పేదీవిందాం. 'మా విశ్వన్న చెప్పిందే వేదం' అనివేదాలలో చెప్పబడిన సర్వం 'వేదవాక్యం'గా తీసికోనూవద్దు; ఈ శాస్త్రజ్ఞులు చెప్పిందే మహాప్రసాదమని అంతా స్వీకరించనూవద్దు. పెద్ద పిన్న భేదం లేకుండా, దేశం కాలం మాట యెత్తకుండా, భాష జాతి విభేదం కల్పించుకోకుండా, ఎవరుచెప్పినా యెట్లు చెప్పినా అంతా సాంతంగావిందాం. నిష్పక్షపాత బుద్ధితో ప్రతీదీతూచి చూద్దాం.

# సర్వనాశనమా! – సర్వోదయమా !

అంతేగాక మనలోకొందరు – తమకు సృష్టిప్రకారమేగాదు, మతంసారమేగాదు, శాస్త్రరహస్యమే గాదు – సహజంగా. సర్వం అవగాహనమవుతూవుంటే – ప్రజలను పిలిచి ప్రబోధించగలుగుతారు. విశ్వాంత రాళాలనుంచి వారికి విశ్వగానం వినఁబడుతుందట! అట్టిమహాపురుషులు తేల్చేది తీసుకుందాం. ఒక్కొక్క దృక్పథంలోంచిచూచి చెప్పుతారు; గనుక పైభేదబుద్ధులు లేకుండా అంతావినాలి. భౌతికం, ఆధ్యాత్మికం కూడా అవగాహనచేసుకోవాలి. అప్పుడు విశాల పరిజ్ఞానం లభించి వీలైనంత సమగ్రంగా వీక్షించగల సమర్థత అలవడుతుంది. ప్రశాంతంగా వివేకంతో వితర్కించ వీలవుతుంది. అప్పుడేమైనా యదార్థం గోచరిస్తుందేమో!

ఈ లీలాజగత్తులో మనకుతెలిసిన ప్రతీదీ క్షణక్షణం మార్పుజెందిపోతూవుంటే 'యదార్థం 'అని దేన్ని అంటాము? అంటారేమో! ఈ లీలకువెనుక నిత్యం ఊహింపరానిదా? అసత్యానికి వెనుక సత్యం ఉండదా? వినాశికివెనుక అవినాశి కానరాదా? విశ్వానికివెనుక విశ్వకర్తఉండడా? ఉన్నా అతనికి విశ్వకళ్యాణం అక్కరలేదా? ఈ విశ్వం శాస్త్రజ్ఞులు చెప్పిన భౌతిక నియమాలకులోనయిపోయి 'సర్వనాశన' మైపో తుంటే – ఆధ్యాత్మికశక్తి – ఒకటివుండి తనప్రియసృష్టిని, (మానవుని) స్వస్థలానికి చేరుస్తుందని విశ్వసించ డానికి వీలేమైనావుందా?

ఉన్నట్లేతోస్తుంది – శరీరబలంకంటే ఆత్మబలం గొప్పదని యుగయుగాలుగా ఋజువుచేయబడింది. పాశ్చాత్యులుకూడ భౌతికశరీరంయొక్క రుగ్మతలు మానసిక బలంవల్ల మాన్పవచ్చునని యిప్పుడిప్పుడే గ్రహిస్తు న్నారు. ప్రపంచమందున్న ప్రతీదీకూడ ఒకరూపంనుండి ఇంకొకరూపంగా మారుతుందేగాని 'సర్వనాశన' మనేది లేనేలేదని యిటీవల వప్పుకుంటున్నారు. పరమాణువుమొదలు బ్రహ్మాండంవరకు ప్రతీదికూడ ఒకనియమిత విధా నంలో తిరుగాడుచు, మనుచు, మార్పునందుచున్నదని గ్రహించిన పాశ్చాత్త్యశాస్త్రజ్ఞులు, వాటిశాసనకర్తను, రక్షకుని ఏలవప్పుకొనరాదు?

సృష్టికర్త సృష్టించిన జంతుజాలములో మానవజీవి చిత్రాతి చిత్రవిచిత్రమైన జంతువే – ఈ మానవ జీవిత వికాసక్రమాన్ని తిలకిస్తే – మానవుని శరీరం అట్టేమార్పునొందక పోయినా మస్తిష్కము, బుద్ధిక్రమేణా అపరంగా పెరిగిపోతుందని తేలింది. అతనిబుద్ధి (దానిరూపాంతరములగు అంతఃకరణ, మనస్సు, చిత్తము, అహంకారము కూడ) ఇలాపెరిగిపెరిగి కాలక్రమమున శరీరరహితమై, ద్రవ్యాధార మక్కరలేకయే బ్రతుకగలు గుతుందాయేమి!

లేక బుద్ధివికాసం కొంతకాలానికి ఒక అవధిచేరి, ఆవెనుక సంకుచితం ప్రారంభమై, మరల అడవి మనిషి తయారవడం సంఘటించి – న్యాయాన్ని అనుసరిస్తుందాయేమి!! ప్రస్తుతదారుణ యుద్ధాలు, రాక్షస కృత్యాలుచూస్తే – ఇట్టిదిగూడా సంభవమేనని తోచగలదు.

లేదా, క్రమక్రమముగా వికాసమునంది, మానవుని మనస్సు అనంతశక్తియుతమై, కడపట విశ్వములో లీనమైపోయి–సర్వవ్యాపి, సర్వాంతర్యామియైన బ్రహ్మంలో నైక్యమై నిర్వాణదశ పొందుతుందాయేమి!!!

# ఎంత దారుణము?

ఆశ, తృప్తి—రెండే రెండు జీవికలు ప్రపంచంలో బ్రతికివుండడానికి—

ఆశ జీవిలో నూతనోత్సాహాని కలిగిస్తుంది. ఊహ జ్యోతిని వెలిగించి భవిష్యన్మార్గాన్ని సూచిస్తుంది.

—కాని, ఈ ఆశ దురాశగా వికృతినొందినప్పుడు...?

★

శ్రీమతి
వెలిదండ
చూడికుడుతమ్మ

★

'ఏమి, ఎన్నిసార్లు పిలిచినా అలాగు మౌనంగా ఊరుకుంటారు? ఇలాగూరుకుంటే నాకేం తోస్తుంది చెప్పండీ. ఒంట్లో బాధో, నీరసమో, ఏ సంగతి చెప్పరాయెను. నాకేమో మిమ్మల్ని చూస్తున్న కొద్దీ భయం వేస్తున్నది...ఏమండీ బాబూ, ఏమైనా కాస్తంత నయంగాఉన్నట్టు చెప్పగలరా? జ్వరమేమో ఇంతో అంతో వదలకుండానే ఉంటూఉన్నది. ఏమీ పాలుపోక నేను అంతకంతకు వెఱ్ఱిదాననైపోతున్నాను.'

'అమ్మా, తొందరపడకండి. మొన్ననేకదా మీకు తగని సుస్తీచేసింది. ఆదుర్దా ఎక్కువౌతూ వుంటే మీ రోగము మళ్లీ తిరగబెట్టిందన్నమాటే' అని డాక్టరు రోగివైపు నిదానించి చూస్తూ 'రావుగారూ మీబాధ ఏలాగున్నది?' అన్నాడు.

'ఫలానావిధంగా ఉందని చెప్పలేను. మీరుకోసిన చోటికంటె మరికొంచెము దూరములో వాచినట్టుంది చూడండి.'

'నేను చూస్తూనేయున్నాను. తిరిగి రేపు ఇంకొక కోతకొయ్యవలెను. అవునుగానండీ, మీఅన్నగారికి పట్నముకు మీ సుస్తీనిగురించి ఏమైనా వ్రాసినారా?'

'నేనేమి వ్రాయలేదు. మొన్ననే మా అన్నగారు జవాబు వ్రాసినారు. ఇంతకూ నాకు వచ్చిన భయమేమిటి? మీరువచ్చి మందువేస్తున్నారుగా కొద్ది రోజులలో అదే మానిపోతుంది.'

డాక్టరు తీక్ష్ణముగా కురుపును తనిఖీచేస్తూ 'అయ్యా, మొట్టమొదట మీకురుపు చూచిన వెంటనే నేనే మీ అన్నగారికి మీ విషయమై వ్రాస్తూ వెంటనే రావలసినదిగా సలహాఇచ్చాను. బహుశా ఈ రాత్రియే రాగలరని నేను ఎదురు చూస్తున్నాను; గాని ఆయన వచ్చువరకు ఈ కురుపును కోయకుండా ఉంచటం చాలా ప్రమాదం. మీతో చెప్పకూడదనుకున్నా. ఇక్కడ మీకంటె ఇంకొకరులేరు గనుక రోగముయొక్కస్థితి చెప్పకతప్పదు. ఇది రాచకురుపు, చాలా ప్రమాదము. మీదుమిక్కిలి జ్వరము తగ్గకుండా ఉన్నది. నేనింకొకగంటలో అన్ని పరికరాలతోవచ్చి శస్త్రము చేస్తాను. నాకు వీళ్ళాయింటిస్థితి చూస్తే చాలా విచారంగాఉంది. ఆమె చూడబోతే బహు సుస్తీగాఉన్నారు. మీకు అకస్మాత్తుగా ఈ కురుపు ప్రవేశించినది. ఇంట్లో చూడబోతే పిలిస్తే పలికేదిక్కైనా లేనట్టున్నది.'

‘మా కోడలు తన పుట్టినింటినుండి రాకరాక మొన్ననేవచ్చింది. కొంచెము నహాయముగావున్నది. భగవన్నిర్ణయము ఈలాగుంటే ఎవరేమి చేయగలరు? సమస్తసౌఖ్యాలను అనుభవించుటకూ, ఒకరికి పెట్టుటకూ సర్వేశ్వరుడు అన్నివిధముల అనుకూలపరిస్థితులను కల్పించినాడు. కాని అనుభవించుటకు తగిన ఆరోగ్యతనుగాని మానసికోత్సాహమునుగాని మా నొసటను వ్రాయలేదు.’ అని మరి మాటాడలేక గ్రుడ్ల నీరు త్రిప్పి కండ్లు క్రిందికిదించాడు ఈ మాటలను ప్రక్కనుండి వింటూఉన్న సుందరమ్మ కండ్లు తుడుచుకుంటూ పదునాలుగు సంవత్సరములక్రిందట కళాశాలలో ఉన్నతవిద్యను చదువుచూ ఇరువదిసంవత్సరములు మాత్రమే జీవించి అకాలమృత్యువు వాతబడిన తమ ఏకైకపుత్రునితలుచుకొని మరీ విచారించింది.

‘అమ్మా విచారించకండి. నేను మీ కుమారుడుకలసి విజయనగరములో బి.యే. చదివినాము. అతడు నేను అన్నదమ్ముల్లాగే అప్పడు తిరుగుతూఉండే వాళ్లము. ఆతని చావుకబురు ఒకపిడుగు దెబ్బలాగు మా స్నేహితులందర్నీ కలతపెట్టింది. ఈశ్వరమాయ. మీరు మాత్రము ధైర్యముగా ఉండండి. మీ బావగారు రాత్రికి వస్తారు. మీకు చాలావరకు ధైర్యము కలుగుతుంది. నే నింకొకగంటలో వస్తున్నాను. నీళ్లు మాత్రము బాగా కాగబెట్టించండి; సెలవు.’ అంటూ డాక్టరు వెళ్లిపోయాడు.

* * *

జానకి రావుగారి వితంతుకోడలు. పాపము భర్తతో ఒక సంవత్సరమైనను పూర్తిగా కాపురము చేయలేదు. భర్త చనిపోవుటకు నాలుగునెలలకుమునుపే పండుగకు తన పుట్టినింటికి వచ్చివుంది. తరువాత పెనిమిటిపోయిన తొమ్మిదవరోజునవెళ్లి అంత్యక్రియలు పూర్తియైనవెనుక తనకు అత్తవారిచ్చిన మూడువేల రూపాయిల సొమ్ముతో పుట్టింటికివచ్చి అక్కడనే వుండిపోయింది. ఏదో సకృతుగా రెండుమూడుసారులు తప్ప తిరిగి అత్తవారియింటికి పోనేలేదు. పదునాలుగేండ్ల తరువాత అత్తగారికి జబ్బుచేసిందని విని చూడ వెళ్లింది. ఇంతలో మామగారికి జబ్బుచేయటం, రెండుమూడుసార్లు కురుపుకోతలు జరగటం సంభవించినందువ ఆయన తన సంతానాభివృద్ధికొరకు వీలువ్రాయ నిశ్చయించుకొన్నంతవరకు వచ్చింది. ఈ సంగతితెలిసి జానకి నాలుగురోజులలో తిరిగి వస్తానిచెప్పి పుట్టింటికి వచ్చింది.

మామగారి అన్నపిల్లల కెవరికో ఆస్తిని సంక్రమింపజేయాలని కదా ఆయన దత్తకాధికారం తన కిస్తానన్నది. కాని అది జానకికి ఎంతమాత్రము ఇష్టములేదు. తన చిన్నఅక్క కుమారుణ్ణి వదిలివేసి ఎవరికో ఆస్తినంతా ధారాదత్తమివ్వడానికి ఆమెకు మనస్కరించలేదు. అందుకోసం యింతకుపూర్వమే తాను చిన్నక్క కుమారుణ్ణి దత్తతచేసుకున్నట్టు చూపించడానికి తగిన వ్రాతమూలాలు మొదలైన ఏర్పాట్ల నిమిత్తం అన్నగారితో సంప్రదించింది.

అనుకున్నప్రకారం అంతాజరిపి, జానకి తన అన్నగారితో కలిసి, తిరిగి మామగారియింటికి బయలుదేరి వచ్చింది. ఆరోజున రావుగారు అందర్నిపిలిచి యిలాఅన్నాడు—

‘ఏమోయీ గిరీ, ఏమోయీ మృత్యుంజయం, ఇప్పడొచ్చిన భయం నాకేమీలేదు. గడియ మనది కాదు కాబట్టి చేయదలచుకొన్నది వెంటనే చేసివేయటం మంచిది. గనక, ఇదేమంచి అవకాశమని నాకు తోస్తున్నది. నేనిప్పుడు మంచముమీదనుంచి సరిగా లేవలేని స్తితిలో వున్నాను. ముందు ఏమవునో తెలియదు. కావున ఒకవీలు వ్రాయవలెనని ఉన్నది. నా కుటుంబము నాతో అంతరించకుండా చేయవలెనని ఉన్నది. నా తదనంతరము నా జనకసంబంధీకు నొక్కని నా కుమారునకు నా కోడలు దత్తత చేయవలెననిన్నీ, ఆమె అలాచేయనియెడల, నాభార్యయే వానిని నాకు దత్తతచేయవలెననిన్నీ, నా ఆస్తి యావత్తు రెండువంతులు

చేసి, ఒకవంతు దత్తునికిని, మిగిలినవంతు నాభార్యా, కోడలు సమముగా పంచుకొని జీవితకాలము అనుభవించుటకును ఏర్పాటు చేయవలెననిన్నీ నా ఉద్దేశము. ఆ విధంగా వ్రాసి నా చేతికివ్వండి. నేను చదువుకుని సంతకము చేసేస్తాను. ఇప్పుడు ఇక్కడఉన్న మీరిద్దరు, డాక్టరుగారూ, ఇంకా మీతో వచ్చిన ఆ ముగ్గురు పెద్దమనుష్యులు సాక్షి సంతకములుచేయండి. ఇంతమంది పేరుపొందిన పెద్దలు సాక్షి సంతకముచేస్తే; ఇంక వేరే రిజిష్టరీ చేయించనక్కరలేదు" అనిచెప్పి కాగితంవ్రాయించి, డాక్టరుగారిచేత, వారిచేత సంతకాలు చేయించేడు.

డాక్టరు: "మీరు ఇంత సదుద్దేశంతో, ఈశ్వరసాక్షిగా, ఇంతమంది సమక్షాన వ్రాయించి నిర్ణయించిన శాసనాన్ని తిరస్కరించుటకు ఎవరికిసాధ్యము. మీ ఎదురుగుండా మేమనటం కాదుగాని, కుమారుడు చనిపోయినవెంటనే పుట్టినింటికిపోయి, పదునాలుగు సంవత్సరములనుండియు మీకు సహాయము చేయక, ఇప్పుడు నెలక్రిందటవచ్చిన కోడలికి, నలువది సంవత్సరములంగ అన్ని కష్టసుఖాల్లో పరిపూర్ణమైన బాధ్యతలను పొందిన మీ భార్యతో సమానమైన ప్రతిపత్తిని కల్గించి గౌరవించారు. అహా ఏమి మీ న్యాయశీలత! కుటుంబగౌరవ స్థాపనాపేక్ష!"

రావు వినమ్రుడై, తలవంచాడు. ఇంతలో గడియారము 5 గంటలు కొట్టగా అందరూలేచి, రావుతోను, ఆయన అన్నగారితోను, తిరిగి రాత్రివస్తామనిచెప్పి వెళ్లిపోయారు.

* * *

"ఏమోయి జగన్నాధరావూ, నెలదినములనుంచి కనబడటమే లేదే. ఎక్కడికి వెళ్లావు?"

"ఈ మధ్య అర్జంటుగా చెన్నపట్టణము పనిమీద వెళ్లవలసివచ్చింది. నేనింటికిరాగానే మా చిన్నవాడు, రావు వారము దినములైె చనిపోయినాడని చెప్పినాడు. అ కబురు వినే వినటంతోటే నా ప్రాణం నా బొందిలోనుంచి లేచిపోయినట్లైనది. ఆ వీలువ్రాసిన రోజున చూడటమే నా అఖరుచూపైంది. తరువాత అతను మరో 15 రోజులున్నట్టు విన్నాను. నేను వచ్చిన సాయంకాలమే వాళ్లింటికివెళ్లి ఆయనభార్యను చూచాను. ఆమె కోడలు ఆమెను అప్పుడే తగాదాలోనికి దింపుచున్నట్లు తెలిసింది."

"అవును, నాకూ తెలిసింది. ఇదేమిటోయి ఈ చిత్రం. రావు తాను వ్రాయదలచుకొన్న వీలును గురించి ముందుగా మనతో చర్చించినప్పుడు ఆయన కోడలు, ఆమె అన్నగారూ అక్కడనే యుండిరిగదా! ఈవరకే దత్తత అయిఉంటే ఎందుకు చెప్పలేదూ? ఎంత దారుణమైన కార్యానికి సాహసించారు?"

"అవును, జ్ఞాపకం వచ్చింది. అసలు రావు తన కుమారుడు పోయిన కొన్ని నెలలకే, తన తల్లి సలహానను సరించి తన అన్నగారి మనుమడినే దత్తతచేయుదలచి, కోడలికితెలుపగా, ఆమె అప్పుడు 14 సం॥ముల బాలికయగుటచే, ఆ చిన్నవయస్సున దత్తతచేసికొనుట హాస్యాస్పదమని తలచియో, "వంశాభివృద్ధి"ని గూర్చి పరితపించవలసిన ఆవశ్యకత ఆమె మనస్సుకు అప్పుడు సహజముగా తట్టకుండుటచేతనో, మనోవృత్తిని మాత్రమే కోరుచూ కొన్నాళ్లున్నూ, మామగారే ఒక పెద్ద పిల్లవానిని దత్తత చేసుకొనవలసినదనిన్నీ, తన చెల్లెలినిచ్చి వివాహముచేసి, అత్తవారితో సంబంధమును ఉంచుకొనదలచినట్లు కొన్నాళ్లున్నూ, చెప్పుతూ ఉండెనట. కాని, రావు తన కుమారునకు దత్తతచేయుటయే సవ్యమైన కార్యమని నిశ్చయించి, ఎప్పటికైనా తనకోడలు ఒప్పుకొనదా అని కాలహరణము చేయుచుండెను. ఇప్పుడకస్మాత్తుగా కోడలికి ఎందుకీబుద్ధి పుట్టెనో గదా!"

## ఎంత దారుణము?

“ఆమెకు పుట్టినింట అన్నగారు ఉన్నారుగదా! వారూ స్థితిపరులే. అయినను ఆశకు మేరలేదు గదా! స్వతహాగా ఆమెకే ఇప్పుడు దురాశ ఏర్పడి ఉండవచ్చును; దానికి అన్నగారు దోహదమిచ్చియుండ వచ్చును. మామగారు పోకముందే తాను ఒక పిల్లవానిని దత్తతచేసుకున్నానని చెప్పటంవల్ల ఆస్తి అంతా తనకేవచ్చునని భ్రమతో ఉన్నట్టున్నది. కాని వారు తొందరలో కల్పించిన కాగితాలనుబట్టి, అన్నగారే ఆమె మెడకు ఒక ఉరిత్రాడు తగిలించినట్టున్నదట.”

“అదేమిటి?”

“ఆస్తినంతా ఆ పెంచుకున్న పిల్లవానికి ధారాదత్తము చేసినట్టు స్టాంపుమీద వ్రాసి రిజస్టరీ కూడా చేయించినాడట. ఆ పిల్లవాని జనకసంబంధీకులు ఆ పిల్లవానితరఫున ఆస్తిని అన్యాక్రాంతముచేసినను, లేక ఆ పిల్లవాడే మేజరయినతర్వాత అన్యాక్రాంతముచేసినను, ఆమెకు చేతికి చిప్పయే. మామగారు వ్రాసిన వీలునుబట్టి తన భాగమును తాను బ్రదికియున్నంతకాలము ఎవరును ముట్టుకొనజాలరు.”

“ఈ సంగతి ఆమెకు తెలుసునా?”

“ఆమెకు తెలియదట. అన్నగారికీ మొదట తెలిసియుండకపోవచ్చును. తొందరలో చేసినపని అగుటవలన ‘దురాశ దుఃఖము చేటు’ అనునట్లు ఈ అనర్థము దైవికముగానే సంభవించియుండును. అయినను రావుగారి భార్యను భయపెట్టదలచి, తమకు చాలా ధనమున్నదనియు, తాము చేసిన కార్యములు అన్యాయములు అసత్యములు అయినను, ఆమెను మూడు కోర్టులలోను తిప్పించి, ముప్పుతిప్పలు పెట్టించెదమని బెదరించుచున్నారట. సంఘములోని పెద్దలకు చాలమందికి అన్నిసంగతులు తెలిసినను, కొడలు అన్నతో కలిసి చేయుచున్న ఈ పని బహు దారుణకార్యమని నమ్మకమున్నను, ఎవరును దానిని నివారింపజేయలేరుగదా! ఆహా, సంఘబలమెంత క్షీణించినది! కోర్టులే శరణ్యములు. ఇంక ఇటువంటి కేసులు కోర్టులకెక్కితే ఏవిధముగా పరిణమిస్తవో! తిరిగి కలుసుకుందాం.”

---



---

# ఆంధ్రీ!

శ్రీలవెలసిన తెలుఁగు తల్లికిఁ
గీర్తిఁగాంచిన యాంధ్రజననికిఁ
జేరి హారతులీయఁగా, వే
గిరము రావే సోదరీ!

★

సుధలు గురిసిన తెలుఁగు నాటను
సిరులు విరిసిన తెలుఁగు తోఁటన
బుట్టి, పెరిగెడి మనకు లేదిల
నెట్టి కొఱఁతయు సోదరీ!

★

పలుకు పలుకునఁ దేనెలొలికెడు
తెలుఁగుమాటల తీపు తేఁటలు
వెలికిఁ జిమ్మిన మొల్లనలివలెఁ
గులికి, కూయవె సోదరీ!

★

వైరిబలములనెల్ల సంగర
రంగమున నోడించి, సమధిక
వీరవనితయునైన రుద్రమ
రాణిఁదలఁపవె సోదరీ!

★

దినదినమ్మును నీ మనమ్మున
నవ్యరసమును బాదుకొలిపియు,
దివ్యతేజముఁగాంచి, సుఖసం
చయముఁ బడయుము సోదరీ!

★

పసిడినగల ధరించి మెడలో,
నొసట కుంకుమ తిలకమునుంచియుఁ,
బట్టు పుట్టముఁ గట్టు మాతకు
వందనములిడు సోదరీ!

★

శ్రీమతి మీనాక్షి.

★



గృహలక్ష్ములు
గుర్తించవలసిన
గృహ పరిశ్రమ

# నవారు పరిశ్రమ

శ్రీమతి
పులిపాక
బాలాత్రిపుర
సుందరమ్మ





కొంతకాలమునుండి ప్రతి స్త్రీ హృదయములోను గృహపరిశ్రమలు చేయవలెనని, వాటివలన ఆర్థిక లాభము చేకూర్చవలెనని ఆందోళన బయలుదేరినది. మరికొద్దికాలమునుండీ ఎక్కడ ఏవిదొరుకును? ఏమి చేయుదుము? అని మనస్సులలో ఉర్రూతలూగుచున్నారుగాని ఏమిప్రయోజనము? తాము ఒకచోటికివెళ్లి తెలుసుకొనుటగాని, ఎక్కడ ఏదిఉన్నది విచారించుటకుగాని వీలుకాదు స్త్రీలకు. పురుషులైనను ఏవైనాకనుక్కొని తెచ్చి స్త్రీలకు అందజేసి చేయించుట అసలేలేదు. తాముచేతనైనంతవరకు సంపాదించి ఖర్చుపెట్టుట, ఖర్చు ఎక్కువైతే విసుగుకొందురేగాని, మీరుఇంట్లోఉండి ఫలానిదిచేయండీ అని ఆజ్ఞాపిస్తే చేయని స్త్రీ లేదుగదా!

ప్రస్తుతము మేము నవారు పరిశ్రమ ఒకటి తెలుసుకొంటిమి. దానికి ఎక్కువ కాయకష్టముగాని, ఎక్కువ డబ్బు పెట్టుబడిగాని అవసరములేదు. ఎక్కువ పరికరములుకూడా అవసరములేదు. ఒక అర్ధరూపాయిగాని పదిఅణాలుగాని డబ్బుచాలును. తరువాత నూలుపెట్టె ఒకటి మూడురూపాయల పావులా ఇచ్చి తెచ్చినట్లైతే నేత ప్రారంభించవచ్చును. నవారునేయుట చాలా సులభము ఈ నవారు మగ్గముమీద రోజుకు రెండుఅణాలు లాభముండును. ఇంకాతొందరగా నేసినచో ఇంకాఎక్కువేవచ్చును. ఈ పరిశ్రమ ముందుగొప్పవారు ప్రారంభించి ముందునకు వచ్చినగాని కొద్దివారు భయము, అభిమానము వదిలిముందునకురారు. గనుక ఈ పరిశ్రమ ప్రతియింటను ముఖ్యముగా ఉండవలసినది. ఈ పని ఎక్కువరోజులు నేర్చుకొనవలసిన అవసరములేదు. ఒకరు చేయుచుండగాచూచి మరివకరు చేయవచ్చును. బాలలు వృద్ధులుకూడా శ్రమలేకుండా పనిచేయవచ్చును. ఇంటిపనులు నెరవేర్చుకొని తీరికసమయమున ఒకపెట్టెనూలును యిరువదిరోజులలో నేయవచ్చును. పెట్టె నూలుతో నేసిన నవారు మనిషి ప్రమాణపు మంచములకు రెండింటికి సరిపోవును.

## దీనికి కావలసిన పరికరములు

ఇనపతీగెలు ఏబది; వీటిని బల్లుఅంటారు. ఇవి నేతపరిశ్రమ ఉన్నచోట సాలీల ఇండ్లలోగాని అన్నీ అమ్ము కొట్లలోగాని దొరుకును. చీరాలలో ముఖ్యముగా దొరుకును. బలపపులావు నాలుగు అంగుళముల పొడవుగలవి నాలుగు ఇనుపముక్కలు. ఆరంగుళముల వెడల్పు అడుగున్నర పొడవుగలవి రెండుచెక్కలు. మూడు బెత్తలపొడవు అంగుళము వెడల్పుగలిగి పదునులేకుండా రెండుప్రక్కలా ఒకేమాదిరిగాఉండి పిడిఉన్న కత్తి ఒకటి. ఇవి నవారునేత పరికరములు.

బల్లు పక పందా అరణాలు. ఇక మిగతావస్తువులు మన ఇండ్లలో ఉన్నవే; లేక కొన్నను ఒక పావలా, అరణాలు ఇచ్చిన వచ్చును.

ఈ బల్లు ఏవిధముగా ఉండును అంటే, మూడుబెత్తల పొడుగు ట్వైనుదారమంత లావు ఉండును. రెండువైపులా రింగులవలె ఉండి, మధ్య దోసగింజవలె బెజ్జముండును. వీటిని ఇనపముక్కకు ఒకొక్కటి చొప్పున ఎక్కిస్తూ దారముతో బిగించవలెను. అవిధముగా ఒక్క ఇనపముక్కకు పాతికచొప్పున ఎక్కించి కట్టవలెను. అ విధముగా ఇనపముక్కలు రెండుప్రక్కలా దూర్చి కట్టి తడికలవలె తయారుచేయవలెను. వీటిని జల్లెడలని తీగెతడికలని వ్యవహరించెదరు. ఈ విధముగా రెండు తడికలవలె తయారుచేసి హెచ్చు తగ్గులు లేకుండ ఈ తడికలకు రెండుప్రక్కలా తిక్కిడీగా త్రాళ్లు కట్టి పైవైపు త్రాళ్లు రెండూ కలిపి కట్టవలెను. దానికి మళ్లీ ఒకత్రాడు కట్టవలెను. ఈ విధముగా రెండుతడికలకు కట్టవలెను. తరువాత రెండుబెత్తల పుల్లకు మధ్య త్రాడుంకట్టి ఆ త్రాడు దూలమునకు కట్టవలెను. ఇనపతడికలకు కట్టిన త్రాళ్లు పైనకట్టిన పుల్లకు రెండు వైపుల రెండుతడికల తాళ్లు కట్టవలెను. తడికలకు రెండోవైపునున్న తిక్కిడిత్రాళ్లకు రెండింటికి రెండు చెక్కలుంకట్టి భూమికి బెత్తెడు ఎత్తుగా వదలవలెను. చెక్కలకు రెండోవైపున తాళ్లుకట్టి మన వీలుప్రకారం ఒకదానికొకటి ఎదురుగా గుంజలు పాతిగాని లేక స్తంభములున్నచో ఉన్నచోటనేగాని మనము కూర్చునే చోట వెనుక గుంజకు ఈ రెండు చెక్కల త్రాళ్లు కలిపి ముడివేయవలెను. తరువాత నూలు మనకు కావలసిన పొడుగు పెట్టి పడుగుచేసుకుని అ పడుగుదారపు చివరలు ఈ తడికలమధ్య బెజ్జములలో ఎక్కించవలెను. రెండవ చివరలు రెండవ తడికలో ఎక్కించవలెను. అలా దూర్చేటప్పుడు మొదటిదాని తీగెల మధ్యలో రెండవదాని పోగులున్నూ రెండవదాని తీగెల మధ్యలో మొదటిదాని పోగులున్నూ దూర్చుతూ ఎక్కించవలెను. తరువాత రెండు చివరలు కలిపి ముడివేయవలెను. అప్పుడు తడికలు రెండున్నూ పడుగుమధ్యలో ఏర్పడును. తరువాత పడుగు రెండు స్తంభములకు చుట్టూ త్రిప్పికట్టి మిగతాది రూళ్లకరకు చుట్టిగాని కుచ్చుపోసి ముడివేసిగాని వదలవలెను.

కొంతదారము కండెలకు చుట్టుకుని పడుగు కుడిప్రక్కకు వచ్చేలాగున ఎత్తుపీట వేసుకుని కిందికి ఒదిలిపెట్టిన చెక్కలు రెండూ తొక్కుతుంటే పైకి క్రిందికి వేరువేరుగా దారము ఏర్పడి కాళీ కనుపించును. అ కాళీలోనుంచి కండె ఇటూ అటూ మార్చుకుంటూ కత్తితో కదియ కొట్టవలెను. ఈవిధముగా గంటకు రెండు గజములు నవారు నేయవచ్చును. ఈ విధముగా ఈ పరిశ్రమ నాకు తెలిసినంతవరకు వ్రాసితిని. దీనిలో ఇంకా ఎక్కువ పనితనముగాని యింకా సులభముగా తయారుచేసే విధముగాని తెలిసినచో సోదర సోదరీమణు లెల్లరు సోదరి గృహలక్ష్మి ద్వారా తెలియచేయుదురుగాక యని ప్రార్థించుచున్నాము.

### పనిముట్లయొక్కయు యితర వస్తువుల పేర్లు

1. స్తంభములు (వాని దిమ్మెలు) 2. పడుగు. 3. నేసిన నవారు. 4. దారపు కండె. 5. జల్లెడలు. 6. బల్లు. 7. పై కట్టిన త్రాడు. 8. త్రొక్కుడు చెక్కలు (పాంకోళ్లు) 9. చెక్కలకు కట్టిన త్రాడులు. 10. కూర్చొను బల్ల (స్టూలు) 11. దూలము. 12. నూలు (పడుగుయొక్క) చుట్టబడిన రూళ్లకర. 13. నేసిన నవారు చుట్టబడిన స్తంభము. 14. కత్తి.



పట్టాభిషేక సందర్భమున సింహాసనారూఢులైన శ్రీ శ్రీ శ్రీ జయచామరాజ
ఒడయర్ బహద్దరువారు



హిస్టారికల్ ఎసోసియేషనుకు గౌరవాధ్యక్షులైన
శ్రీ మహారాజావారు.

# గృహలక్ష్మి



తన గృహమును సరిదిద్దుకొనగలి
గిన గృహలక్ష్మి, దేశమునంతయు
సరిదిద్దగలదు—గృహిణి యొక్క
జీవితాదర్శము గృహోద్ధరణమే
కాదు ప్రపంచోద్ధరణము గూడ.



శ్రీమతి ఇనుగంటి సరస్వతీదేవి

గృహలక్ష్మి యనఁగా నేమి? ఇల్లాలు - భార్య. గృహమున కలంకారము గృహలక్ష్మి. గృహిణి లేని గృహము వనము. గృహిణియున్నప్పుడే శోభ. కళకాంతులు. పురుషుఁడు కష్టపడి ద్రవ్యార్జనసేయువాఁడు. స్త్రీయే గృహాధికారిణి. భర్త కష్టపడి చెమటలోర్చి వేసారి యింటి కరుగుదెంచిన భార్య ప్రేమరసపూరిత వాక్యములతో నుత్సాహపరచిన దెట్టి శ్రమయుఁ గానరాక భర్త కానందము కలుగును. భరించువాఁడు భర్త, భరింపఁబడునది భార్యకదా! ఇట్టి అనుకూలదాంపత్యము స్వర్గతుల్యముగ నుండును. లోకకల్యాణోద్ధరణము నిజమైన దంపతులపైననే యాధారపడియున్నది. దాంపత్యానురాగ మన్నింట నేకమై యనుకూలముగ నుండెనా? తత్సంతాన సుగుణవిశేషమును నట్లేయుండును. దేశాభివృద్ధికి, సంఘాభివృద్ధికి వీరలే మూలకారణములగుదురు. 'యథా రాజా తథా ప్రజా' యనునట్లు యింటి యజమాని గుణసంపత్తిపైననే, నడవడిపైననే భార్యాపుత్రుల నడవడియు నుండును. అనుకూలవతియగు భార్య యున్నచో గృహమును దిద్దుకొనుటయే కాక తన సంతానమునకును పట్టుపడవలసిన విజ్ఞానమును బోధించి దేశమాతకుఁ దగిన పుత్రులనిపించుకొనునట్లు సవరించుకొనగలదు. విమలపాతివ్రత్యధర్మమును తన పుత్రికలకు నుగ్గుపాలనాటనుండియు నలవాటుచేయఁగలదు. కనుక ముఖ్యముగా గృహలక్ష్మిపైననే యింటికి కీర్త్యపకీర్తులు గలుగును.

"ఆతతధర్మార్థ సుఖ
ఖ్యాతులు సద్భార్యవలనఁగాదే కలుగున్."

అను మహాభారత వాక్యమేనాఁడును మఱువంగరానిది. ఒక్క ధర్మార్థకామములకే కాదు, మోక్షప్రాప్తికిఁగూడ సత్సతి హేతువగునని చెప్పుట సాహసముకాదు. ఐహికాముష్మికఫలముల కన్నింటికిఁ దోడు భార్యయే. ధీరోదారగుణరత్నాకరులగు పుత్రులను బడయుటకును, వీరసంతానాభివృద్ధికిని, రెండువంశములవారిని తరింపఁజేయఁగల సాధ్వీరత్నములను గాంచుటకును భార్యయే యాధారమని యంగీకరించునాఁడు ఆ యీ సత్కార్యాచరణములచే, ధర్మప్రవర్తనలచే, మోక్షసామ్రాజ్యలక్ష్మియు గృహలక్ష్మివల్లనే లభింపఁగలదని ఘంటాపథంబుగఁ జెప్పకతప్పదు. ఈ భావమే పంచమవేదమనఁబరగు భారతమున విశదీకరింపఁబడినది.

సీ. ధర్మార్థకామసాధన కుపకరణంబు, గృహనీతి విద్యకు గృహము విమల
చారిత్ర శిక్షకాచార్యకం బన్వయ, స్థితికి మూలంబు సద్గతికి సూత్ర
గౌరవంబునకేక కారణం బున్నత, స్థిరగుణమణుల కాకరము హృదయ
సంతోషమునకు సంజనకంబు భార్యయ, చూవె భర్తకు నొండ్లు గావు ప్రియము

గీ. లెట్టి ఘట్టములను నెట్టి యాపదలను, నెట్టి తీరములను ముట్టఁబడిన
వంతలెల్లఁబాయు నింతుల బ్రజలను, నొనరఁజూడఁగనిన జనులకెందు.

ఇన్నియుఁ జెప్పి చివఱకు నట్టి పతివ్రతదైవమనియే వేదమంగీకరించిన ట్లీగీతికవలనఁ దెలియనగును.

"పాతివ్రత్యము గలిగిన
నాతియనఁగ దైవమన జనస్తుత వేఱే?"

సాధ్విచేఁ జేయఁబడు మహాకార్య మిట్టిదట్టిదని చెప్పుటకన్న శ్రీనాథకవిసార్వభౌమకృతమగు నొక్క గీతమును బేర్కొన్నఁ జాలు.

గీ. తల్లి వంశంబునం దేడు తరములకును
తండ్రి వంశంబునం దేడు తరములకును
ధవుని వశంబునం దేడు తరములకును
శాశ్వత స్వర్గసౌఖ్య మీఁజాలుసాధ్వి.

గృహలక్ష్మికి ముఖ్యముగ క్షమ యుండవలె. ఒక్క క్షమాగుణమున్న నన్నియు నున్నట్లే. దాని సమస్త సద్గుణములు పట్టుబడును. అదియే తృప్తినిచ్చు. భర్త ధనికుఁడైనను నిర్ధనికుఁడైనను భార్య తారతమ్యములను గణింపరాదు. అట్లుగానిచో దినమెల్ల కష్టపడి, యలసి సొలసి, యింటికేగుదెంచు సమయమున భార్య

ఉ. "దూరమువోయి యెండఁబడి దూపిలివచ్చిన ప్రాణనాథునిన్
ద్వారకవాటగేహళులదాఁక నెదుర్కొని తీర్థమార్చి యా
హారమువెట్టి వీడ్యము సమర్పణచేసి విహారశయ్యపై
నూరువులొత్తి చిత్తమునకుబ్బొనరించుట ధర్మమింతికిన్."

అను కవిసార్వభౌముల ధర్మోపదేశము పెడచెవినిఁబెట్టి నగలు నాణెములు లేవనియు మంచి రకరకంబులగు చీరలు లేవనియు వేయేల? యివి లేవవి లేవనియు వాదులాడి చిఱచిఱలాడుచు పెడమొగము పెడమొగము బెట్టినచో భర్త కట్టిజీవితము నరకమునకన్న హేయముగ నుండును. పతి యెట్టివాఁడైనను బతితో నేకీభవించి సంసారశకటమును నడుపు సతియే యిహపరముల రెంటను సౌఖ్యమందఁగలదు. అట్టిది లేనినాఁడు రెంటికినిఁ జెడ్డ రేవడివలె రెండును గోల్పోవును. అట్టి భాగ్యమున్నను లేకున్నను నొకటే. భార్యాభర్తలిద్దఱును రెండు చక్రములవలె, కావడికుండలవలె సమానముగ నున్ననాడే సంసారశకటము కలిమిలేముల స్థితి చక్కఁగ నడచును.

ప్రస్తుత కాలపరిస్థితుల ననుసరించి పురుషుఁడు స్త్రీ సమానమను సిద్ధాంతముతో మన స్త్రీలు మెలఁగుచున్నారు. సంసారచక్రమునందు వీరుభయులు సమానులు; కాని యందుఁగల బాధ్యతలు వేఱు గదా. అట్టులనే యే సమయాన నే సమస్యలో సమానబాధ్యత వహించవలయునో గృహలక్ష్మి గమనించుటలోనే తన సతీధర్మము వెల్లడియగును. కాలమెంతగమారినను నవనాగరికత యెంతగా హెచ్చినను, అభిరుచులలో భేదమెంతగాఁ గలిగినను, భర్త ననుసరించి తిరుగుటయే భార్యకుఁ బ్రధానధర్మము. అప్పట్టున నెట్టి వైపరీత్యమును గలుగదు.

# గృహలక్ష్మి



తన గృహమును సరిదిద్దుకొనగలి
గిన గృహలక్ష్మి, దేశమునంతయు
సరిదిద్దగలదు—గృహిణి యొక్క
జీవితాదర్శము గృహోద్ధరణమే
కాదు ప్రపంచోద్ధరణము గూడ.



శ్రీమతి ఇనుగంటి సరస్వతీదేవి

గృహలక్ష్మి యనఁగా నేమి? ఇల్లాలు - భార్య. గృహమున కలంకారము గృహలక్ష్మి. గృహిణి లేని గృహము వనము. గృహిణియున్నప్పుడే శోభ. కళకాంతులు. పురుషుఁడు కష్టపడి ద్రవ్యార్జనసేయువాఁడు. స్త్రీయే గృహాధికారిణి. భర్త కష్టపడి చెమటకార్చి వేసారి యింటి కరుగుదెంచిన భార్య ప్రేమరసపూరిత వాక్యములతో నుత్సాహపరచిన దెట్టి శ్రమయుఁ గానక భర్త కానందముకలుగును. భరించువాఁడు భర్త, భరింపఁబడునది భార్యకదా! ఇట్టి అనుకూలదాంపత్యము స్వర్గ తుల్యముగ నుండును. లోకకల్యాణోద్ధరణము నిజమైన దంపతులపైననే యాధారపడియున్నది. దాంపత్యాను రాగ మన్నింట నేకమై యనుకూలముగ నుండెనా? తత్సంతాన సుగుణవిశేషమును నల్లియుండును. దేశాభి వృద్ధికి, సంఘాభివృద్ధికి వీరలే మూలకారణములగుదురు. 'యథా రాజా తథా ప్రజా' యనునట్లు యింటి యజమాని గుణసంపత్తిపైననే, నడవడిపైననే భార్యాపుత్రుల నడవడియు నుండును. అనుకూలవతియగు భార్య యున్నచో గృహమును దిద్దుకొనుటయే కాక తన సంతానమునకును పట్టుపడవలసిన విజ్ఞానమును బోధించి దేశమాతకుఁ దగిన పుత్రులనిపించుకొనునట్లు సవరించుకొనగలదు. విమలపాతివ్రత్యధర్మమును తన పుత్రికలకు నుగ్గుపాలనాటనుండియు నలవాటుచేయఁగలదు. కనుక ముఖ్యముగా గృహలక్ష్మిపైననే యింటికి కీర్త్యప కీర్తులు గలుగును.

"ఆతతధర్మార్థ సుఖ
ఖ్యాతులు సద్భార్యవలనఁగాదే కలుగున్."

అను మహాభారత వాక్యమేనాఁడును మఱువంగరానిది. ఒక్క ధర్మార్థకామములకే కాదు, మోక్షప్రాప్తికిఁగూడ సత్సతి హేతువగునని చెప్పుట సాహసముకాదు. ఐహికాముష్మికఫలముల కన్నింటికిఁ దోడు భార్యయే. ధీరోదారగుణరత్నాకరులగు పుత్రులను బడయుటకును, వీరసంతానాభివృద్ధికిని, రెండువంశ ములవారిని తరింపఁజేయఁగల సాధ్వీరత్నములను గాంచుటకును భార్యయే యాధారమని యంగీకరించునాఁడు ఆ యీ సత్కార్యాచరణములచే, ధర్మప్రవర్తనలచే, మోక్షసామ్రాజ్యలక్ష్మియు గృహలక్ష్మివల్లనే లభింపఁ గలదని ఘంటాపథంబుగఁ జెప్పకతప్పదు. ఈ భావమే పంచమవేదమనఁబడు భారతమున విశదీకరింపఁబడినది.

సీ. ధర్మార్థకామసాధన ముపకరణంబు, గృహనీతి విద్యకు గృహము విమల
చారిత్ర శిక్షకాచార్యకంబన్వయ, స్థితికి మూలంబు సద్గతికి సూత్ర
గౌరవంబునకేక కారణం బున్నత, స్థిరగుణమణుల కాకర ము హృదయ
సంతోషమునకు సంజనకంబు భార్యయ, చూవె భర్తకు నొండ్లు గావు ప్రియము

గీ. లెట్టి ఘట్టములను నెట్టి యాపదలను, నెట్టి తీరములను ముట్టఁబడిన
వంతలెల్లఁబాయు నింతుల బ్రజలను, నొనరఁజూడఁగనిన జనులకెందు.

ఇన్నియుఁ జెప్పి చివఱకు నట్టి పతివ్రతదైవమనియే వేదమంగీకరించిన ట్లీగీతికవలనఁ దెలియనగును.

"పాతివ్రత్యము గలిగిన
నాతియనఁగ దైవమన జనస్తుత వేఱే?"

సాధ్విచేఁ జేయఁబడు మహాకార్య మిట్టిదట్టిదని చెప్పుటకన్న శ్రీనాథకవిసార్వభౌమకృతమగు నొక్క గీతమును బేర్కొన్నఁ జాలు.

గీ. తల్లి వంశంబునం దేడు తరములకును
తండ్రి వంశంబునం దేడు తరములకును
ధవుని వశంబునం దేడు తరములకును
శాశ్వత స్వర్గసౌఖ్య మీఁజాలుసాధ్వి.

గృహలక్ష్మికి ముఖ్యముగ క్షమ యుండవలె. ఒక్క క్షమాగుణమున్న నన్నియు నున్నట్లే. దాని సమస్త సద్గుణములు పట్టుబడును. అదియే తృప్తినిచ్చు. భర్త ధనికుఁడైనను నిర్ధనికుఁడైనను భార్య తారతమ్యమును గణింపరాదు. అట్లుగానిచో దినమెల్ల కష్టపడి, యలసి సొలసి, యింటికేగుదెంచు సమయమున భార్య

ఉ. "దూరమువోయి యెండఁబడి దూపిలివచ్చిన ప్రాణనాథునిక
ద్వారకవాటగేహళులదాఁక నెదుర్కొని తీర్థమార్చి యా
హారమువెట్టి వీడ్యము సమర్పణచేసి విహారశయ్యపై
నూరువులొత్తి చిత్తమునకబ్బానరించుట ధర్మమింతికిన్."

అను కవిసార్వభౌముల ధర్మోపదేశము చెడచెవినిఁబెట్టి నగలు నాణెములు లేవనియు మంచి రకరకంబులగు చీరలు లేవనియు వేయేల? యివి లేవవి లేవనియు వాదులాడి చిఱచిఱలాడుచు చెడమొగము పెడమొగము బెట్టినచో భర్త కట్టిజీవితము నరకమునకన్న హేయముగ నుండును. పతి యెట్టివాఁడైనను బతితో నేకీభవించి సంసారశకటమును నడుపు సతియే యిహపరముల రెంటను సౌఖ్యమందఁగలదు. అట్టిది లేనినాఁడు రెంటికినిఁ జెడ్డ రేవడివలె రెండును గోల్పోవును. అట్టి భాగ్యమున్నను లేకున్నను నొకటే. భార్యాభర్త లిద్దఱును రెండు చక్రములవలె, కావడికుండలవలె సమానముగ నున్ననాడే సంసారశకటము కలిమిలేముల స్థితి చక్కఁగ నడచును.

ప్రస్తుత కాలపరిస్థితుల ననుసరించి పురుషుఁడు స్త్రీ సమానమను సిద్ధాంతముతో మన స్త్రీలు మెలంగుచున్నారు. సంసారచక్రమునందు వీరుభయులు సమానులు; కాని యందుఁగల బాధ్యతలు వేఱుగదా. అట్టులనే యే సమయాన నే సమస్యలో సమానబాధ్యత వహింపవలయునో గృహలక్ష్మి గమనించుటలోనే తన సతీధర్మము వెల్లడియగును. కాలమెంతగమారినను నవనాగరికత యెంతగా హెచ్చినను, అభిరుచులలో భేదమెంతగాఁ గలిగినను, భర్త ననుసరించి తిరుగుటయే భార్యకుఁ బ్రధానధర్మము. అప్పట్టున నెట్టి వైపరీత్యమును గలుగదు.

# గృహలక్ష్మి

"సతులకేడుగడయుఁ బతుల చూవె."

కనుక భర్త యనుమతితో నెట్టి పని వెంటనంటి చేసినను ధర్మమునకు దూరముగాదు.

"మంచి పనియైనఁ బ్రాణేశు మనసురాని
పనులు మానుట భద్రంబు వనితలకును"

అని యేనాఁడో దూరదృష్టి గమనించి చెప్పిన పెద్దలవాక్కులను గాదందురా. మనప్రాచీన సిద్ధాంతములన్నియు ఛాయాకాలములకు సరిపడునట్లెగాక సర్వకాల సర్వావస్థలయందును యుగయుగముల వారికి సరిపడునట్లు బ్రహ్మజ్ఞానవేత్తలచేఁ జెప్పఁబడినవి. మనప్రాచీనుల సాంప్రదాయము అజ్ఞానాంధకారమున మునిఁగి మనము గుర్తింపలేకున్నారము. ఈనాఁడెన్ని మార్పులువచ్చినను నిజముగ మనజీవితము లాదర్శకముగ నుండుటకుఁ జెప్పఁజాలువారొక్కరును లేరనుట సాహసవాక్యమని తలంపవలదు. కోటికొక్కరున్నను లాభమేమి? మన ప్రాచీనకాలమెంతగా సతీమణుల పరమపావన ప్రవర్తనలచే శోభిల్లినదో యొక్కసారి వెనుకకు దిరిగిచూచిన జ్ఞప్తికివచ్చు. ఈనాడు స్త్రీసంఘము సర్వసమస్యలందును పాల్గొను చున్నదనుట తప్పని చెప్పుట కీవ్యాసము వ్రాయుటలేదు. ఆనాఁడును గృహముమొదలు రణరంగమువఱకు భార్యలు భర్తలకన్నిట సాయపడుచు వచ్చుచుండిరి. కాని పురుషులను గాదని స్వేచ్ఛగసంచరించిన వారలెవరునులేరు. ఏకార్యమునకైనను నొకనియందు బాధ్యతయుండవలె. కనుక గృహసందర్భమును జెప్పునాఁడు, గృహలక్ష్ముల ప్రసక్తి వక్కాణించునాఁడు తమతమ మగవారలపై నిలచి యుండుననుమాట రూఢిగనమ్మవలె. అప్పుడే మనమన యభీష్టములు నెరవేరి సర్వకార్యములయందు జయముగలుగును. పురుషులకుఁదోడునీడవలె స్త్రీలు సంచరించుటయే ధర్మము. తనపురుషునికంటె వేఱుదైవము స్త్రీకి లేదు. ఒక్క మాట,ఒక్క నమ్మకము,ఒక్క దైవము, ఒక్క భక్తి, ఒక్క నిలకడయుండవలెఁగాదా. అదియే సర్వకార్యసిద్ధికిఁదోడ్పడు. ఒక్కనిబుద్ధితోఁబనియేల యని స్వేచ్ఛగా సంచరించిననాఁడు సతికెట్టి గౌరవములేదు. ఎట్టికార్యమును నెరవేరదు. పైపెచ్చు అపనిందయే మిగులును. అట్లుగాక "పతిగడవంగ దైవతము భామలకెందునులేదు" అని త్రికరణశుద్ధిగ సంచరించిన నాఁడు తనలోకమును నుద్ధరింపఁగలుగుటయేకాక, తన స్త్రీసంఘ మభివృద్ధిలోనికిఁ దేఁజాలుశక్తిని గాంచుటయే కాక పురుషులకుసైతము తననడవడి ఒరవడివలె నాదర్శకముగ నుండునట్లొనర్చుటయెకాక, "భాసురభూషణాంబరాన్విత ధనధాన్యగౌరవము విశ్రుతసంతతియున్ యశంబుసద్గతియునుగల్గు" నట్లు నిర్ధారణచేయగలదు. స్త్రీ తానుచేయవలసిన ధర్మమెఱుంగక విడాకు లిచ్చినంతమాత్రమున నుపన్యాస వేదికలపై నిలబడి ధర్మోపదేశములు చేసినంతమాత్రమున నేమగును? లలాటలిఖితరేఖ మార్పజాలరని గంభీరముగ మెట్టవేదాంతము కురిపించినను లాభములేదు. గొప్పఐశ్వర్యముతోఁబనిలేదు. గృహలక్ష్ములకుఁ బ్రధానభూషణములు శాంతము, సత్యము, తృప్తి, నిరాడంబరప్రవృత్తి, ఇన్నిఁటఁదులతూగి గృహమునకు వన్నెతెచ్చునదియే గృహలక్ష్మి. తన గృహముసరిగ దిద్దుకొగలిగిననాఁడు ప్రపంచమందుండు గృహములన్నిఁటిని దిద్దఁగలుగు. అట్టిగృహలక్ష్మి ప్రపంచమున కాదర్శకముగనుండు. కాన వనితామణులెల్ల నిగర్వశిఖామణులై, శాంతచిత్తలై, సాధ్వీశిరోరత్నములై తనరారునాడు భారతదేశ సౌభాగ్యభాగ్యాభివృద్ధి నాఁడునాఁటికిఁ గన్నులబండువుగనుండు. దేశమున కలంకారభూతులు గృహలక్ష్ములే.

# లక్ష్మీ సరస్వతులు

ఈ అత్త కోడండ్రకు బొత్తిగా పొత్తు కుదరదనుట ఏటి సిద్ధాంతము? ధన
మున్న వారికి విద్యలేదా? విద్యావంతులు ధనికులుగారా? లక్ష్మీ
సరస్వతుల కటాక్షములందు ఈ భేధములేదని నాటికాల
మున, నేటికాలమున కొన్ని నిదర్శనములు – గాని,
ఇది ఛలోక్తికి మాత్రముగాదు.

## ● లక్ష్మీ సరస్వతులు ●

నామ మాత్రమున లక్ష్మియనియు సరస్వతియనియు భేదముకనఁబడు చున్నదిగాని సూక్ష్మదృష్టినిఁ జూచిన యాత్మజ్ఞాన తత్త్వవేత్తలకు వీరిరువుర యందును తారతమ్యము గానరాదు. త్రిమూర్తుల కన్నింట నభేదమేకదా! అట్లులే ఉమాలక్ష్మి సరస్వతులకును భేదములేదు. మానవత్వమునఁ దత్త్వమెఱుంగక మనలో మనమేర్పఱచు కొనిన భేదబుద్ధియేయిది. వివాదములకు, కాలక్షేపములకు, ఊబుసుపోకలకు నిట్టి వాదములు పనికివచ్చును. అవతార భేదములనుబట్టి రాముఁడనియుఁ గృష్ణుఁడనియు నెట్లు నామమాత్రమున మార్పుజెందెనో యట్లే వారివారికార్య నిర్వాహకత్వమున వివిధనామములను ధరింపవలసిన వారలైరి. కడియమన్నను, కంకణ మన్నను మరేమన్నను రూపమునఁ బేరున భేదమేకాని వాస్తవము వస్తు వొకటియే. సౌకర్యార్థమై, వ్యావహారికమునకై వివిధనామములు మనసంతతికినిచ్చు చుండుటలేదా! తల్లిదండ్రులకుఁ సత్సంతాన సంతతియుండి సుమంతలైనను భేదముండునా! అదియటులుండ లక్ష్మి సరస్వతులు అత్త కోడండ్రులైరని యీకాలమునను సరించి వారలకుగూడ భేదబుద్ధి యారోపణచేయుట న్యాయమా! అత్తకోడండ్రకు బొత్తిగా సరిపడదనుట యేటిసిద్ధాంతము? మూర్ఖవాదమునకుఁ దావిచ్చి, బలమిచ్చి, పోషించి నిర్హేతుకముగఁ గుటుంబ కలహములను బెంచి సౌఖ్యహాని కలుగఁజేసికొనుటకే కాని మరెట్టి యుపయోగమున కీవాద మక్కరకురాదు. పై పెచ్చు లేని యీర్ష్యావేదనమునకు స్థానము గల్పించి మనశ్శాంతికి భంగము కలిగించుకొనుటయు నగును. ఏవిధమునఁ జూచినను లక్ష్మి సరస్వతులొక్కచోట నుండవను టసంభవము. లక్ష్మి యనగా ధనమనియు సరస్వతి యనగా విద్యయనియుఁ గదా రూఢిమాట! ఒక్కొక్కశాఖ యొక్కొక్కరి యధీనమున నుండుట మేలని లోకవృత్తాంతములను జూచిన మనమంగీకరింతుముగదా. కుటుంబ నిర్వహణ బాధ్యత యజమానునిపై నున్నట్లే ధనాధీశ్వరి లక్ష్మియయ్యె. విద్యాధీశ్వరి సరస్వతియయ్యె. ఆ జగదాంబలు తమతమ పుత్రులకు పుత్రికలకు రెంట సమానభాగమిచ్చి సమానదృష్టినే చూచుచుందురు. కాని కర్మానుభవము, కర్మసిద్ధాంతము బ్రహ్మాదులకును దప్పకపోవుటచే వారివారి ప్రాక్కర్మల ననుసరించి లక్ష్మి సరస్వతీ భాగ్యములబ్బుచుండును. అంతియ కాని యీ భేదముగాని యీ వైరముగాని లక్ష్మి సరస్వతీ కటాక్షములయందు లేదు—ముమ్మాటికిని లేదు. ధనమున్నవారికి విద్యలేదా? విద్యావంతులు ధనికులుగారా? ఈ విచిత్రకల్పన యేల? లేక చదువున్నచోట

ధనముండదని చెప్పుదురా? ధనమున్నచోట విద్య శూన్యమందురా? ఈ రెండును బొసఁగవని చెప్పుట కాధారమేది? ఈ రెంటికిని పొత్తు సమానముగ నుండఁగలదని నాఁటికాలమున నేఁటికాలమునఁ గొన్ని నిదర్శనములు చూపఁగలము. అవి కాదనువారలుండరుగదా. విషయమెఱుంగుటకు, యెఱింగినదానిని తిరిగి క్రొత్తఁజేసికొనుటకు, గుణగ్రహణముకొఱకు మా సోదర సోదరీమణులకుఁ జెప్పుటకుమాత్రమే యీ వ్యాస రచనోద్దేశముగాని లేదని చెప్పువారికిది సమాధానమగునని కాదు. ఛలోక్తికై కూడ కాదు.

విద్యయనఁగా నవిద్యను బోఁగొట్టునది. అనఁగా నజ్ఞానమును బారఁదోలునది. అట్టి విద్యను బొందియు నొకచోఁ బ్రారబ్ధకర్మంబున ధనలోపము సంభవించిన నా లోపము, మన కర్మము వారల కంటఁ గట్టుదురా? దానమనదుష్కర్మ తొలఁగిపోవకుండుటయె కాక పరమార్థసాధకమున కడ్డుతగులు పాపము మూటఁగట్టుకొనునట్లగును. కొంచెము జ్ఞానమెఱింగినవారలిట్టివి స్వబుద్ధిచేఁ గలిగించుకొనరాదని చెప్పుటకే కాని 'బుద్ధిః కర్మానుసారిణీ' యనునది కాదనుటకుఁ గాదు. మఱొక్క చిన్న విషయమును గమనింపుడు. లోకములో మొద్దులు, బండలు, నిరక్షరకుక్షులు ఎందఱు లేరు? అట్టివారినిఁగూర్చి సరస్వతికి దయలేక పోయినదని చింతించుచున్నారా? చదువురాలేదని వాపోవువారలెందఱున్నారు? ఆ యపవాదము సరస్వతి కేల యంటఁగట్టరు? 'వాడిఖర్మం చదువురాలే'దని ఒక్కమాటలోఁ దృప్తిపొందుటయే మనము చూచు చున్నారము. లక్ష్మి విషయ మట్లుగాక యానేర మా జననిపైననే పెట్టుట లోకవిదితము. దీనినిఁబట్టియే పక్షపాత మనంబున నీర్ష్యావేశ జనితంబుననే మన లోపమున్యులపైఁ బడవేయుచున్నట్లు పొడఁగట్టు. అందుచే లక్ష్మీ సరస్వతుల కెయ్యెడలను బొత్తు కలియు టసంభవముకాదనుట సత్యదూరమే. వారలకుండు నన్యోన్యాను రాగము వర్ణనాతీతము. తల్లి కూతురుల ప్రేమకంటె నత్తకోడండ్ర యనురక్తియే యెక్కుడు. రెండును రెండు కళలు; కాని యొక్కకళకుఁ జేరినవే. ఎన్ని రాజాస్థానములు; ధనవంతుల పేరోలగములు సరస్వతీ సంపన్నులకు గౌరవాదరములు కూర్చుటలేదు? లక్ష్మి కీర్ష్యయున్న విద్యావంతుల నేల గౌరవించును? క్రీగంటనైనను జూడదుగదా.

ఇది యటులుండ విద్యాధనములు రెండును నొకరిసొమ్మే యనుట కీయుదాహరణంబులు చాలును. లక్ష్మీ సరస్వతులు కలసి మెలసి స్పర్ధలావంతయులేక యెన్ని రాజాస్థానముల నాట్యమాడుట లేదు? శ్రీ రాజరాజనరేంద్ర, భోజ, కృష్ణదేవరాయ ప్రభుచంద్రములు లక్ష్మీసంపన్నులగుటయే కాక కేవల సరస్వతులనియే ప్రఖ్యాతిఁగాంచినవారలుగదా. నిదర్శనంబులు స్వల్పములని విషయమును ద్రోసి రాజు చేయవలదు. అత్తకోడండ్రకుఁ గలిమిడియున్నదా లేదా యనియే విషయప్రసక్తి. ధనికులు విద్వాంసులను గౌరవించుటలేదా? అనఁగా లక్ష్మి చదువరులను నాదరించి ప్రేమించి కౌగిలించుటగదా. భోజనరేంద్రుని మొగముజూచిన కవిత్వము వచ్చుననుమాట కల్పితమా? ఆ మహాలక్ష్మీసంపన్నుని కింతటి విద్య యెక్కడ నుండి వచ్చె? లక్ష్మీ సరస్వతులు వాదములాడుకొని చివరికొక్కనియందే ప్రవేశించిరి కాఁబోలు. లేదా ఆ ధీరోదాత్తగుణాకరుఁడా రెంటిని తనవశములో నుంచుకొనఁగలిగెనేమో? ఎట్టులనైననేమి యెడమొగము పెడమొగము పెట్టుకొనక యొకట లక్ష్మీ సరస్వతీ విగ్రహములు కాపురముండె. నేఁటికాలమునఁ జూత మందురా? శ్రీ రాజా విక్రమదేవవర్మగారు, శ్రీ రాజా భుజంగరాయ బహద్దరుగారు, కీర్తిశేషులైన శ్రీ సురభి రాజా మల్లభూపాలోత్తములును సరస్వతీ సంపన్నులగుటయే కాక మహాకవులునుగూడ నైరి. శ్రీ రాజా వాడ్రేవు విశ్వసుందరరావుగా రాంధ్రాంగ్లములయందుఁ బండితులు. ఈ మహాప్రభువుల యింట నత్తకోడండ్ర వైరమెక్కడిది?

ఇంతవఱకు లక్ష్మీసంపన్నులకడ విద్యావిభవంబు కలదని చెప్పికొంటిమి - ఈపైన రెండవపక్షమును దర్శింతుముగాక. బ్రహ్మశ్రీ వసురాయ కవిశేఖరుఁడు లక్ష్మీ సరస్వతీ సంపన్నుఁడై సహస్రమాసజీవియై యశఃకాయమున వెలుంగుచున్నవాఁడుగదా.

సీ. అనుభవించితిమి దీప్యద్భోగములను రాజాధిరాజులకన్న నధికముగను
ఆర్జించితిమి యింత నతిథులకిడి మేము ననుభవింపఁగఁజాలు నట్టి వృత్తి...

అని చెప్పికొనిన తిరుపతి వేంకటేశ్వర శ్రీ సంపత్తి ప్రత్యేకించి చెప్పనక్కరలేదు. కవితా సామ్రాజ్యమునకు వీరలే చక్రవర్తులుగదా!

ప్రొద్దుటూరులోఁ జుక్కలమధ్య చంద్రునివలెఁ బ్రకాశించుచున్న రాణాప్రతాపసింహచరిత్రాది మహాగ్రంథములను రచించిన కళానిధి రాజశేఖర శతావధానిగారు యాచకులను ధనికులుగఁ జేయఁగల భాగ్యవంతులు.

సీ. రాజరాజేంద్ర సామ్రాజ్యభోగములందు నన్నయభట్టు పాల్గొన్నవాఁడు
మనుమసిద్ధిశక్షమాచక్ర మరుదారఁ దిక్కన్న తనచేతఁ ద్రిప్పినాడు
వీరభద్రారెడ్డి విరివియౌ విభవంబు శ్రీనాథుఁడెంతొ భుజించినాడు
రాయలయొద్ద గౌరవమొందఁ బెద్దన్న యెక్కి యందలము నూరేగినాడు.

అను వనరాయ కవిశేఖరుల భావములు యథార్థములుగదా. ఆ మహాకవులు వరప్రసాదమూర్తులు. వాక్సిద్ధికలవారు. కేవలము సరస్వతీ యవతారస్వరూపులే యని చెప్పవచ్చు. అట్టివారలకడ ధనలక్ష్మి తనంతఁ దావచ్చి కాపురముండె.

కనుక లక్ష్మీ సరస్వతుల కెందును వైరములేదు. విద్యాలక్ష్మి వాగ్లక్ష్మియై, కావ్యలక్ష్మియై, యశోలక్ష్మియై విరాజిల్లు.

సంఘాభివృద్ధికిని, దేశసేవకును, దీనజనోద్ధరణమునకును, కార్యసాధనమునకును, లోకమున నావరించిన యజ్ఞానాంధకారమును దొలగించుటకును, తత్త్వపీఠముల నుద్ధరించుటకును, పతితులైన తోడిమానవులఁ బైకి నెత్తుటకును లక్ష్మీ సరస్వతీ సంపన్నులిరువురు కలసినకదా యేతన్నిర్వాహరణ మొనరించుట.

మన భారతదేశము లక్ష్మీ సరస్వతీ కరుణాకటాక్ష వీక్షణ శ్రీలచే ఖండాంతరములకంటె నొకచూపెక్కుడుగ నన్నిఁట నభివృద్ధిగ నుండుఁగాక!

అత్త కోడండ్ర కలిమిడిచేఁ గుటుంబములన్నియు నైకమత్యమున మెలంగి యేతత్సతీమతల్లులచే భారతదేశ సౌభాగ్యభాగ్య విద్యాసంపత్తి నాఁడునాఁడును వర్ధిల్లుఁగాక!

# మ లే రి యా

## అం టు వ్యా ధి

ఇంతకుపూర్వము మలేరియా అంటువ్యాధి ప్రబలినపుడు హార్లిక్సు ధారాళముగా ఉపయోగింపబడెను. దీనినుండి మితిలేని తృప్తి, గుణము కలిగినది. రోగులు ఆహారవిషయము ముఖ్యముగా గమనించవలసినది. జ్వరపు విషము నరస్నాయువులలో ప్రవేసించి రోగిని నిశ్శక్తునిగా జేయును. కడుపు బలహీనముగా నుండుటచే ఏ ఘన ఆహారమును సహించదు. ఇట్టి సంధర్భమున హార్లిక్సు యోగ్యమైన ఆహారమని డాక్టర్లు గ్రహించినారు. ఇది జీర్ణకోశమునకు ఏలాంటి హాని కలుగజేయదు. ఇది వందకువంద పుష్టినిచ్చునది గాన, కోల్పోయిన శక్తి సామర్థ్యమును త్వరలో చేకూర్చును. జ్వరమునుండి రక్షణ పొందుటకు ప్రతియింటను హార్లిక్సు తప్పక యుండవలసినది.

ధనముండదని చెప్పుదురా? ధనమున్నచోట విద్య శూన్యమందురా? ఈ రెండును బొసఁగవని చెప్పుట కాధారమేది? ఈ రెంటికిని పొత్తు సమానముగ నుండఁగలదని నాఁటికాలమున నేఁటికాలమునఁ గొన్ని నిదర్శనములు చూపఁగలము. అవి కాదనువారలుండరుగదా. విషయమెఱుంగుటకు, రొుఱింగినదానిని తిరిగి క్రొత్తఁజేసికొనుటకు, గుణగ్రహణముకొఱకు మా సోదర సోదరీమణులకుఁ జెప్పుటకుమాత్రమే యీ వ్యాస రచనోద్దేశముగాని లేదని చెప్పువారికిది సమాధానమగునని కాదు. ఫలోక్తికైకూడ కాదు.

విద్యయనఁగా నవిద్యను బోఁగొట్టునది. అనఁగా నజ్ఞానమును బారఁదోలునది. అట్టి విద్యను బొందియు నొకచోఁ బ్రారబ్ధకర్మంబున ధనలోపము సంభవించిన నా లోపము, మన కర్మము వారల కంటఁ గట్టుదురా? దానమనదుష్కర్మ తొలఁగిపోవకుండుటయె కాక పరమార్థసాధకమున కడ్డుతగులు పాపము మూటఁగట్టుకొనునట్లగును. కొంచెము జ్ఞానమెఱింగినవారలిట్టివి స్వబుద్ధిచేఁ గలిగించుకొనరాదని చెప్పుటకే కాని 'బుద్ధిః కర్మానుసారిణీ' యనునది కాదనుటకుఁ గాదు. మఱొక్క చిన్న విషయమును గమనింపుడు. లోకములో మొద్దులు, బండలు, నిరక్షరకుక్షులు ఎందఱు లేరు? అట్టివారినిఁగూర్చి సరస్వతికి దయలేక పోయినదని చింతించుచున్నారా? చదువురాలేదని వాపోవువారలెందఱున్నారు? ఆ యపవాదము సరస్వతి కేల యంటఁగట్టరు? 'వాడిఖర్మం చదువురాలే'దని ఒక్కమాటలోఁ దృప్తిపొందుటయే మనము చూచు చున్నారము. లక్ష్మి విషయ మట్లుగాక యా నేర మా జననిపైననే పెట్టుట లోకవిదితము. దీనినిఁబట్టియే పక్షపాత మనంబున నీర్ష్యావేశ జనితంబుననే మన లోపమన్యులపైఁ బడవేయుచున్నట్లు పొడఁగట్టు. అందుచే లక్ష్మీ సరస్వతుల కెయ్యెడలను బొత్తు కలియు టసంభవముకాదనుట సత్యదూరమే. వారలకుండు నన్యోన్యాను రాగము వర్ణనాతీతము. తల్లి కూతురుల ప్రేమకంటె నత్తకోడండ్ర యనురక్తియే యెక్కుడు. రెండును రెండు కళలు; కాని యొక్కకళకుఁ జేరినవే. ఎన్ని రాజాస్థానములు; ధనవంతుల పేరోలగములు సరస్వతీ సంపన్నులకు గౌరవాదరములు కూర్చుటలేదు? లక్ష్మీ కీర్ష్యయున్న విద్యావంతుల నేల గౌరవించును? క్రీగంటనైనను జూడదుగదా.

ఇది యటులుండ విద్యాధనములు రెండును నొకరిసొమ్మే యనుట కీయుదాహరణంబులు చాలును. లక్ష్మీ సరస్వతులు కలసి మెలసి స్పర్ధలావంతయులేక యెన్ని రాజాస్థానముల నాట్యమాడుట లేదు? శ్రీ రాజరాజనరేంద్ర, భోజ, కృష్ణదేవరాయ ప్రభుచంద్రములు లక్ష్మీసంపన్నులగుటయే కాక కేవల సరస్వతులనియే ప్రఖ్యాతిఁగాంచినవారలుగదా. నిదర్శనంబులు స్వల్పములని విషయమును ద్రోసి రాజు చేయవలదు. అత్తకోడండ్రకుఁ గలిమిడియున్నదా లేదా యనియే విషయప్రసక్తి. ధనికులు విద్వాంసులను గారవించుటలేదా? అనఁగా లక్ష్మి చదువరులను నాదరించి ప్రేమించి కౌగిలించుటగదా. భోజనరేంద్రుని మొగముజూచిన కవిత్వము వచ్చుననుమాట కల్పితమా? ఆ మహాలక్ష్మీ సంపన్నుని కింతటి విద్య యెక్కడ నుండి వచ్చె? లక్ష్మీ సరస్వతులు వాదములాడుకొని చివరికొక్కనియందే ప్రవేశించిరి కాఁబోలు. లేదా ఆ ధీరోదాత్తగుణాకరుఁడా రెంటిని తనవశములో నుంచుకొనఁగలిగెనేమో? ఎట్టులనైననేమి యెడమొగము పెడమొగము పెట్టుకొనక యొకట లక్ష్మీ సరస్వతీ విగ్రహములు కాపురముండె. నేఁటికాలమునఁ జూత మందురా? శ్రీ రాజా విక్రమదేవవర్మగారు, శ్రీ రాజా భుజంగరాయ బహద్దరుగారు, కీర్తిశేషులైన శ్రీ సురభి రాజా మల్లభూపాలోత్తములును సరస్వతీ సంపన్నులగుటయే కాక మహాకవులునుగూడ నైరి. శ్రీ రాజా వాడ్రేవు విశ్వసుందరరావుగా రాంధ్రాంగ్లములయందుఁ బండితులు. ఈ మహాప్రభువుల యింట నత్తకోడండ్ర వైరమెక్కడిది?

ఇంతవఱకు లక్ష్మీసంపన్నులకడ విద్యావిభవంబు కలదని చెప్పికొంటిమి. ఈపైన రెండవపక్షమును దర్శింతుముగాక. బ్రహ్మశ్రీ వసురాయ కవిశేఖరుఁడు లక్ష్మీ సరస్వతీ సంపన్నుఁడై సహస్రమాసజీవియై యశఃకాయమున వెలుంగుచున్నవాఁడుగదా.

సీ. అనుభవించితిమి దీప్యద్భోగములను రాజాధిరాజులకన్న నధికముగను
ఆర్జించితిమి యింత నతిథులకిడి మేము ననుభవింపఁగఁజాలు నట్టి వృత్తి...

అని చెప్పికొనిన తిరుపతి వేంకటేశ్వర శ్రీ సంపత్తి ప్రత్యేకించి చెప్పనక్కరలేదు. కవితా సామ్రాజ్యమునకు వీరలే చక్రవర్తులుగదా!

ప్రొద్దుటూరులోఁ జుక్కలమధ్య చంద్రునివలెఁ బ్రకాశించుచున్న రాణాప్రతాపసింహచరిత్రాది మహాగ్రంథములను రచించిన కళానిధి రాజశేఖర శతావధానిగారు యాచకులను ధనికులుగఁ జేయఁగల భాగ్యవంతులు.

సీ. రాజరాజేంద్ర సామ్రాజ్యభోగములందు నన్నయభట్టు పాల్గొన్నవాఁడు
మనుమసిద్ధీశక్ష్మాచక్ర మరుదారఁ దిక్కన్న తనచేతఁ ద్రిప్పినాడు
వీరభద్రారెడ్డి విరివియౌ విభవంబు శ్రీనాథుఁడెంతో భుజించినాడు
రాయలయొద్ద గౌరవమొందఁ బెద్దన్న యెక్కి యందలము నూరేగినాడు.

అను వనురాయ కవిశేఖరుల భావములు యథార్థములుగదా. ఆ మహాకవులు వరప్రసాదమూర్తులు. వాక్సిద్ధికలవారు. కేవలము సరస్వతీ యవతారస్వరూపులే యని చెప్పవచ్చు. అట్టివార్లకడ ధనలక్ష్మి తనంతఁ దావచ్చి కాపురముండె.

కనుక లక్ష్మి సరస్వతుల కెందును వైరములేదు. విద్యాలక్ష్మి వాగ్లక్ష్మియై, కావ్యలక్ష్మియై, యశోలక్ష్మియై విరాజిల్లు.

సంఘాభివృద్ధికిని, దేశసేవకును, దీనజనోద్ధరణమునకును, కార్యసాధనమునకును, లోకమున నావరించిన యజ్ఞానాంధకారమును దొలగించుటకును, తత్త్వపీఠముల నుద్ధరించుటకును, పతితులైన తోడిమానవులఁ బైకి నెత్తుటకును లక్ష్మి సరస్వతీ సంపన్నులిరువురు కలసినకదా యేతన్నిర్వహణ మొనరించుట.

మన భారతదేశము లక్ష్మి సరస్వతీ కరుణాకటాక్ష వీక్షణ శ్రీలచే ఖండాంతరములకంటె నొకచూపెక్కుడుగ నన్నిఁట నభివృద్ధిగ నుండుఁగాక!

అత్త కోడండ్ర కలిమిడిచేఁ గుటుంబములన్నియు నైకమత్యమున మెలంగి యేతత్సతీమతల్లులచే భారతదేశ సౌభాగ్యభాగ్య విద్యాసంపత్తి నాఁడునాఁడును వర్ధిల్లుఁగాక!

# పట్టాభిషేక మహోత్సవము

## శ్రీ శ్రీ శ్రీ జయచామరాజ ఒడయర్ వారు

### మైసూరు సింహాసనము నలంకరించిననాటి దృశ్యములు



మహారాజ శ్రీ శ్రీ శ్రీ జయచామరాజ ఒడయార్ వారి పట్టాభిషేక మహోత్సవము మైసూరులో నతివైభవముగా, శాస్త్రోక్తముగా గత మాసము జరిగియున్నది.

పట్టాభిషేకమునకు తొలిరోజున కాశీనుండి గంగాతీర్థము తెప్పించి, కనకమయ పాత్రలలో నింపి పూజించి రజితమయ పల్లకీయందుంచి సత్తనత్ సవారీలతో గజాశ్వంబులతో భేరీ మురజాది తూర్యఘోషంబులతో యూరేగించి సమస్థానమునకు కొనితేబడినది.

తరువాత పట్టాభిషేకమురోజున వేకువజామునసే మహారాజాగారు, బ్రాహ్మణ ముత్తైదువల మంగళగీతంబులు వెలంగ, సంపెంగ తైలంబుతో శిరసంటి మంగళస్నానంబు గావించి జిలుగైన

మహాతాపీ వస్త్రాలంకృతులై రత్నఖచితకంకణ కేయూరములు, నవరత్నహారములు అలంకరించి, చెలువైన తలపాగజుట్టి, తమ కులదేవతయగు చాముండీశ్వరికి భక్తిప్రణామంబుతో పూజలు సల్పిరి.

తరువాత శాస్త్రోక్తముగా బ్రాహ్మణోత్తముల వేదఘోషంబులు చెలంగ పురోహితాది మంత్రివర్గంబులతోగూడి వంశపారంపర్యముగా జరుగుచుండు హోమాది కార్యకలాపములను నెరవేర్చి, కంకణము ధరించి దీక్షవహించి మహారాజుగారు బయటికివచ్చిరి.

అచ్చట బంగారు నగలతో శృంగారించబడిన భద్రగజంబునకును, భద్ర అశ్వంబునకును పూజలు చేసిన పిదప రాజ్యాభిషేక మహోత్సవమునకు ఆహ్వానితులైన, సకల రాజశ్రేష్ఠులును, సామంతులును, గౌరవోద్యోగస్థులును, పండిత ప్రవరులును, వేదవేదాంగ పారంగతులును పురప్రముఖులును వచ్చి నిండియుండు దర్బారు హాలునకు పరివారసహితంబుగా దయజేసిరి.



అశ్వారూఢులైన శ్రీ జయచామరాజ ఒడయర్ బహద్దరువారు
(చిన్నతనమున)

అటకు వచ్చుటకు పూర్వము అందరి సముఖంబున రాజగురువులగు వైష్ణవమతాచార్యులు పరకాల మఠాధిపతివారికి భక్తిపురస్సరముగా పాదపూజలొనరించి ప్రణామంబులు గావించి వారి శుభాశీర్వచనంబులవడసి, మహారాజుగారు దర్బారుహాలులో ప్రవేశించి రత్నసింహాసనమునకు దగ్గరనే అమర్చబడిన పీఠమునం దాసీనులైరి.

వేదఘోషంబులును, మంగళవాద్యంబులును మారుమ్రోగుచుండగా పవిత్రమైన గంగాతీర్థకలశంబులు మహారాజావారిముందు బెట్టబడినవి. అతి వైభవోపేతమైన సమయమున ఐదుగురు బ్రాహ్మణశ్రేష్ఠులు మామిడి ఆకులతో గంగాతీర్థమును మహారాజుగారి శిరస్సుపై చల్లి ఆశీర్వదించిరి. తరువాత ఐదుగురు క్షత్రియ శ్రేష్ఠులును, ఐదుగురు వైశ్య శ్రేష్ఠులునుకూడ తీర్థమును చల్లిరి.

## పట్టాభిషేక మహోత్సవము

తరువాత అచ్చటనుండి భద్రసింహాసనమును సమీపించి మంత్రి పురోహితులతో సింహాసనమునకు పూజలొనర్చిరి. మైసూరు సమస్థానములోనుండు రాజప్రతినిధి హస్తావలంబనముతో శ్రీ శ్రీ మహారాజు గారు భద్రసింహాసనంబుపై అధిరోహించిరి. వృద్ధబ్రాహ్మణ ఆశీర్వాదంబులతో మహారాజుగారు సింహాసనాసీనులైరి. రాచకీయ యుద్యోగులును, సైనికోద్యోగులును వారివారి గౌరవమర్యాదలను ఉచితరీతి చెల్లించి సత్కరించిరి.

ఆ నాటి సాయంత్రము మరల శ్రీ శ్రీ మహారాజాగారు సింహాసనంబున పద్మాసనులై కూర్చుండి యుండ, సైనికుల కవాతు ప్రదర్శనములును, బాణవేడుకలును అద్భుతముగా జరిగినవి. ప్రేక్షకుల కానంద దాయకంబై, కన్నులపండువై మహా వైభవముగా మహోత్సవము సంపూర్ణమయ్యెను.



శ్రీ మహారాజావారు సహాధ్యాయులతో

## జీవితచరిత్ర

శ్రీమన్మహారాజ శ్రీ శ్రీ శ్రీ జయచామ రాజేంద్ర ఒడయరు బహద్దరుగారు 1919 సం|| జన్మించిరి. వీరు కీ. శే. మైసూరుయువరాజు కంఠీరవనరసింహరాజుగారి ఏకైక పుత్రులు. మైసూరు విశ్వవిద్యాలయమునందు మొదటి తరగతిలో బి. ఏ. ప్యాసయినారు. దేశచరిత్ర, రాజకీయములు వీరికభిమానవిద్యలు. మహారాజావారు హిస్టారికల్ అసోసియేషను గౌరవాధ్యక్షులుగా ఎన్నుకొనబడిరి. అంతర్జాతీయ వ్యవహారములను, భారతదేశ సమస్యలను నిర్విశేషముగా చర్చించి చక్కగా అవగాహన మొనర్చుకొనిరి. పట్టభద్రులయిన తరువాత రాజ్యపరిపాలనా ప్రజ్ఞకై ఇండియన్ సివిల్ సర్విస్ అధికారి ఎల్విన్‌గారివద్ద చక్కని శిక్షనందుచున్నారు.

నూతన మహారాజుగారికి సంగీతములోను, హిందీభాషలోను మంచి పరిజ్ఞానము కలదు.

శ్రీవారు మంచివక్త, గొప్పయుదారమనస్కులు. నిరాడంబరజీవి. వీరిపెద్దతండ్రి వలెనే వీరికి దైవభక్తి, ప్రజాదరణ, దేశసేవ, స్వదేశ పరిశ్రమాభిమానము మెండు.

వీరు తమతల్లి దండ్రులతో 1937 సం॥న విదేశ సంచారముచేసి వచ్చిరి. 1938 సం॥ మే నెలలో, చర్ఖారీ మహారాజాగారి సోదరియైన శ్రీమతి సత్యప్రేమాదేవిని పరిణయమాడిరి.

వీరు విక్రమనామ సం॥ భాద్రపద శుక్ల సప్తమి ఆదివారం (8-9-40) మైసూరు రాజ్యమునకు పట్టాభిషిక్తులై రత్నమయ కర్నాటక సింహాసనము నలంకరించిరి.

# రత్నసింహాసనము

మైసూరురాజులు పట్టాభిషిక్తులగు మహిమోపేతమైన రత్న సింహాసనము అత్యంత ప్రాచీనమైనది. పూర్వము హస్తినాపురమును పాలించిన యుధిష్ఠిర సార్వభౌముడు దర్బారు చేయుచుండిన భద్రసింహాసనమిది. దీనిని 'దంపులరాజ'ను నరేంద్రుడు తెచ్చి, పెనుగొండలో భూగర్భమున భద్రపరచెను. క్రీ. శె. 1336 లో విజయనగర సామ్రాజ్య స్థాపకులు దానిని బయటకుదీసిరి. తర్వాత ఒకటిన్నర శతాబ్ధమువరకు వారి స్వాధీనములోనే యుండి, కృష్ణదేవరాయలాది సార్వభౌముల మన్ననలను వడసినది. తదనంతరము శ్రీ రంగరాయలకది సంక్రమింప శ్రీరంగ పట్టణమునకు గొనితేబడినది. 1609 శ్రీరాజా ఒడయరు గారు శ్రీరంగపట్టణమును ముట్టడించి శ్రీ రంగరాయలును ఓడించి ఈరత్న సింహాసనమును వశముగావించుకొనిరి. అప్పటినుండి మైసూరు మహారాజులకు అది భద్రపీఠమై యొప్పుచున్నది.

ఈ సింహాసనము బంగారు కదళీ స్తంభములతోను, బంగారు మామిడియాకులతోను అలంకరించబడియున్నది. సోపానముల కిరుప్రక్కలను గంధర్వప్రతిమలతోను రెండు యాళిబొమ్మలతోను విరాజిల్లుచున్నది. సింహాసనముమీద శ్వేతచ్ఛత్రము చుట్టును ముత్యాలజాలీలు; శిఖరముమీద పిట్ట నవరత్న ఖచితమై నిగనిగలాడుచున్నది. కూర్చుండు ఆసనము కూర్మాకారము. నాల్గువైపులు చతురంగ బలస్వరూపముతో చెక్కబడియున్నది.

తూర్పున ఏనుగులు, పడమట పధాతులును, దక్షిణమున గుఱ్ఱములును ఉత్తరమున రథములును అమర్చబడియున్నవి. ఇవిగాక దక్షిణమున బ్రహ్మస్వరూపమును ఉత్తరమున శివస్వరూపమును మధ్య విష్ణుస్వరూపమును చిత్రింపబడియున్నవి. 4 మూలలలోను 4 సింహములును, దానిపై విజయునిచిత్రమును, 4 హంసలును, 2 శరభములు 2 గుఱ్ఱములు, పొందికగా చిత్రించి ఇమడ్చబడియున్నవి. దిగ్దేవతలను, నాగకన్యలనుకూడ అద్భుతముగా పొదిగించి నిర్మింపబడిన ఈ రత్నసింహాసనము కన్నులపండువై పూర్వపు శిల్పుల హస్తలాఘవమును ప్రదర్శించుచున్నది.



# ★ మన కర్తవ్యము



కర్తవ్య మెరుగని కార్యదీక్ష నేలవిడచిన సాముువంటిది. అనుసరణములోను, ఆచరణములోను ఆశయము అవగతమైన గృహపాలనాదక్షత పురపాలనా పద్ధతియందు కూడ జేజేల నందుకొనును.

కవికలహంసి
శ్రీమతి
చేబ్రోలు
సరస్వతీ దేవి



మన భారతదేశమునందు స్త్రీ పురుషుల జీవితచర్య ఒడిదుడుకులు లేక స్థిమితముగను గంభీరముగను ప్రశాంతముగను బరిపూర్ణమగు నున్నతాశయముతో నడువవలెనన్న వారి వారల ముఖ్య కర్తవ్యములను జక్కగా నెఱిగి గతులు దప్పక, నీతిప్రవర్తనములకు దూరముగాక, ధర్మము బాయక, యొకకంట దేశసేవోద్ధరణ దృష్టియు, నొకకంట సంఘోద్ధరణ దృష్టియు గలిగి సూటిగా సత్యనిర్ణీత ప్రణాళికమీదనే యడుగులు వేసి చరించవలయును. గతిదప్పిన ధృతితప్పు; ధృతితప్పిన మతితప్పు; మతితప్పిన సర్వము తారుమారై తలక్రిందులగును. గనుకనే మనబుద్ధుల కెట్టి రాగద్వేషములును దగులకుండ కాపాడుకోలేని నాడు దేహావసాన పర్యంతమున నెట్టి కార్యమును సాధింపలేక జీవితము వ్యర్థమై నశించిపోవలసినవారల మగుదుమని యీ దిగువ గీతావాక్యములచే తెల్లమగుచున్నవి.

శ్లో. క్రోధాద్భవతి సమ్మోహస్సమ్మోహాత్ స్మృతి విభ్రమః
స్మృతిభ్రంశాద్బుద్ధి నాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి.

ఈ సూత్రమును గ్రహించియే మనప్రాచీనులు మంచి యనుభవముగలవారగుటంజేసి యెట్టి పొరబాటులైనను నవలీలగ గెంటజాలునది విద్యయని గ్రహించి యట్టి స్త్రీ పురుషుల విద్యావిధానమును క్రియాకలాపమును ఇదమిద్ధమని నిర్ణయముజేసి శాసించిరి.

చిరస్థాపితమై, ఆచరణయోగ్యమై, సుకరమై, యాదర్శకంబై యిందు నందు బరమార్థ సాధకంబై యొప్పు యీ ధర్మపథమునుండి ఎట్లో మనము దూరమైపోయితిమి. ప్రాచీనమనుట తోడనే కొందరికి హేయముగ దోచుచున్నది. నవీనభావాకాశములోనే విహరింప ననేకులు యాతురపడుచున్నారు. మనకర్తవ్యము లేవియో, హక్కులేవియో, ఆచరణీయము లేవియో, అనుకరణీయము లేవియో చక్కగా నవగాహన మొనరించుకొనక ప్రమాదపడుచున్నాము.

పూర్వము హరిశ్చంద్ర పాండవ నలాది వీర నృపశిఖామణులు దురంత దుఃఖములకులోనై వనవాసాది క్లేశముల ననుభవించు సమయమున వారితోబాటు వారి ధర్మపత్నులును కడగండ్లకు సుస్వాగత

మొసగి ఆహ్వానించిరే, ఉద్ధానికి? తమతమ పవిత్రకర్తవ్యములను చక్కగా నెఱింగినవారు గనుక సౌఖ్యముల కాలదన్ని కష్టజీవితములనే కౌగలించుకొన్నారు. ఆదర్శవీరవనితా రత్నములైనారు. భారతభూమికి సింగారము నుఁ జేయించినారు.

వీరేగాక ఇటీవల పేరెన్నికగాంచిన మనోరమ, అహల్యాబాయి, లక్ష్మీబాయి; మహామాయ, సరస్వతిమున్నగు వీరమాతలును సాంఘిక, రాజకీయ ఆర్థికసంస్థలలో తలయొగ్గి తమకర్తవ్యమును సాంగోపాంగముగ నిర్వర్తింపజేసిరి. అప్పటి సౌభాగ్యస్థితిని చూచి భారతమాత దరహసితవదనారవిందయై కళకళలాడుచు తనగారాబు కూతులంజూచి ఆనందాశ్రువులరాల్చుచుండినది. మరి ఇప్పుడో విపరీతభావ పరిణామములలో జిక్కి 'పులినిజూచి నక్క వాతబెట్టుకొన్న'ట్లు పాశ్చాత్య అంధానుకరణంబుతో తైతక్కలాడుచు 'స్వధర్మే నిధనంశ్రేయః పరధర్మో భయావహః' అను ధర్మవాక్యమునకు దూరమై, కళావిహీనలై ప్రవర్తించు కూతులంజూచి పొగిలి పొగిలి దుఃఖాశ్రువులగ్రమ్మింగుచు బరితపింపవలసివచ్చె.

మనభారత సౌభాగ్యమును, పునరుద్ధరింపదలచితిమేని మొట్టమొదట మనజీవితపంథలో మార్పుగలుగవలయును. ఇప్పటి విద్యావిధానమును తొలగించి భారతవిజ్ఞానమునకు పునాదివేయు నిక్కమగు సక్రమ విద్యను బడయవలయును. పొట్టకూటికైనను యుపకరించని నేటివిద్యా విధానముతోనే తృప్తినందక మానవ జాతికి శ్రేయోదాయకమై, సంఘ సంస్కరణోపాయమై, అజ్ఞానతిమిర భాస్కరమై, స్వాతంత్ర్యభావోపేతమై, హృదయశక్తుల వృద్ధిగావించు విద్య నలవడజేసుకొనవలసి యున్నది.

ఇప్పుడిప్పుడు మనలో కొందరు న్యాయవాదినులై, ఉపాధ్యాయినులై, పండితాణిలై, వైద్యరత్నములై, జిల్లాబోర్డు అధ్యక్షిణులై, చేయిర్మనులయి వాసియు వన్నెయు గాంచుచుండు టెంతయు ముదావహము. అంతమాత్రములోనే తమసహజ ధర్మమగు గృహధర్మములకు తిలోదకములు విడువరాదు. గృహధర్మమున్నదని సేవాధర్మము, కళోపాసనను మరచిపోరాదు.

గృహపాలనములో, రాజకీయ, ఆర్థిక, సంఘ, సాహిత్య సంస్కరణములు నిమిడియేయున్నవి. కాని నిర్మాణములో చిన్నది. అదియే పెద్దదిగా విస్తరించినపుడు 'విశ్వమానవకల్యాణమునకై చేయుసేవ', 'దేశోద్ధరణకై సల్పుకృషి' అని వేరువేరు నామములతో నొప్పుచుండును. ఈ రెండింటికిని భావములో భేదములేక పోలేదు. ఒకటి స్వార్థము; రెండవది పరార్థము-ఇంతే భేదము.

గృహధర్మములను సక్రమముగా నెఱపుటలో స్త్రీలే సహజచాతుర్య ధురీణలు. క్షమాస్వరూపులు. ఎంతటి గౌరవోద్యోగములు జేయువారైనను గృహపాలనలో పురుషులు వెనుకకు తగ్గవలసినవారేకదా! గృహపాలనాదక్షతగలవారే పురపాలనాపద్ధతిలోను జేజేల నందుకొందురని దృష్టాంతముగా ఇప్పుడు కడపలో శ్రీమతి రామసుబ్బమ్మగారు జేగంట మ్రోగించుచున్నారు.

కావుననే గాంధిమహాత్ముడు సత్యాగ్రహమునకుగాని, దేశసేవకుగాని స్త్రీలే ముందంజవేయవలయునని నిత్యము చెప్పుచున్నాడు. పెక్కు సంవత్సరములనుండి భారతీయుల భావముక్తికై దీక్షవహించి, పడరానిపాట్లు పడుచు, క్లిష్టసమస్యల ధైర్యముగ నొక్కడై యెదుర్కొనుచు నిక్కమగు భారతపుత్రుడని పించుకొని తన సోదర సోదరీమణులను నీ కార్యరంగమున కహింసావిధానమున దయారుచేయుచున్న మహాత్ముడొక్కడే యిప్పట్ల మన కెయ్యెడలనైన శరణ్యము. గాంధిమహాత్ముని దేశనిర్మాణ కార్యక్రమపద్ధతి చాల

గొప్పది. ఆ మహాత్ముని యుద్దేశానుసారము 13 పద్ధతులలో ముఖ్యములగు వయోజనవిద్య, స్త్రీ సముద్ధరణ, ఆరోగ్యబోధ, మాతృభాషాప్రేమ, ఖాది, గ్రామపారిశుభ్రత మున్నగు విషయములు స్త్రీలే నిర్వహింపదగినవి. దానికి యర్హులు స్త్రీలే.

ప్రతి సమస్యకు నిర్మాణకార్యక్రమము సిద్ధముచేసికొని ప్రతి పల్లెలలోను, పట్టణములలోను స్త్రీ సదనములు నిర్మించి యుద్బోధ చేయవలయును. గృహబాధ్యతవహించునట్లే ఈ కార్యక్రమ భారమును ఇల్లాలే వహించవలె. ఇది తన ధర్మమని ప్రతి గృహలక్ష్మియు గ్రహించిననాడే మానవశ్రేయస్సు, లోక కల్యాణము తలచూపును.

మనలో భావస్వాతంత్ర్యము సమసిపోయి శతాబ్దములు కావచ్చినది. స్వతంత్రచింతన కవకాశమే లేదు. అందుచేత నేయభివృద్ధియులేక మైలురాయివలె నొక్కచోటనే యుండవలసినవారమైతిమి. ఇంతకంటె హైన్యము కలదా? అన్నింటికిని మూలకారణము సరియగు విద్యాగంధము వ్యాపింపకపోవుటయే. కావున తెలివితోపాటు హృదయమునుగూడ విశాలముచేయు విద్యనభ్యసించుటకు గర్తవ్యములెల్ల రెఱింగి పాటుపడి గమ్యస్థానము చేరువరకు తదేకదీక్షతో బనిచేయవలయును.

# మహిమోపేతుడు మహాత్ముడు

శ్రీరాముని సత్యశీలములు, శ్రీకృష్ణుని కార్యదీక్షాబుద్ధి కౌశలములు, బుద్ధుని త్యాగ అహింసాభావములు, సమ్మేళనము జెందినవి మహాత్మునియందు.

శా ర ద శే ఖ

మూవురవతారమూర్తుల జీవిత సారములను గంగా యమునా సరస్వతులవలె స్వీయజీవితమున మేళవింపజేసికొనిన మహావ్యక్తి మహాత్ముడు.

★ శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ ★

నెచ్చెలీ!

అక్టోబరు రెండవ తేది భారతీయులకు అత్యంతపవిత్రదినము! పుత్తలీబాయి గర్భశుక్తిముక్తా ఫలము! భారతాంబనోముల పంట! భారతీయులభాగ్య సర్వస్వము! శ్రీ మహాత్మా మోహన్ దాస్ కరంచంద్ గాంధి జన్మించిన శుభదినముగదా అది! భారతభూమి విదేశీయ పరిపాలనా పీడితయేయగుగాక, పారతంత్ర్యదాస్య శృంఖలానిబద్ధయేయగుగాక, దారిద్ర్యాంధకార నిమగ్నయేయగుగాక, పూజ్యతముడైన మహాత్ముని గనుభాగ్యము పొందగలిగినందుకు మాత్రము ఎంతయైన సంతసింపవచ్చును.

మహాత్ముడనిన మహాత్ముడా? ఎంత సత్యనిరతి! ఎంత త్యాగశీలత! ఎంత వైరాగ్యభావము! ఎంత ఈశ్వరవిశ్వాసము! ఎంత కార్యకౌశలము! ఎంత ధర్మానురాగము! ఎంత బుద్ధివైశద్యము! ఎంత రాజనీతిజ్ఞత! ఎంత ఆర్తరక్షణాకాంక్ష! ఎంత దేశాభిమానము! ఎంత నిరాడంబరజీవనము! ఎంత ఋజువర్తనము! ఎంత నియమపాలనము! ఎంత జనవశీకరణశక్తి! ఎంత అహింసాపరత్వము! అహో! ఎన్నియని చెప్పవచ్చును, సద్గుణంబులెల్ల సంఘంబులై వచ్చి, ప్రహ్లాదకుమారునియందు నిలిచినట్లు మహాత్మునియందు నిలిచి అతనికతడే సాటియనిపించుచున్నవి గదా!

కల్పలతా! రాముడు, కృష్ణుడు, బుద్ధుడు మున్నగు అవతారపురుషులగని భారతవర్షము మహాపురుషులకు పుట్టినిల్లను ఖ్యాతి నిదివరకే గాంచియున్నను మహాత్మునివంటి మహాపురుషుని గాంచుటచే నా విఖ్యాతి యింకను యినుమడించినది సుమా. ఏలనందువా? ఆ అవతారమూర్తులకంటె మహాత్ముని జీవితమే మిన్నయనిపించుచున్నది. చూడుము. శ్రీరాముడు సత్యనిరతుడే, శీలవ్రతుడే, అయిననేమి దుష్టశిక్షణకు పశుబలమునే ఆరాధించినాడు. శ్రీ కృష్ణుడు కార్యదక్షుడే, రాజనీతిజ్ఞుడే, యుక్తిపరుడే, అయిన నేమి ఋజుమార్గగామి కాడు. బుద్ధుడు అహింసానిరతుడే, త్యాగశీలుడే, అయిననేమి యీశ్వరవిశ్వాసిగాడు. అతని అహింసా ప్రచారముగూడ జంతుహింసా నివారణకే అధికముగా వినియోగపడినది. మహాత్మునియందో శ్రీరాముని సత్యశీలములు, శ్రీ కృష్ణుని కార్యదీక్షాబుద్ధి కౌశలములు, బుద్ధుని త్యాగ అహింసాభావములు, సమ్మేళనము జెందినవి కాన మూవురవతారమూర్తుల జీవితసారములను గంగా యమున సరస్వతులవలె స్వీయజీవితమున

మేళవింపజేసికొని జన్మించిన మహావ్యక్తి మహాత్మాగాంధి. అన్నిటికన్న అహింస విషయమై మహాత్ముడు పల్కెడి సూక్తులు, చేసెడి నిర్వచనములు, పాటించెడి ధర్మములు, ఆచరించెడి నియమములు ఎంత మహత్తరములై యున్నవో చూచుచుంటివా ?

త్రికరణశుద్ధిగ అహింసను పాటింపవలయునట. మనోవాక్కర్మంబుల నెందును పరహింస పనికి రాదట. దౌర్జన్యములో సంపాదింపబడిన దేవరాజ్యమైనను పరిత్యాజ్యమేనట. తన ప్రాణమొడ్డునేగాని పరప్రాణహింసకు తానొప్పడట. హిందూస్థానమునకు స్వరాజ్యసిద్ధి అహింసద్వారానే కలిగి అహింస ద్వారానే పాలింపబడవలయునట. ఇదియే ఆయన ఆదర్శమట. ఇట్లు కానిచో తనకు కాంగ్రెసు సారధ్యమే వలదట. పశుబలమునందును, ఆయుధసంపత్తియందును స్వసామర్థ్యమునందును విశ్వాసముగల నాయకులు వీని నెట్లంగీకరింతురు ? "మహాత్మా, మావల్లగాదని" నారు "ఒకవేళ అహింసద్వారా రాజ్యమును సంపాదింప గలిగినను రక్షించుట మాత్రము మాకు సాధ్యముగాదని" నారు. మహాబలాన్వితమైన బ్రిటిష్ సామ్రాజ్య హస్త గతమైయున్న రాజ్యమును స్వాయత్తముచేసికొనుటకు అహింసకు సాధ్యమైనచో దాని రక్షణమాత్రమేల సాధ్యముగాదని ఒక మందహాసముచేసి మహాత్ముడు పైదొలగినాడు. కాని, యిరువది సంవత్సరములనుండి అహింస నాధారపఱచుకొని తాను నేతయై నడపుచున్న కాంగ్రెసు, తన్ననుసరించుచున్న ప్రజానాయకులు, దౌర్జన్యరాహిత్య సిద్ధాంతము నొక్కమారు గోటమీటి దేశరక్షణ వ్యాజమున పశుబలమునాకాంక్షించు వారైనపుడు మహాత్ముడెంత గాఢతర విషాదమును జెందెనో హరిజను పత్రికలో ఆయనవ్రాసిన వ్యాసములు విశదపఱచినవి. సముద్ర మథనమునందు ఉద్భవించిన హాలాహలమును పరమశివుడు కంఠస్థము చేసికొనినట్లు స్వరాజ్యామృతమును యేకైకనాయకుడుగానైనా అహింసద్వారా బడయుటకు కృత నిశ్చయుడైనాడు. ప్రపంచమునకంతటికి మార్గదర్శకము కాగల అహింసాసిద్ధాంతముయొక్క బిగువు సడలించుటచే కాంగ్రెసు బిగువును సడలినట్లైనది. కాంగ్రెసు నాయకులలోగలిగిన యీ అభిప్రాయభేదముల నాధారముగా చూచు కొని ప్రభుత్వమువారి బిగువు హెచ్చినది. అభిప్రాయభేదములతోను, మత భేదములతోను కొట్టుకొనుచున్న యీ భారతవర్షమునకు వారెంతమాత్రము స్వరాజ్యము ప్రసాదించరట. ఈ హిందూస్థానమున వసించు నానాజాతులవారు అన్యోన్యకలహములులేక సురక్షితముగా నుండుటకు తమ పరిపాలన యీ దేశమునకు ఎల్లప్పుడును అవసరమేనట. రాజప్రతినిధియు, యిండియా మంత్రియు నీ విధముగా నిక్కచ్చిగా తెలుపుటతో నాయకుల తలలు తిరిగిపోయినవి. ఇట్టి సంధిగ్ధసమయములో కాంగ్రెసు నేతృత్వము వహింపగల సామర్థ్యమెవరికున్నది ? మహాత్మునకే కాని అహింసా సిద్ధాంతమును సంపూర్ణముగా కాంగ్రెసు చేపట్టకున్న మహాత్ముడు నాయకత్వమువహించునా ? కాన స్వరాజ్యసిద్ధికి అహింసయేమూలము. మహాత్ముడే నాయకుడు.

ప్రపంచమంతయు అహింసాదౌర్జన్యములచే కల్లోలితమైపోవుచున్నది. మానవత్వము నశించినది. పశుత్వము విలయతాండవము చేయుచు మానవవినాశమునకు దొరకొనుచున్నది. నాగరకతాగ్రగణ్యమైన పశ్చిమఖండమంతయు ఈ పశుబలారాధనలో జిక్కుకొని ఆహుతియగుచున్నది. నిరపరాధులగు స్త్రీలు బిడ్డలుగూడ ఈ మారణకర్మంబునకెరయై అసువుల గోల్పోవుచున్నారు. పశ్చిమఖండవాసులు అఖండ పశు బలారాధనవలన పొందుచున్న విపత్పరంపరల వినుచున్న గుండెలు వ్రయ్యలగుచున్నవి. కాన యిదియే భారతీయులకును ఆరాధ్యమగుచో మహాత్మునివంటి అహింసాయోగినిగన్న భారతవర్షముయొక్క విశేషమే యేమిగలదు ? మహాత్ముడు కారణజన్ముడు గాని మానవమాత్రుడుగాడు. ఇటీవల మహాత్ముడు గావించిన

## విజయదశమి

ఒకానొక ప్రకటనలో ప్రస్తుత సంగ్రామానల జ్వాలల జల్లార్చుటకు అహింసయే ముఖ్యసాధనమనియు, అది భారతీయులవల్లనే సాధింపబడవలయుననియు వాక్రుచ్చినాడు. ఇక దానికి మహాత్ముడే నాయకత్వము వహించునని వేరే చెప్పవలయునా? శాంతి సమరము మరల సాగింపబడనున్నది. మహాత్ముడు అహింసా శంఖమును విశ్వమోహనముగ పూరింపబోవుచున్నాడు. ఈమారు భారతవర్షమేగాక యావత్ప్రపంచము నాతని ననుగమించును. మహాత్ముని దివ్యాదర్శము సఫలమైతీరును. నిజతపశ్శక్తిచే ముజ్జగంబుల నుఱ్ఱూత లూగించిన మహర్షులకు కాణాచియైన భారతవర్షము మహాత్మునిద్వారా నిఖిల ప్రపంచమునకు అహింసా సందేశము నొసంగి తన ఆర్యసంప్రదాయమును నిలబెట్టుకొనును.

ఇట్టి సత్సమయమున మనముగూడ యీ ఆర్యావర్తమున నుదయించి అమ్మహాత్మునకు సమకాలికులమై ఆయన దివ్యబోధనలను నాలించుభాగ్యము గల్గుట నిజముగా మన బహుజన్మసుకృత పరిపాకమే; సందియములేదు. అయితే ఇట్టి మహాత్ముడు మనవాడని చెప్పుకొని మురియుటతో ప్రయోజనములేదు. ఆయన బోధించెడి ధర్మములకు బద్ధులమై ఆయనచెప్పెడి విధమున వర్తించినపుడే మన ధర్మమును మనము నిర్వర్తించినవారమగుదుము. అఖిలదేశములందలి ప్రాజ్ఞులు మహాత్ముని ధర్మోపదేశములచే ఆకర్షితులై ఆయనను సేవింప సేవాగ్రామమునకు విచ్చేయుచున్నపుడు భారతవర్షమున నుదయించియు ఆతని మహత్తును తెలిసికొనజాలక పోతిమేని మనకంటె అజ్ఞానులు లేరనియే చెప్పవలయును గదా. కల్పలతా! అట్టి అవివేకమతులంగాక భారతీయులెల్లరు మహాత్మననుసరింతురుగాక! పూజ్యతముడైన మహాత్ముడు చిరంజీవియై వర్ధిల్లునుగాక!

## విజయదశమి

బ్రహ్మభార్యను పూజించి బ్రాహ్మణుండు
శస్త్రపూజలు జరిపియు క్షత్రియుండు
అరకలంటిని పూజించి హాయిగాను
వైశ్యుడుండిన నాడెగా విజయదశమి!

క్రొత్తదుస్తులు ధరియించి కోటుదొడిగి
జొన్నకంకులు తలపాగ జొనిపి జొనిపి
సమరమందున జయమందు శూరుడోలె
వైశ్యుడుండిన నాడెగా విజయదశమి!

పొలముకాపురు పనులన్ని పూర్తిగాగ
పాలకులు కాపువారల పలుకరించి
శత్రురాజుల మీదికి సైన్యమంపి
విజయశంఖుఁ బూరించుగా విజయదశమి!

వల్లభనేని రంగాదేవి
కే. యస్. రత్నాదేవి

# యుద్ధరంగము

★ లండనుపై జర్మనీ దాడులు

★ ఈజిప్టుపై ముసోలినీ ముష్కరత

★ ఇండో చైనాపై జపాను ఒత్తిడి

★ అరుంధతి ★

ఇది నవయుగ నిర్మాణమో, నవయుగ నాశనమో బోధపడటంలేదు. పలుముఖాల విజ్ఞానాన్ని వృద్ధిచేసి, ప్రకృతిని జయించి లోబరుచుకుంటూ విశ్వప్రయత్నాలుచేసి నిర్మించిన నేటి సభ్యత పరరాజ్యాక్రమణకు, నరరక్త దాహమునకూనా? యుద్ధం ప్రారంభమైనప్పటినుండీ యీ రెండు వికృతశక్తులేకాక మరి వేరు ప్రయోజనమేముంది? సంవత్సరం దాటీ దాటడంతోటే, జర్మనీ ముష్కరత ఎనిమిది రాజ్యాలలో మానవసభ్యతను దిగ్భ్రమింగింది. 'తృష్ణ' వికృతరూపంతో హిట్లరులో రాక్షసత్వాన్ని దాల్చి కరడుగట్టుకు పోయింది. లేకపోతే యింతటి దారుణ మారణహోమం జరగడానికి తావేదీ?—

పాశ్చాత్య నాగరికతకు ఆటపట్టైన ఫ్రాన్సు, కళాకౌశలంలో వన్నెమీరిన ఫ్రాన్సు, స్వాతంత్ర్య జీవికకు ప్రాణప్రదమైన ఫ్రాన్సు - వారంరోజులైనా పోరాడకుండా హిట్లరుకు లొంగిపోయిందంటే, నేటి యుద్ధంలో జర్మనీ దుండగాలయొక్క పరిమితి తెలుస్తుంది.—

ఫ్రాన్సు పతనం - వెంటనే ఇంగ్లండుపై ప్రయోగిస్తున్నాడు హిట్లరు తన పరాక్రమాన్నంతా అప్పుడే రెండు మాసములుగా సాగుతోంది అతని విజృంభణ. - ఆకాశాన్ని చించుకుని అగ్నిజ్వాలలు కురుస్తున్నాయి - సముద్రం కళవళపడిపోయి ఓడలను దిగ్భ్రమింగుతూవుంది. సుమారు 70 చదరపుమైళ్లు పరిమితిగలిగిన బ్రహ్మాండమైన పట్టణం, సుమారు కోటి జనసంఖ్యగల మహానగరం తరతరాలుగా చీమలుపుట్టలు కట్టినట్లుగా కట్టుకువచ్చిన సుందరనగరం లండన్ - యీ అఘాతాలకు పాలౌతోంది. - బర్మింగుహామ్ పాలెస్, వెస్టుమినిస్టర్ అబే మొదలైన కట్టడాలు బాంబు తాకిడులకు గురి ఔతున్నాయి. అయినా సహజ ధైర్యప్రతాపులైన బ్రిటిష్ పౌరులు వీటికి జంకిపోవటంలేదు - నిగ్రహంచూపి జర్మన్ దాడికి ప్రతీకారం చేస్తూనేవున్నారు. బ్రిటిషు విమానాలు తమ స్వదేశాన్ని కాపాడుకోవటమే గాక బర్లిన్‌పై దాడివెడలి అచ్చట ముఖ్యమైన యుద్ధ కర్మాగారాలమీద బాంబులు వర్షించి వస్తున్నాయి. ఏకైకజోదువలె ఇంగ్లండు ఒక్కటే జర్మనీతో పోరుతూంటే, దాన్ని జయించలేక రెండునెలలుగా హిట్లరు అస్తవ్యస్తమౌతున్నాడు.

ఇంగ్లాండుయొక్క పటిమనుచూచి ఇక చేసేదిలేక యితరరాజ్యాలసు ఇంగ్లండుపై పురికొల్పు తున్నాడు హిట్లర్.

ఇటలీని లేవదీసి ఆఫ్రికాఖండంవైపు అల్లరి ప్రారంభించాడు. ముందుగా సోమలీలాండును లోబరుచుకుని ఈజిప్టును దిగమ్రింగడానికి బయలుదేరాడు ముసోలిని. ఈజిప్టు పరిసరాల్లో చాలావరకు ఇటాలియను సైన్యాలు చొరబడ్డాయి. ఈజిప్టును జయించి, సూయిజ్ కాలవను బంధించి, మధ్యధరాలో సర్వాధిపత్యాన్ని చలాయించాలని ముసోలినీ ఆశ. ఇదేకాకుండా ఫ్రెంచివారి సిరియాపైకూడా కాలు దువ్వుతున్నాడు ముసోలినీ. కాని ఈజిప్టులోను, పాలస్టైన్‌లోను బ్రిటిషు సైన్యాలు చాలా వుండడంవల్ల ముసోలినీకి ధైర్యం చాలడంలేదు. ఇందుకు తోడుపడటానికే కాబోలు రిబ్బన్‌ట్రాప్ జర్మనీనుండి యిటలీకి పోయి ముసోలినీతో ఏవో మంతనాలు జరుపుతున్నాడు.

ఇక మధ్యధరాసముద్రంలో జిబ్రాల్టరు కోట అభేద్యమైనది బ్రిటిషువారికి వుంది. ఈ ద్వారాన్ని కూడా బంధించినట్లయితే అటు సూయిజ్ ద్వారం - యిటు మధ్యధరా ద్వారం - రెండూ నిరుపయోగాలై బ్రిటిషువారికి సహాయం సన్నగిల్లిపోతుందని హిట్లర్ ఆశించి పన్నిన పన్నాగమిది. అందుకోసం స్పెయిన్‌ను కూడా యుద్ధంలోకి దింపాలని ఫ్రాంకోను లోబరుచుకున్నాడు. ఎంతమందికూడినా జిబ్రాల్టరు ఉక్కు కోటలను బ్రద్దలుచేయజాలడం కలలోని వార్త. అక్కడ బ్రిటిష్ నావలు, విమానాలు అప్రమత్తతతో తిరుగుతూ కాపాడుతూనే వున్నాయి.

ఇది చాలక తూర్పుఖండంలో జపాన్‌కు హుషారిచ్చి బ్రిటిష్ నౌకాస్థానాలకి, వ్యాపారస్థానాలకి ఒత్తిడి కలగజేస్తున్నాడు. ముందుగా ఫ్రెంచి ఇండోచైనాను స్వాధీనంచేసుకుని సింగపూరురేవును ముట్టడించాలని ప్రయత్నాలు చేస్తూవుంది ఇటు జపాన్.

జర్మనీ, ఇటలీ, స్పెయిన్, జపాన్—యీ నాలుగుదేశాలు ఒక్కమారుగా విజృంభించి, నాలుగు వైపులా విరుచుకుపడి ఇంగ్లండును ఓడించివేయాలనే ఆశతో హిట్లరువేసిన ఎత్తు ఇది.

కాని, ఇంతమందికీ జబాబుగా బ్రిటన్ తన ఆయుధసంపత్తిని సమీకరింపజేసుకొని, అన్ని యుద్ధ రంగములలోను శత్రువులను ఎదుర్కొని తగినశాస్తి చేస్తూనేవుంది.

రెండు మాసములుగా సాగుచున్న యీ విపరీత విలయతాండవములో యీ నాలుగుదేశాలు బ్రిటనును ఏమిచేయగలిగినవి? బ్రిటిష్ సింహమువద్దనా యీ కుప్పిగంతులు ?

ఏది ఎటులున్నా, యుద్ధముమాత్రము తీవ్రరూపం దాల్చుతోంది నానాటికి. ధర్మబలము, స్వాతంత్ర్యదేశముల సానుభూతి నీగల బ్రిటన్‌యొక్క అచంచలస్థానమును యీ రాక్షసబలము ఏమాత్రమూ కదలించలేదనడంలో అతిశయోక్తి లేదు—

(25.9.40)




## దసరా సంచిక

జగత్సృష్టికి మూలకారణము స్త్రీ శక్తి. ఈ ఆదిశక్తికి తమతమ విధేయతల దెల్పుటయు, ఆమె నన్నివిధముల గౌరవించి, పూజించి, అగ్రస్థాన మధిరోహించునట్లు చేసినగాని, తమ కభ్యున్నతిలేదని అర్పించుటయు—దేవీపూజలలోని అంతరార్థము.

ఈ పరాశక్తిలోని పవిత్రభావమును మన మవగతముచేసికొన్న, నేడు కేవల సాంకేతికమైయున్న యీ 'పూజ'లలోని అంతరార్థము తేటపడగలదు.

దసరా దినములలో భారతదేశమంతయు యీ శక్తిస్వరూపిణికి పూజలుసల్పి ఆరాధించుచున్నది. కాని, 'శక్తిస్వరూపిణి' అనిన ఒక విగ్రహముమాత్రమే గాదు. ఆ యమయందు మూర్తీభవించియున్న వివిధ శక్తులు - ధైర్యము, స్థైర్యము, సాహసము, ఉత్సాహము, సత్యము, హృదయనైర్మల్యము, ఏకాగ్రత—

ఈ ధీరోదాత్తమగు సద్గుణపుంజముల కాకరమైన ఆ యాకారము, ఒక చిహ్నము మాత్రముగా వెలసి, తమతమ జీవితక్రమములయం దనుష్ఠించవలసినదిగా మనుజకోటిని హెచ్చరించుచున్నది.

ఇట్టి ఉత్తేజకరములైన దేవీప్రసాదిత వివిధశక్తులను మనలో వ్యాపింపజేసికొని, మన ధర్మములను ఒకసారి మననముజేసికొని, జాత్యభివృద్ధికి కొంగ్రొత్తరేఖల దిద్దవలసియుండుటయు—

సనాతన, అధునాతన సంఘవ్యవస్థల సంధికాలములో మన విధులను సంఘ పురోభివృద్ధి కనువగు సత్క్రమపద్ధతులపై నడపవలసియుండుటయు—

ప్రాచ్య,పాశ్చాత్య నాగరికపద్ధతులు దినదినము హెచ్చుపెరిగి, యిరువైపుల పోటీశక్తుల ప్రసరించుచు, అస్థిరత్వమును ప్రబలమొనర్చుచున్న - నేటి వర్తమాన పరిస్థితులలో నిబ్బరమునుకూడ దీసుకొని, నిలకడగా నిలబడవలసియుండుటయు —

—నేటి స్త్రీ పురుషుల నెదుర్కొనుచున్న పెద్ద సమస్యలు.

ఈ భావప్రవాహముల ఒత్తిడిలో యీ సమస్యలను పరిష్కరించుకొని చెక్కుచెదరని పద్ధతుల నిర్మాణము చేసుకొనవలసియున్నది.

దీనికి భావములు, భావములకు దగిన భాష, అనుసరణీయమై, ఆచరణయోగ్యమైన పంథాలు - మనకు కావలసియున్నవి.

—ఇట్టి వివిధభావముల కేంద్రీకరణమే యీ దసరా సంచిక.

కోరికను మన్నించి, తోడనే చాల తక్కువవ్యవధిలో, తమతమ రచనలను మాకందిచ్చి, యిందుకు తోడ్పడిన వివిధ రచయితలకు మా కృతజ్ఞతను తెలియజేయుచున్నాము.

వ్యవధిలేమిచేతను, స్థలాభావముచేతను కొందరి రచనలను ప్రకటింపలేకపోవుటను దయతో మన్నింప వేడికోలు.

కాగితపు కరువు పరిస్థితులలో యిట్టి ప్రత్యేక సంచికను ప్రకటించుట మాది సాహసమేయైనను, ఆంధ్ర సోదర సోదరీమణుల వాత్సల్య ప్రోత్సాహములే మమ్ముల పురిగొల్పినవని చెప్పక తప్పదు.

'దసరా సంచిక' నామూలాంతము తిలకించినంత, ఒక క్రొత్తదనమును ప్రస్ఫుటముజేయగల భావజ్యోతులిందలి విషయములైనచో, మా యాశయము నెరవేరగలదు.

ఇది పాఠకులే నిర్ణయించవలసియున్నది. వారు ఆయా విషయములను మాకు దెలియజేసిన భావి పత్రికాభివృద్ధికి దోహదమొనర్చిన వారలగుదురనికూడ మనవి చేయుచున్నాము.

*　　　*　　　*　　　*

## మహాత్ముని జన్మదినోత్సవము

అక్టోబరు రెండవతేది - అఖిలభారత పర్వదినము. భారతమాత నోములపంట - గాంధిమహాత్ముని జన్మదినము.

సత్యాహింసలతో సర్వ ప్రపంచము నందును శాంతిసామ్రాజ్యమును స్థాపింప సంకల్పసిద్ధుడైన మహాత్ముని జన్మదిన మహోత్సవములు ఆసేతుశీతనగపర్యంతము అతి వైభవముతో అక్టోబరు రెండవ తేదీ నుండి దశవాసరములు జరుపబడనున్నవి. ఆబాలగోపాలమును అందు పాల్గొని, మహాత్ముని ఆశయములను త్రికరణశుద్ధిగా ఆచరించెదమని దీక్షబూన వలసిన పవిత్రదినములవి.

మహిమోపేతుడైన మహాత్మునికి సమకాలికులమై, ఆయన దివ్యబోధల వినుటకు మనమునోచికొనుట ఎంతయు మన యదృష్టము.

'రామరాజ్యము'ని వేనోళ్ల నుతినొంది, పురాణప్రసిద్ధమైన శ్రీరాముని యవతార కాలమునందు గూడ ఆయనను విమర్శించువారు లేకపోలేదు—

గీతావాక్యములతో ధర్మ ప్రతిష్ఠాపన మొనర్చిన శ్రీ కృష్ణుని కాలమునగూడ ఆయనను ద్వేషించు వారు లేకపోలేదు—

అట్లే, కలియుగ పురుషుడైన మహాత్ముని బోధలను హేళనచేయు ప్రబుద్ధులు కూడ యుండుట జూడ యది లోకముయొక్క పోకడగాబోలు!

గత వివిధ సమయములయందు మహాత్మునియొక్క మహత్తర కార్యాచరణములను గమనించియుండియు ఆయన పెంచిన బిడ్డవంటి కాంగ్రెసు మహాసంస్థకూడ సత్య, అహింసా సూత్రములను పాటించుటకు

హద్దుకోరి, చేయునదిలేక ‘ అన్యథాశరణంనాస్తి ’ అని తిరిగి మహాత్ముని వేడుకొనవలసి వచ్చినది. తిరిగి మహాత్ముని మహత్తు ప్రపంచమున కొకసారి వెల్లడియైనది.

మహిమోపేతుడు మహాత్ముడు కాంగ్రెసు సారథ్యమును స్వీకరించినాడు. విశ్వమానవ సౌభ్రాతృత్వమును స్థాపింప సమకట్టి రథమును నడుపుచున్నాడు. ప్రపంచ చరిత్రలో నూతనయుగారంభమును సృష్టింపనున్నాడు. కలియుగమందు కృతయుగ ధర్మమును స్థాపింప యుగప్రవక్త కానున్నాడు——

‘ అహింసా చరణము ’, ‘ ఖద్దరు వస్త్రధారణము ’ మొదలైన పవిత్రవ్రతములను జపింపుచు, మహాత్ముని మనోవాక్కాయ కర్మల ననుసరించుచు, యీ దేవీనవరాత్రోత్సవ పర్వదినములలో, యీ మహాత్ముని జన్మదినోత్సవ శుభదినములలో మనమీ దీక్షాకంకణమును ధరింతుము గాక !



Edited by Dr. K. N. Kesari, Printed and Published by Dr. S. Seshagiri Rao,
at the Lodhra Press, 15, Westcott Road, Royapettah, Madras.